# వైశ్యవిద్యాభానూదయ

వ్రాయువారు:—

శ్రీయుత ఉడత్తు వెంకటేశ్వర్లుగా

మహాబువర్తకులు,

బందరు.

అనివార్య

ఓమ్.

మూల.

# విద్యాభానూదయము.



వైశ్యులకేగాక, అన్ని సంఘములవారికిని
ఉపయుక్తమగు

ఈ గ్రంథము

బృందావన నగర వైశ్యులచే

ప్రచురింపబడి,







తెనాలి, భారతీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1934

ద్వితీయ ముద్రణము 1000 ప్రతులు.



శ్రీ మామిడి వేంకటార్యుల వారి జీవితచరిత్ర సంగ్రహము.

వైశ్యకులోద్భవుండును, శ్రీమద్వేదోక్తార్యాద్వైతమతము నుద్ధరించినవారును, సంస్కృతాంధ్ర సాహిత్యములచే ప్రకాశించినవారును, సంస్కృతాంధ్రాలంకారాది గ్రంథరచనలయందు నేర్పరులును, బృందావన, నగర సంస్థానములయందు ప డితకట్నములచే సన్మానింపబడినవారును, శబ్దార్థ కల్పతర్వాది నానాగ్రంథములను రచియించిన సమర్థులును, అష్టావధాన శతావధానములయందు నిపుణులును, ఇంగ్లీషువారివలన వేయివరహాలచే సన్మానింప బడిన వారును, పండితరాయలను బిరుదము వహించినవారును, అద్వైత మతనిష్ఠులైన [illegible], చెన్నపురి పండిత న్యాయసభయందు ప్రథమ పండితులును, శ్రీ శంక[illegible] శిష్యులును, నానామతములు దెలిసినవారును, అగు శ్రీ మామిడి [illegible]ార్యులవారు. జననం **1764.** నిర్యాణం **1845.**



## శ్రీ ఆ। లక్ష్మీనృసింహ సోమయాజులవారి జీవితచరిత్ర సంగ్రహము.

వైశ్యకులోద్భవుండును, సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, జర్మన్ భాషా ప్రవీణుండను, బి యే., బి. యల్., డి.జి. డబ్లియు. సి. టి., ఇత్యాది బిరుదాంకితులును, వేద వేదాంత పురాణేతిహాస గూఢార్థ ప్రతిపాదకుండును, డిస్ట్రిక్టు మునిసిఫ్ న్యాయస్థానాలంకృతుండును, కరింగాల్ జమీన్దారును, చతుర్వేద షట్ శాస్త్ర పారాయణుండును, వేదోక్త ధర్మ ప్రచారకుండును, అగు బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులవారు.

జననం 1845. నిర్యాణం 1901

# పీఠిక

## బెజవాడ వైశ్యులకు విజ్ఞాపనము.

అను శీర్షికతో పదికరపత్రము లిందు సంపుటీకరణము గావింపబడినవి. ఇయ్యవి ప్రత్యేకముగ బెజవాడ వైశ్యుల కొరకు ఉద్దేశింపబడినను, యిందలి ప్రబోధము వైశ్యమహా జనులందరికి నుపయుక్తమగునని మాయాశయము. ప్రతిదినము అనేక ప్రాంతములనుండి ఈకరపత్రములను బంపుడని మా సంఘము వారికి వర్తమానములు వచ్చుచుండుటచే, కర్చుకాగా పెంచిన కొలది పత్రములను మాత్రము మేము ఒకసంపుటము క్రిందచేర్చి వారికి పంపదలచుకొనియున్నాము.

ప్రపంచమునందంతటను ఒకగొప్ప సంచలనముకలిగి మానవాభ్యుదమునకై తీవ్రసంఘర్షణ జరుగుచున్నది. రాజ్యాంగములు తారుమారగుచున్నవి. మతములు నూతన చైతన్యముతో నింపబడుచున్నవి. సంఘములు దేశకాలానుగుణ్యముగ సంస్కారము నొందుచున్నవి. ప్రతివర్ణమువారును తమ జన్మహక్కులకై పోరాటములు సల్పుచున్నారు. ఇవి యన్నియు దేశకల్యాణమునకే తోడ్పడుచున్నవనుటకు సందియములేదు. అజ్ఞానమెంతవరకు వ్యాపించియుండునో అంతవరకు సోమరితనము దాస్యము దరిద్రము దుఃఖము ఇవి ప్రబలముగా నుండును. అట్టి అజ్ఞానమును నశింపజేయునది విద్యయొక్కటియే అయియున్నది. ఈమూలకారణమును గుర్తెఱిగి

హిందూదేశములోని ప్రతిసంఘమువారును, తమ తమ సంఘములలోని లోపములను సవరించుకొనుచు విద్యావ్యాప్తికై విశేషవిద్యానిధిని వసూలుపఱచి తమసంఘములోని బీదవిద్యార్థులకు విద్యాదానముచేయుచు విద్యావ్యాప్తి చేయుచున్నారు. మాలమాదిగెలు, పాకీవాండ్రు, పల్లెవాండ్రు భోగమువాండ్రు నిమ్నజాతులు యిత్యాది సంఘముల వారిదివరకే మేలుకొని తాముకూడ పవిత్రమైన హిందూజాతికి చెందిన వారమని వాదించి తమహక్కులు నిలువబెట్టుకొనుచుండుటయేగాక,తమ సంఘములలో విద్యావ్యాప్తికూడ చేయుచున్నారు. ఇట్టిస్థితిలో పరమేశ్వరుని ఊరుభాగము (తొడలు) నుండి యుద్భవించి వేదాధికారముగల ద్విజులలోచేరి, అనేక చక్రవర్తులు, వీరులు పండితాగ్రేసరులు, దానపరులు, యజ్ఞయాగాది శ్రౌతకర్మానుష్ఠాతలు వణిక్శ్రేష్ఠులు మున్నగు మహనీయులకాలవాలమైన ఈ వైశ్యజాతినంతను సంకరులని కొందరు స్వార్థపరులు దూషించియుండినను దానియందు దోషములేదని వాదించు వైశ్యప్రముఖులు మన సంఘములో నేటివరకు నిలిచియుండుటచే వైశ్యులలో విద్య ఎంతహీనస్థితియందున్నదో తెలియగలదు.

భారతదేశమునంగల సంఘములన్నియు దేశమాతకు శరీరావయవములు. ఇందులో వైశ్యసంఘము ఆమెకు ఊరు [తొడలు] ప్రదేశమైయున్నది. దేహమంతయు ఆరోగ్యముగా నుండవలెనన్న ఊరుభాగము కూడ ఆరోగ్యముగానున్నప్పుడే అట్లుజరుగగలదు. కాని దేశజననియొక్క ఊరుభాగ

మైన వైశ్యజాతియిప్పుడు బొత్తిగా విద్యాశూన్యులై వికాస రహితులై, సంచలనములేక స్తబ్ధతజెంది యున్నారు. ఊరు భాగమున నాడీచలనము లేనట్టియు, ప్రాణస్పందము కనుపర్చ నట్టియు, ఈవైశ్యసంఘము దేశమంతకు నష్టదాయకము కాగలదు. దేశమాత అభ్యుదయము జెందవలెనన్న తక్కిన అన్నిసంఘములవలె వైశ్యసంఘముకూడ ప్రాణశక్తిని సంపా దించి విద్యావ్యాప్తివలన అజ్ఞాన దాస్యకూపములనుండి లేచి జ్ఞానస్వాతంత్రమును పొందవలసిన అవసరముకలదు. వైశ్యులు ఆగర్భశ్రీమంతులయ్యును ఇట్టి అజ్ఞానదాస్యమున మునిగియుండి యితరులచే నీచులుగ పరిగణింపబడుటకు కారణము విద్య లేకపోవుటయే అయియున్నది. మేమిప్పుడు ప్రచురించిన ఈ కరపత్రములయొక్క యుద్దేశ్యములు రెండు-వైశ్యులు అనాది నుండియు పరిశుద్ధులనియు వీరికిశ్రౌతస్మార్తాది సంపూర్ణకర్మాధి కారముగలదనియు స్థాపించుట మొదటియుద్దేశ్యము. విద్యలేని కారణమున వైశ్యులు పరనిందలకు పాల్పడియున్నందున, అన్ని సంఘములతో బాటు తాము శీఘ్రముగా విద్యావంతులై తిరిగి గౌరవమును సంపాదింపవలయునని ప్రబోధమొనర్చుట రెండవయుద్దేశ్యము! ఈరెండు యుద్దేశ్యములే మమీ్మయుద్య మమునకు బురికొల్పినవి కాని అన్యముకాదు. వైశ్యవిద్యా వ్యాపనకై మేముకావించు కృషికి తక్కిన వర్ణములవారు కూడ మాకుతోడ్పడగలందులకు ప్రార్థితులు. ఇతరులసహాయ మొకవేళలేకున్నను వైశ్యవర్ణమువారింకను నిద్రబోవుచుండుట పాడికాదు. వైశ్యవిద్యాభివృద్ధికై అవలంబించవలసిన విధా

నము 10 నెంబరు కరపత్రములో వివరింపబడియున్నది. కేవల విద్యావిషయమైయ్యేగాక తక్కినవిషయములలోకూడా వైశ్యులు అభివృద్ధిమార్గములను ద్రొక్కవలసియున్నారు. ఈయభివృద్ధిమార్గములను సూచింపుచు 1925 సంవత్సరములో ప్రకటింపబడిన "బెజవాడ వైశ్యసోదరులకు విజ్ఞాపనము" అను వ్యాసమును నె1రు అనుబంధముగాను వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థకు 'మండనముండనము' అనుపేరుతో 1926లో ప్రకటింపబడిన ఖండనవ్యాసనమును నె2రు అనుబంధముగాను ఇందులో చేర్చడమైనది. ఈసంపుటమును సావధానముగ చిత్తగించి వైశ్యులు తమతమ గ్రామములలో వైశ్యవిద్యాభివృద్ధికి పూనుకొనగలందులకు ప్రార్థించుచున్నాము.

బెజవాడ
24—10—29

ఇట్లువిన్నవించు
వైశ్యవేదోక్తసంస్కారప్రోత్సాహక
సంఘము.

# ద్వితీయముద్రణమునకు

## పీఠిక.

ఈగ్రంథముయొక్క ప్రథమ ముద్రణమునకు కొలది ప్రతులు మాత్రమే ముద్రింపబడినవి. ఆప్రతులు ఆంధ్ర రాష్ట్రములోని వైశ్యప్రముఖులందరకు నుచితముగాపంపబడెను. ఈగ్రంథమును పఠించినవారు న్యాయమును సత్యమును గ్రహించినవారై యిందలి విషయములను జనసామాన్యమునకు కూడ తెలుపుట అవశ్యకమని తలంచి దీనిని ద్వితీయ ముద్రణము కావింపవలసినదిగా విజయవాడ వైశ్యమహాసభా వైదికశాఖ వారిని కోరియున్నారు. కాని ధనలోపముచే వైదికశాఖవారు ఆకార్యమునకు పూనుకొనియుండలేదు. కాని గడచిన మహాలయ అమావాస్యనాడు బందరు పురమున శ్రీ లక్ష్మీనృసింహ సోమయాజీ వైశ్యసమాజ భవనమున బందరు వైశ్యులు సమావేశమై యీ గ్రంథములోని కొన్ని ప్రకరణములను శ్రవణ మొనర్చినప్పుడు యీ గ్రంథమును పునర్ముద్రణము కావింపవలసిన ఆవశ్యకతను గ్రహించినవారైరి. వెంటనే శ్రీయుత ఉడత్తు వెంకటేశ్వర్లు గుప్తగారు మున్నగు ప్రముఖులు యీ కార్యమును నెరవేర్చుటకు పూనుకొని కొంత చందాధనము వసూలుపరచి యీ ద్వితీయముద్రణమును కావించిన పుణ్యామునకు పాత్రులైరి.

ప్రథమ ముద్రణమునకంటె యీ ద్వితీయ ముద్రణము నందు అధికముగా నూతన విషయములు చేర్పబడి యున్నవి.

ఈ గ్రంథమునందలి ప్రథమరంగము అనునది ప్రథమ ముద్ర ణములోని విషయములను కలిగియున్నది. దరిమిలాను జరిగిన విషయములు ద్వితీయరంగమునందు చేర్చబడినవి. పవిత్ర ఋషిసంతతిలోచేరి వైశ్యసంఘాభివృద్ధినిగోరు ప్రతివైశ్యుడును పక్షపాతములేక సమదృష్టితో విమర్శింపనెంచు తక్కిన వర్ణస్థులును, యీ గ్రంథమును ఆమూలాగ్రముగ పఠించి ఇందులో న్యాయమున్నంతవరకు వైశ్యవర్ణాభివృద్ధికి పాటుబడుటగాని, తోడ్పడుటగాని జరుపగలందులకు ప్రార్థితులు. తక్కిన వర్ణములతోపాటు వైశ్యవర్ణముకూడ పవిత్రవంతమైనదని ఋజువు చేయుటకును, లోపములున్నంతవరకు స్వసంఘమును సంస్కరించుకొనుటకును ఉద్దేశించి యీ గ్రంథము వెలువడినదిగాని, వర్ణద్వేషమును పురికొల్పుటకుగాదు. స్వార్థపరులైన పీఠాధిపతులును, కొందరు బ్రాహ్మణ పండితులును, వైశ్యవర్ణముపై దాడివెడలుటచే ఆత్మసంరక్షణార్థము స్వసంఘముయొక్క గౌరవమును, స్వాతంత్ర్యమును కాపాడుటకే యీ గ్రంథము ప్రకటింపఁబడినది.

ఇట్లు విన్నవించు,

బృందావన నగరవైశ్యులు.

---

# వైశ్యవిద్యా భానూదయము.

## ప్రథమ రంగము.

ఈ రంగము 1929 సం॥ సెప్టెంబరు నెలలో ప్రారంభమైనది. ఆంధ్రదేశము నందుగల పట్టణము లన్నింటిలోకంటె వైశ్యులు విద్యావిషయమునందు మిక్కిలి వెనుకబడియుండుట యీ బెజవాడ పురమునందేయని చెప్పవలసియున్నది. ఇందుకు కారణమేమని ప్రశ్నించువారికి సమాధానము గలదు. ధన లోపముచేతనని చెప్పవచ్చునాయనిన, కాదు. ఏలనన యీ పురవైశ్యులలో పెక్కండ్రు లక్షాధికారులు గలరు. పోనిండు. వీరిలో వీరికి వైషమ్యము లేవైన యున్నవాయనిన, తక్కిన చోట్లకంటె నిచ్చట విరోధములు తక్కువే. ఒకవేళ భక్తిశ్రద్ధలలో లోటు యేమైనయున్నదా యనిన, తక్కిన ప్రాంతములలోకంటె యీపురవైశ్యులు ఆవిషయమై యెంతమాత్రమును వెనుకాడరు. దాన ధర్మములను గూర్చి విచారించెదమా, విజయవాడ వైశ్యులు దాతృత్వమునందు ప్రఖ్యాతి వహించిన వారే. అయితే యికను లోపమెక్కడ ? వైశ్యులకు ముక్తి మార్గము దేవబ్రాహ్మణ పూజద్వారా తప్ప గత్యంతరము లేదనివాదించు కొందరు స్వార్థపరుల బోధలను నమ్మి యీ పురవైశ్యులలో పెక్కురు తమ సర్వస్వమును బ్రాహ్మణ సమారాధనలుఁ సంతర్పణలు, ఉత్సవములు మున్నగు కార్యములకు సమర్పించి తమశక్తులను అందుకై ధారపోయుచున్నారు. మఱియు "విద్యనేర్చినందున మీరు చెడిపోవు

దురు." అని ఆస్వార్థపరులు కావించు ఉపదేశములకు లోనై వీరు తమ వర్ణస్థులకు విద్యావకాశంబులను కలుగనీయక నిరోధించు చున్నారు. ఇంతేగాక వైశ్యులు పూర్వకాలమున పవిత్రులై యున్నను, యిటీవల వీరు సంకరులై, గాయత్రీ భ్రష్టులై, గోత్ర సూత్రములను విసర్జించి, శూద్రకర్మల నాచరించుచు ద్విజత్వమును కోల్పోయిరని వాదించు పండితులు యీ పురమునందు నివాసము చేయుచున్నారు. వీరు యీపుర వైశ్యులలో కొందరిని మాయమాటలచే లోబరచుకొని తమసిద్ధాంతమును ప్రచారము చేయుచున్నారు. వైశ్యులయందు విద్యావ్యాప్తి కలిగినయెడల వారు తమ పలుకుబడిలోనుండుట సంభవించదని యెరిగి, పైనదెల్పిన స్వార్థపరులు వైశ్య విద్యాప్రచారమునకు అడ్డుతగులుచు యిందుకుగాను కొందరు వైశ్యులను తమ వశమునందుంచుకొని వారిచేతనే ప్రతికూలప్రచారము సహితము చేయించు చుండుటచే యీ పురమునందు వైశ్య విద్యావ్యాప్తి కుంటుబడుట సంభవించినది. వైశ్యవిద్యను నిరసించు పండితులకు వేలకొలది ధనమును పండిత కట్నములక్రిందను వార్షికముల క్రిందను, పూజలు, సప్తాహములు అను పేరుతోను, వైశ్యులు సమర్పించుచు, వారిని పోషించుచుండుటచే యీ పురమున వైశ్యులలో విద్యపెరుగుట కవకాశము లేక పోయినది.

ఇట్టి పండితులు వైశ్యులవలన ఎట్టి సత్కారమును పొందుట కర్హతలేదని అనేక సభలలో తీర్మానములు కావింపబడి యున్నను, యీ పుర వైశ్యులలో కొందరు తమ పంత

మును నెగ్గించుకొనవలెనని పట్టుపట్టి శుక్ల నామ సం॥ భాద్ర
పద శు ౯ (నవమి) గురువారం ది. 12—9—29 మొదలు
పూర్ణిమ పర్యంతము బెజవాడ శ్రీకన్యకాపరమేశ్వరీ అన్న
సత్రం మేడమీదను వైశ్యులను నిందించిన పండితులవారిచే
భాగవత సప్తాహమును చేయించి వారికి వెయ్యిరూప్యములు
పారితోషికము నిప్పింప పూనుకొనిరి. ఈ సంగతి పురము
లోని తక్కిన వైశ్యబృందము వారికి తెలిసి వైశ్యమహాసభా
తీర్మానమునకు విరుద్ధముగ జరుపుట తగదని యెంచి వెంటనే
ప్రచారమునకు పూనుకొనిరి. ఈ ప్రచారము 10 కరపత్ర
ముల మూలమున జరుపబడెను. ఈ కరపత్ర ప్రచారమువలన
యీ పుర వైశ్యులయందు ఆత్మగౌరవము అభివృద్ధినొంది తమ
అభ్యుదయమును నిరోధించుచున్న పండితులు వైశ్యులవలన
నెట్టి సత్కారమును పొందకుండ జేయగలిగిరి. మరియు యీ
పురములోని శ్రీకన్యకాపరమేశ్వరీ అన్నసత్రం ఫండులోనుండి
ప్రతి సంవత్సరమును కొంతసొమ్ము బీదవిద్యార్థుల జీతములకై
వినియోగ పడునట్లు చేయగలిగిరి. ఈ వ్యవహారమంతయు
యీగ్రంథముయొక్క ప్రథమరంగమునకు విషయమైయున్నది.



# నెం 1 రు కరపత్రము.

ఆర్యులారా! స్వస్తిశ్రీ శుక్లనామ సం॥ భాద్రపద శుద్ధ గురువారం ది 12-9-29 మొదలు పూర్ణిమాపర్యంతము శ్రీ॥ బెజవాడ కన్యకాపరమేశ్వరీ అన్నసత్రంమేడమీద బ్ర॥ శ్రీ మల్లాది రామకృష్ణ చయనులవారు భాగవత సప్తాహము కావించుచున్నారనియు అందరును ప్రతిదినమువచ్చి కథాశ్రవణము గావించవలెననియు కోరుచు అద్వైతభక్తసమాజమువారు 11-9-29 తేదీన కరపత్రములను పంచిపెట్టియున్నారు. ఆప్రకారం వైశ్యులు మొదలగువారు స్త్రీ పురుషులు ఆ కాలక్షేపమునకువెళ్లి చయనులగారిని సత్కరించుచున్నారు. యీచయనులుగారు ఇదివరలో వైశ్యజాతినంతను దూషించినగ్రంథమును సమర్థింప బూనియుండుటచే యీ బెజవాడ పురవైశ్యసంఘమువారును ఇతరగ్రామ వైశ్యసంఘములును వారిని సత్కరించకూడదని తీర్మానములు కావించియున్నారు. కొన్ని ముఖ్య తీర్మానములను యీదిగువ వివరించుచున్నాము.

(1) 30-3-1926 తేదీన బెజవాడ పురవైశ్యులు జరిపినసభలో కావింపబడిన తీర్మానము.

వైశ్యులనుగూర్చి వ్రాయబడిన నిందావాక్యములను (గుంటూరు శివాలయమునొద్ద) బహిరంగసభలో సమర్థింప దుర్వాదముచేసిన బెజవాడవాస్తవ్యులగు మల్లాది రామకృష్ణ చయనులవారికి వైశ్యులెట్టి సత్కారము చేయకూడదని యీసభవారు వైశ్యసోదర సోదరీమణులను కోరుచున్నారు.

(2) 7-4-26 తేదీన బందరు పురవైశ్యులు మ.రా.శ్రీ. ఉదయగిరి గోపాలరత్నంగారి ఆధిపత్యముక్రింద సభగావించి చేసిన తీర్మానములు. (a) "యోనిబీజాభ్యాంపరిశుద్ధాః వైశ్యాశ్చఇదానీం నోపలభ్యంత ఏవ". అనగా పరిశుద్ధయోనికిని పరిశుద్ధబీజమునకును పుట్టిన వైశ్యులిప్పుడు లేనేలేరు.

(b) "తేపిశూద్రాది నిషిద్ధకర్మాచరణ మాశ్రితాః సంకీర్ణాః "అనగా వీరు శూద్రవిహితములయిన పురాణోక్త కర్మలను చేయుచుండుటచేత సంకరులై యున్నారు.

(c) "వైశ్యత్వేన వ్యవహారవిషయాపేక్షయా అతినీచవృత్తయో బభూవు" అనగావారు అతి నీచవృత్తులయందున్నారు.

"ఇత్యాదివైశ్య దూషణకరములగు వాక్యములతో పీఠాధిపతులు ప్రచురించిన గ్రంథమును బెజవాడ వాస్తవ్యులును వైశ్యులునుండి సదా బహుమతులను గ్రహించుచు విశేష ధనము నార్జించియున్నట్టి మల్లాది రామకృష్ణ చయనుల వారు బహిరంగముగా శ్రవణముచేసి యుండుటచేతను...వీరలు వైశ్యకులముయొక్క పరువునష్టమును పవిత్రతా భంగమును గావించినటుల యీసభవారు భావించుచున్నారు. రోషముగల యే మానవుడును కులాభిమానముగల యే వైశ్యుడును సహింపరాని దూషణవిషయములు సదరు గ్రంథమునందున్నప్పటికి జరిగించబడిన యిట్టికార్యముల నీసభవారు ఖండించుచు పైవారివలన తగుసంజాయిషీని పొందిననేగాని వీరు

వైశ్యకులమును అవమానపరచినందుకు వీరిపై తగినచర్యను తీసుకొనవలెనని యీసభవారు కోరుచున్నారు. పైదూషణ గ్రంథమును బహిరంగముగ శ్రవణముచేయించి బెజవాడ వాస్తవ్యులు మల్లాది రామకృష్ణ చయనులవారికి వైశ్యులెవరును ఎట్టి సత్కారములుగాని బహుమతులుగాని చేయరాదని యీసభవారు కోరుచున్నారు".

ఇట్టి తీర్మానములింక ననేకగ్రామములలో జరిగియున్నవి. వైశ్యులను దూషించుచు వ్రాయబడిన వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థా అను దూషణగ్రంథమునకు మండనముండనము అనుపేరుతో బెజవాడ వైశ్యమహాజనులు 1926 సం॥ లో ఖండనమును వ్రాసి ప్రకటించియుండిరి.

ఇట్టిస్థితిలో మల్లాదిరామకృష్ణ చయనులవారి భాగవత సప్తాహ కాలక్షేపమును బెజవాడ కన్యకాపరమేశ్వరీ అన్నసత్రమున జరిగించుటయు, వారికాలక్షేపమునందు వైశ్యస్త్రీపురుషులు వెళ్లి పాల్గొనుటయు, వారికి సత్కారములు చేయుటయు, పైనచెప్పిన వైశ్యమహాజనసభవారి తీర్మానములనుల్లఘించి నల్లించబడునుగదా? వైశ్యసోదరులారా! కర్తవ్యమును ఆలోచించుడు.

ఇట్లు

కోట నాగభూషణం వ్రాలు

త్రిపురమల్లు నరశింహం వ్రాలు

శలపాటి పున్నయ్య వ్రాలు

కోట శీతారామయ్య వ్రాలు

సుంకు రామరాజగోపాలరావు గ్రాలు
చుండూరి రంగరావు గ్రాలు
కూరపాటి వీరయ్య గ్రాలు
మునగాల వెంకటరత్నం గ్రాలు
అన్నవరపు వెంకట్రామయ్య గ్రాలు
గమిన జ్వాలానరసింహం గ్రాలు
కోట జ్వాలానరసింహం గ్రాలు
పాదర్తి నరసింహం గ్రాలు

ఇట్లు విన్నవించు,
వైశ్య వేదోక్తసంస్కార ప్రోత్సాహక సంఘము.

---

నె 1 రు కరపత్రమునకు ప్రత్యుత్తరమిచ్చుచు మల్లాది
రామకృష్ణచయనులవారు యీ దిగువ ప్రకట
నము వెల్లడించి యున్నారు.

# ప్ర క ట న ము.



ఆర్యవైశ్యమహాజనులలో కొందరు నేను వారిసంఘమును దూషించినట్లు అభిప్రాయపడినట్లు ఈదినమున పంచిపెట్టిన పత్రికలవలన తెలియవచ్చినది. క్షాత్రబలము తగ్గిననాటనుండియు దేవబ్రాహ్మణ భక్త్యుత్సాహముతో దేవస్థానముల విషయమునను, బ్రాహ్మణజీవన విషయమునను సర్వవిధముల పాటుపడెడి వైశ్యసంఘముపై నాకు ద్వేషమేమాత్రమును లేదు. గుంటూరులోన కొందరు వైశ్యులు శ్రీ శృంగగిరిస్వామివారు వ్రాసిన "వైశ్యవేదోక్త క్రియాచారవ్యవస్థ"యను గ్రంథమునాంధ్రభాషలో వినగోరినందున నాగ్రంథమున కర్థమును బహుపండిత సమక్షములో జెప్పితిని. నాకు వైశ్యసంఘము యొక్క శ్రేయోభివృద్ధియందే అభిప్రాయము కలదు. శ్రీ శృంగగిరిస్వామివారు తద్గ్రంథమందుగాని, నేనుగాని, వైశ్యులను వర్ణసంకరులనిగాని, మరియేవిధముగాగాని దూషించియుండలేదు.

గనుక వైశ్యమహాశయులు శాంతచిత్తులై యుందురుగాక.

నేను సన్మానమును గోరి ఈభాగవత సప్తాహమును జేయుట కారంభించలేదు. కేవల పరమేశ్వరప్రీత్యర్థమే జేయు చున్నాను గాన, నెవ్వరును అన్యథాతలంచ నవరసములేదు.

బెజవాడ,<br>16—9—29.

ఇట్లు,<br>మల్లాది రామకృష్ణచయనులు.



## (నెం 2 రు కరపత్రము.)

### మల్లాది చయనులవారి మృదువచనములకు మెత్తబడకూడదు.

ఆర్యులారా !

మేము ప్రకటించిన నెం1 రు కరపత్రమునకు జవాబుగా చయనులవారు 16—9—29 తేదీన నొక ప్రకటనమును వెల్లడించిరి.

"వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా" అను గ్రంథమునకర్థమును బహుపండిత సమక్షములో జెప్పితిని. శ్రీశృంగగిరిస్వామి తద్గ్రంధమందుగాని, నేనుగాని వైశ్యులను వర్ణసంకరులనిగాని, మరియేవిధముగాగాని దూషించి యుండలేదు"- అని చయనులుగారు తెలిపిరి. ఈమృదు మధురవచనము లెంతవరకు సత్యములో ఆగ్రంధము లోని వాక్యములను కొన్నింటిని మచ్చునకు యీాదిగువ కనుపరుచుచున్నాము.

1. పూర్వం యుగాంతరేష్ఠిత జాతీయానాం। శుద్ధానాం వైశ్యత్వేనవ్యవహ్రియమాణానాం ప్రాయశోనష్టత్వాత్ । యేకేచేన స్థితాః తేపి శూద్రాది నిషిద్ధ కర్మాచరణ మాశ్రితాగ సంకీర్ణాః । కిం ఇదానీంతన వైశ్వత్వేన వ్యవహారవిషయాపేక్షయా అతినీచవృత్త యో బభూవుగ॥

= పూర్వమందున్న పరిశుద్ధ వైశ్యులు చాలవరకు నశించుటచేతను ఎవరేని జీవించియున్న యెడల వారు వైశ్యులకు నిషిద్ధములగు శూద్రవిహితములైన పురాణోక్త కర్మములు

చేయుచుండుటచేత సంకరులై అతి నీచవృత్తి గలిగి యున్నారు.

2. "యోనిబీజాభ్యాంపరిశుద్ధాః శాస్త్రోక్త కర్మానుష్ఠాతారః వైశ్యాశ్చ ఇదానీం నోపలభ్యన్త ఏవ" = పరిశుద్ధ యోనిబీజములకు జన్మించిన వైశ్యులును శాస్త్రోక్త కర్మానుష్ఠానము నాచరించు వైశ్యులును ఇప్పుడు దొరకనే దొరకరు.

3. "ఇదానీంతన వైశ్యానాం। పితృపితామహాది పరంపరయా। ఉపనయనాది సంస్కారణాం। యథావిధ్యభావేన సావిత్రీ పతిత్వరూపదోష ఉపనయనాధ్యధికారం ప్రతిబధ్నాతి॥

= ఇప్పటి వైశ్యులకు పితృ పితామహాది పూర్వుల నాటినుండియు ఉపనయనాది సంస్కారములు శాస్త్రోక్తరీతిని జరిగియుండక పోవుటచే వీరందరు గాయత్రీ భ్రష్టులైరి.

4. "తాదృశదోషనివర్తకం పురుషాయుషేణాపి నిష్పాద్యం ప్రాయశ్చిత్త మపినా స్తీత్యయమేకస్తేషా ముపనయనాద్యధికార ప్రయోజకో హేతుః॥"

= ఇట్టిదోషముగల యీ వైశ్యులకు ఉపనయనాది అధికారములేదు. ఇట్టిదోషములను పోగొట్టు ప్రాయశ్చిత్త మేదేని చేసికొందురనుకొన్నను అట్టి ప్రాయశ్చిత్తమునకు వీరి జీవితకాలం సరిపడదు.

5. "అన్యచ్చతేషాం పారంపర్యేణ ఋషుగోత్ర ప్రవరజ్ఞానాభావః। అపరశ్చతేషాం శాఖా నిర్ణయాభావశ్చేతి" —మరియు వీరికి వరుసగా ఈఋషులు ఈగోత్రములు, ఈప్రవ

వర అనుజ్ఞానములేదు. అదియునుంగాక వీరికి శాఖానిర్ణయ
ముకూడ లేదు.

6. "కేచనవయం వైశ్యాః అస్మాకం శ్రుతిస్మృత్యాభిః వేదోక్తమంత్రైః షోడశకర్మాణి యాగాది కర్మాణిచ విహితానితాన్యస్మాభిర్బ్రాహ్మణాః నకారయంతీ త్యాగ్రహేణస్వయముచ్ఛృంఖలాసస్సంతః। కతిచన బ్రాహ్మణాన్ ధనాధి భిర్వంచయిత్వా స్వవశమానీయ తద్వారా వైదికమంత్రైః షోడశకర్మాణి అత్యల్పకాలమారభ్యకర్తుముప చక్రముః తేషుకశ్చనలక్ష్మీనరసింహ నామకః గతసంవత్సరే అగ్న్యాధాన మపిచకారేతి కింవదంతీతి శ్రూయతే"॥

—కొంతమంది వైశ్యులు - "మేము వైశ్యులము - మాకు శ్రుతిస్మృతులచే వేదోక్త మంత్రములతో షోడశకర్మలును యాగాదికర్మలును విహితములైయున్నవి. కాని వానిని మాచే బ్రాహ్మణులు చేయించుటలేదు" అని ఆగ్రహముతో వారుచ్ఛృంఖులై కొంతమంది బ్రాహ్మణులను లంచము మున్నగువానిచే వంచించి వారిని తాము లోబర్చుకొని వారి వలన వైదికమంత్రములతో కొలదికాలమునుండి షోడశకర్మలను చేయనారంభించిరి. వారిలో నొకడు లక్ష్మీనరసింహం అను పేరుగలవాడు గతసంవత్సరమున అగ్న్యాధానమును గూడ చేసినాడని యొక వదంతి వినవచ్చినది.

వైశ్యసోదరులారా! పైన తెల్పినవాక్యములు దూషణములుకావనియు, ఆప్రకారము బహుపండిత సమక్షములో

తానుచెప్పితిననియు చయనులవారు 16-9-29 తేదీగల తమ కరపత్రములో ప్రకటించియుండుటేగాక వైశ్యమహాశయులను శాంతచిత్తులై యుందురుగాక, అని ఆశీర్వదించుచున్నారు. బెజవాడ వైశ్యులు చయనులవారి మృదువచనములకు మోహము జెంది ప్రశాంతులై యుండిన యుండవచ్చును.

కాని, (1) గుంటూరు వైశ్యమహాజనులు దీనిని ఖండించియుండుటయేగాక పీఠమువారికి భిక్షలను నిరాకరించి వారిని బహిష్కారముకూడ చేసియున్నారు.

2. బందరు పురజనులును యింక యితర ఆంధ్ర వైశ్య మహాజనులును, పీఠస్థులను, ఈచయనులవారిని సత్కరించ రాదని తీర్మానించి ఆదూషణ గ్రంథమును నిరసించిరి.

3. ఆంధ్ర వైశ్యులేగాక కర్ణాటక వైశ్యులు సహితము 1911 సం॥ ఫిబ్రవరి 8 మొదలు 11వ తేదీవరకు శ్రీ గదగ్ బేటగిరిలో శ్రీ శ్రీ శ్రీ పరమహంస బాలసుబ్రహ్మణ్య స్వాములవారి యాజమాన్యమున నొక పండితసభ గావించిరి. ఆసభకు అఖిలభారతదేశమునుండి అనేక పండిత ప్రకాండులు దయచేసియుండిరి. వారిలో బ్రాహ్మణ విద్వాంసులు 69మంది కలరు. (a) శ్రీ జగద్గురు శృంగేరి మఠమునుండి వెలువడిన "వైశ్య వేదోక్త క్రియావిచారవ్యవస్థా" అను గ్రంథమునందలి యంశములు లోపముచే నిండినవిగాను అవమాన కరములైనవి గాను మనోవ్యాకులతను కలిగించునవిగాను ఉండుటవలన ఆ గ్రంథములో నిరూపింపబడిన కొన్ని ప్రమాణములు ప్రాచీన

గ్రంథములలో లేనందునను మరికొన్ని ప్రమాణములకు అపార్థములు చేయబడి యుండుటచేతను ఈగ్రంథము విశ్వసనీయము కాదనియు, ప్రమాణముగ నంగీకరింప కూడదనియు ఈసభవారు ఏకగ్రీవముగా తీర్పుచేసిరి.

(b) ఈ తీర్పును శ్రీ జగద్గురు శృంగేరిస్వాములవారికి బంపి శ్రీవారి మఠమునుండి వెలువడిన ఈ గ్రంథమునురద్దుచేయించ వలసినదని శ్రీ గురువులవారిని కోరవలసినదనియు ఆప్రకారము శ్రీవారుదానిని రద్దుచేయించని యెడల దానికై తగురీతిని ప్రయత్నములు చేయబడుటకు తగిన యవకాశమును శ్రీ స్వాములవారు కలుగజేసి పంపించవలయు ననియు తీర్పుచేసిరి.

(c) ఈసభకు లాహోరు, బొంబాయి, కాశీ, విజయనగరము, మద్రాస్ మొదలగు పురములనుండి విచ్చేసిన బ్రాహ్మణ పండితాగ్రేసరులును వైశ్య పండితోత్తములును ప్రతినిధులుగావచ్చి సభలనలంకరించి నందున వీరందరకు వందనము లాచరింపబడెను.

వైశ్యసోదరులారా !

ఇంతమంది పండితోత్తములీ గ్రంథము దూషణగ్రంథమని తీర్మానించి ఖండించియుండ చయనులవారు కొంచెమైనను మనస్తాపము బొందకబోవుటయేగాక ఆగ్రంథము సద్గ్రంథమేయని యింకను వాదించుట బెజవాడ పురవైశ్యుల ప్రత్యేకభాగ్యమేకాబోలు. పోనిండు ఈగ్రంథమును గూర్చి

శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకర పదమూవేశ ప్రకాశిత జగద్గురు శ్రీ కళ్యాణానంద భారతీ మహంతాచార్యస్వామి బి. ఎ. వారు తమపీఠపు వైదికధర్మ పరిషన్మండలి యందలి బ్రహ్మశ్రీ మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి మున్నగు పండితవర్యులచే రచింపించిన వైదిక ధర్మసంజీవనీ అను గ్రంథములో "వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా" అను గ్రంథమును ఖండించుచు పీఠిక యందు ఇట్లు వ్రాసిరి.

"గుంటూరు పురవాసులు ఈదురాత్ముల తత్త్వమును లెస్సగా నెఱింగిన వారగుటఁజేసి వారి వలలో జిక్కరైరి. దానం జేసి వైశ్యులమోసబుచ్చి ద్రవ్యార్జనము జేయుటకు నవకాశము జిక్కమి నసూయజెంది వైశ్యులు సంకరులనియు, యోనిబీజములచే నపరిశుద్ధులనియు నిందింప మొదలుపెట్టి పైనుదహరింపబడిన పత్రికాభాసము నొకప్రమాణ గ్రంధము వలె, నభినయింపుచు, నద్దానిని దేవాలయమున జదివింపించి వైశ్యుల నవమానించుటయు, నద్దానిచే గుంటూరు పురమున నేమి, మండలమున నేమి, వైశ్యులకును బ్రాహ్మణులకును నన్యోన్యద్వేషములు పుట్టికలవరములు గలుగుట ముల్లోకము లెరింగిన విషయమే.'

చూచితిరా! ఇట్టి స్వాములవారును, మహాపండితులును చయనులవారి వాదనను నిరసించియుండగా చయనులవారు

ఆ గ్రంథము సద్గ్రంథమేయని ఈరోజువరకు వాదించుచుండ యీపురవైశ్యులు ఎట్లు నమ్ముచుండిరో ఆశ్చర్యము.

ఇట్లు విన్నవించు,

బెజవాడ.
19—9—29

మల్లాది రామకృష్ణ చయనుల
సచ్ఛాస్త్ర నిరసన సంఘము.

# నెం 3 రు - కరపత్రము.

"యోని బీజాభ్యాం పరిశుద్ధాః
వైశ్యాశ్చ ఇదానీంనోపలభ్యన్తఏవ"

అనగా" పరిశుద్ధ యోనికిని పరిశుద్ధ బీజమునకును పుట్టిన వైశ్యులిప్పుడు లేనేలేరు. మొదలగు వైశ్యజాతి దూషణవాక్యములతో వ్రాయబడిన గ్రంథమును పండితులైన మల్లాది చయనులవారు నిరసించుటకు బదులుగ ఈ గ్రంథమునందు దోషమేమియు లేదని చయనులవారు వాదించుచున్నారు. ఆయన చేయువాదము దుర్వాదమైనట్లు నెం 2 రు కరపత్రములోని బహు పండితాభిప్రాయములను చూచిన స్పష్టపడగలదు. ఇందరి మహా పండితాభిప్రాయమునకు భిన్నముగ వైశ్యజాతిని నిందించు గ్రంథమును సమర్థింపబూనుకొనిన యీ చయనులవారిని వైశ్యులు సత్కరించకూడదని అఖిల భారత వైశ్యసంఘములన్నియు నిదివరలోనే తీర్మానించియున్నవి. ఈతీర్మానానుసారము చయనులవారి కాలక్షేపమునకు వైశ్యులెవరును పోకూడదనియు సంతర్పణ సమారాధనల కెవరును సహాయము చేయరాదనియు ఒకనోటీసును వ్రాసి దానినొక అట్టపై అటించి దానిని 18-9-29 తేదీన మేము శ్రీ బెజవాడ కన్యకాపరమేశ్వరి అన్నసత్రభవన ముఖద్వారమున తగిలించి దానినెవరును భంగపరచకుండులాగున నొక కాపలామనుష్యు నేర్పాటుచేసియుంటిమి. కాని యనమండ్ర సీతారామయ్యా అను పేరుగలయొక బ్రాహ్మణమిత్రుడు

అందులకై ఆగ్రహముబూని "యీసత్రము వైశ్యులదేకాదు" అనుచు దౌర్జన్యముగ ఆనోటీసుబోర్డును చించి పారవేసినాడు. మేము కావించినపనియందేమి దోషమున్నది? వైశ్యులను దూషించినవారిని వైశ్యులు సత్కరించకూడదు అని మేము వైశ్యసోదరులకు సలహానిచ్చుటకు మాకుహక్కు లేదా? వైశ్య దూషణను సమర్థింప కంకణము గట్టుకొన్న చయనులవారిని వైశ్యులు సత్కరించవలసినదని ప్రబోధము గావించుటకు బ్రాహ్మణులకు హక్కుయున్నపుడు సత్కరించవలదని చెప్పుటకు వైశ్యులకేలహక్కు లేదో బ్రాహ్మణమిత్రులు సమాధానము చెప్పవలసియున్నారు. ఈవిషయమై బ్రాహ్మణులు జోక్యమును కల్పించుకొన వలసినపనియేమో గోచరము కాలేదు. వైశ్యదూషణ సమర్థనమునకు బూనుకొనిన ఒక్క రామకృష్ణ చయనులవారికిని దూషింపబడిన వైశ్యజాతికిని మధ్యగల యీతగాదావిషయములో యితర బ్రాహ్మణులు పురస్కరించికొనుట ఎంతమాత్రమును సమంజసముగ లేదు. వైశ్యులను దూషించిన ఒక వ్యక్తి బ్రాహ్మణుని, వైశ్యులు తిరిగి దూషింపయుద్యమించనుకూడలేదు. ఆవ్యక్తిని వైశ్యులు సత్కరించరాదనియే మావాదన. అట్లుకావించుట ప్రతి వ్యక్తికిని ప్రతిజాతికిని ఆత్మసంరక్షణార్థమై యేర్పడిన జన్మహక్కు.

ఈజన్మహక్కు ననుసరించియేగదా! యిటీవల సైమన్ కమీషనరువారు సీమనుండివచ్చి బొంబాయిరేవులో పాదం పెట్టిననాడు వారికి గౌరవములు సత్కారములు జేయరాదని

భారతవర్షమంతయు ప్రబోధమునకు బూనుకొని భారత సేవాదళములు నల్లజండాలు చేబూని సైమన్‌గారి నెదుర్కొనుచు సన్మాన నిరసనము గావించియుండెను. కాని సైమను సంఘమునందు ప్రేమగల కొందరువ్యక్తులు అట్టినిరసన ప్రబోధమున పాల్గొనక యుండుటయు, పైగా సైమనుగారికి విందులు మొదలగునవి గావించుటయు జరిపియుండెను. ఎవరెవరి జన్మహక్కులువారివారి కేగలవు. అట్లనె వైశ్యులు వర్ణసంకరులని ఒక వ్యక్తి సమర్థింపబూనుకొనునప్పుడు, అట్టి వాదన శాస్త్ర సమ్మతముకాదని దృఢపరచుటకును, ఈ విషయమై శాస్త్రజ్ఞానము లేని కొందరు వైశ్యసోదరులకు మేము శాస్త్రధర్మముల నెఱింగించుటకును, తమ్ము దూషణకు బూనుకొనినవారిని సత్కరింపవలదనియు, శాంతమార్గమున ప్రబోధించుటకు మాకును హక్కుకలదు. అంతేకాని ఈ వ్యక్తివ్యవహారమును సర్వ బ్రాహ్మణ సమస్యగ పరిణమింపచేయుట ఎవరికిని శ్రేయము కాదు. ఆ గ్రంధమును రద్దుపరచుటకు చయనులవారు సమ్మతించి ఆ ప్రకారము తమ సంతకముతో ఖండనమును ప్రకటించుచో వారినిగూర్చిన మా యుద్యమమును మేము ఉపసంహరించుకొనుట కెంతమాత్రమును సందియము లేదు. వైశ్యులు విద్యావిషయమై యింతకాలము అలక్ష్యముచేసిన కారణముననే వైశ్యులనుగూర్చి అనేక దూషణ గంథములు యిటీవల బయలు పడుచున్నవి. వైశ్యులు ధనవంతులయ్యు, తమధనమును గుళ్లు, గోపురములు, సంతర్పణలు, సమారాధనలకు వినియోగించుచు తమబిడ్డలకు విద్య చెప్పించక అంధ

ప్రాయులుగ నుంచుచున్నంతవరకు వైశ్యులు యితరజాతుల వలన అగౌరవము పొందకతప్పదు. ఎంతధనము సంపాదించిన నేమి ఎంత వ్యాపారమును వృద్ధిచేసిననేమి ఇతరులచే సంకర జాతిగ నెన్నబడుటకు సమ్మతించిన ఓ వైశ్యసోదరులారా! మీకు ఆత్మగౌరవము లేదా, ధనమే శాశ్వతమనుకొను చున్నారా, మీరు కోట్లకొలది ధనమును సంపాదించినను విద్యలేని బ్రతుకు పశుజీవనముతో సమానము. విద్యాగౌర వము లేకపోవుటచేతనే వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా అను వైశ్యదూషణ గ్రంథము యీ దినమువరకును సజీవ ముగా నున్నది. పునర్ముద్రణమున నూతన ప్రతులుకూడ బయలుదేరినవి. ఈ గ్రంథమునందు దూషణలేనట్లు కొందరు బ్రాహ్మణులు వాదించుటలో అర్థముకలదుగాని సద్వంశ సంభూతులైన బెజవాడ వైశ్యప్రముఖుడు ఆ గ్రంథమునందలి వాక్యములలో దోషములేదని చెప్పుటయు అతికించిన కరపత్ర ములు చేతులతో చించుటయు వైశ్యజాతికంతకును కళంక మును కలుగజేయక మానదు.

కాన వైశ్యసోదరులారా, మీ వంశీయుల పవిత్రతను కాపాడుకొనుడు. మీ పితృపితామహులను సంకరులని పిలి పింపకుడు. మీ మాతృదేవతల మానమును కాపాడుడు

ఇట్లు విన్నవించు,

వైశ్యవేదోక్త సంస్కార ప్రోత్సాహక సంఘము.

# నెం 4 రు. కరపత్రము.

ద్విజులగు వైశ్యులు శ్రౌతస్మార్త కర్మాధికారముస్వత స్సిద్ధముగ గలిగియున్నను కొంతకాలముక్రిందట బ్రాహ్మణప్రతి పక్షులు కొందఱు నిరోధము గలిగించి కొందఱి వైశ్యులను విధ్యుక్త కర్మలనుండి తప్పించియుండిరి. అట్టి బ్రాహ్మణనిరోధమును ప్రతిఘటించుచు బ్రహ్మశ్రీ మామిడి వెంకటార్య పండితులు అనేకబాధలకోర్చి ధననష్టమునకుబాల్పడి బ్రాహ్మణులమీాద సివిల్ దావాలు క్రిమినల్ చార్జీలు దాఖలుచేసి పోరాడియున్నారు. తుదకు సీమలో ప్రివికౌన్సిలువారు తీర్పు నిచ్చియున్నారు. ఆ తీర్పులో వైశ్యులు వేదమంత్రములతో శుభాశుభ కర్మలను జరుపుకొనునప్పుడు బ్రాహ్మణులు అడ్డగించినచో శిక్షకు పాత్రులుకాగలరని కోర్టువారు డిక్రీని ప్యాసు చేసిరి. ఇయ్యది 27-6-1818 సంవత్సరమున జరిగినది. అనగా ఇప్పటికి నూటపది సంవత్సరములక్రిందట తీర్పు కాబడెను.

ఈ దావాలో

| | |
|---|---|
| వాదులు (వైశ్యులు) | మామిడి లింగయ్య, చిట్టూరు వీరయ్య నంబూరి వెంకటదాసు. |

ప్రతివాదులు— కాజ కొండావధానులు, కానుకొలను నాగన్న, యీ రామయ్య (బ్రాహ్మణులు) ఈ తీర్పు జరిగియున్నను బ్రాహ్మణులు అమాయకులును శాస్త్రపరిచయము లేనట్టియు కొందరు వైశ్యులకు పురాణోక్తముగానే కర్మలు యిప్పటివరకును చేయించుచున్నారు. వైశ్యులకు జన్మతఃగల

స్మార్తకర్మాధికారమును మామిడి వెంకటార్య పండితులు నిలువ బెట్టిరి. వైశ్యులకు శ్రౌతకర్మాధికారముకూడ కలదని బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులుగారు బహు కష్టములకోర్చి సాధింపగలిగిరి. వీరు ఆనందగజపతి మహా రాజులవారి పాలనములోనున్న కళింగదేశ రాజధానియగు విజయనగరమున 1892 సంవత్సరమున మాఘమాసమున అగ్న్యాధానమొనర్చి దీక్షితనామము వడసిరి. అట్టివారు కొందరు బ్రాహ్మణులకు లంచమిచ్చి వారిని వశపర్చుకొని యీ ఆధానమును జరిపినట్లు "వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా" అను దూషణగ్రంథమునందు శృంగగిరి పీఠస్థులు వ్రాసియున్నారు.

> "కతిచన బ్రాహ్మణాన్ ధనాదిభిర్వంచయి
> త్వాస్వవశ మానీయ కశ్చిన లక్ష్మీ
> నరసింహనామకః గతవత్సరే అగ్న్య
> ధానమపి చకార"

ఈ వ్రాత లక్ష్మీనరసింహ సోమయాజులుగారికే గాక వైశ్యులందరికిని పరువుప్రతిష్టలను భంగపఱచుచున్నది. ఇట్లు వ్రాయుట పీఠస్థులకు తగదు. పైగా ఆవ్రాత అసత్యముకూడ నగును. ఈ ఆధానమునకు సమ్మతిని వ్రాతమూలముగ నిచ్చుచు అన్నిప్రాంతములనుండియు 194 (నూటతొంబదినలుగురు) బ్రాహ్మణపండితులు హాజరైరి. వారు తమ సంతకములతో నిచ్చిన సమ్మతిపత్రము నందిట్లున్నది.

"శ్రీ శ్రీ శ్రీ విరూపాక్ష స్వాములవారు వైశ్యులకు వేదచోదితమైన కర్మలు అన్నిటికిని అధికారమున్నట్లు విరోధి సంవు॥ వైశాఖశు3 లు రోజున శ్రీముఖం జారీచేయించినారు గనుక శ్రీ ఆత్మకూరి లక్ష్మీనరసింహంగారు జరుపుచున్న ఆధానమునకు మేము వెళ్ళడమునకు యెంతమాత్రము అభ్యంతరము లేనట్టు తెలియపరచుచున్నాము.

(సంతకములు)

1 కవిలిగె వెంకట రమణాచార్య సోమయాజి వ్రాలు
2 చట్టి శ్రీరంగా చార్యులు వ్రాలు
20 దేవులపిల్లి అచ్చన్నశాస్త్రి వ్రాలు
46 కొడవంటి రాఘవులు సిద్ధాంతి వ్రాలు
93 కాందేగుల సీతాపతిరావు పంతులు వ్రాలు
116 సోమయాజుల రాంభొట్లువ్రాలు
144 పెద్దింటి శింగరాచార్యులు వ్రాలు
156 కప్పగంతుల నరసింహావధానులు వ్రాలు
175 వేలూరి వెంకటనరసావధానులు వ్రాలు
194 అయిల సోమయాజుల పేరయ్య వ్రాలు

(స్థలమాక్రమించుకొనునని తలంపుతో అచ్చుటచ్చుటికొన్ని సంతకములనే తెలిపినాము)

ఇట్లు మొత్తం నూటతొంబది నలుగురు ఘనపండితుల సమక్షమున జరిపిన అగ్న్యాధానము లంచములచే జరిగించినట్లు తెలుపుట ఎంతసాహసము? ఒకవేళ యీ పండితులందరును

లంచములకు లోబడియుందురని వాదనకొరకైనను అంగీకరించెదము కాని శ్రీలక్ష్మీనరసింహంగారు లంచమునిచ్చువారో లేక ఘనమైన సర్కారు ఆఫీసరో మనము విచారించెదము. పేరు బి,ఏ బి.యల్. పరీక్షలయందు ఫష్టుక్లాసులోప్యాసుఅయిరి, హైకోర్టు వకీలుపదవిని పొందిరి. గవర్నమెంటుతరపున పబ్లిక్ ప్రాసిక్యూటరుగానుండి ఖ్యాతివహించిరి. బందరు, అమలాపురం, రాజమహేంద్రవరం, గుత్తి, విజయనగరం, శ్రీకాకోళం, నందియాల, చిత్తూరు, మొదలగు పట్టణములలో డిస్ట్రిక్టు మునసబ్ హోదాను చలాయించియుండిరి. అనేక మంది ఇంగ్లీషు అమెరికన్ దొరలయొక్క మన్ననలకు పాత్రులైరి. 1878సం॥రంలో ఇంటర్నేషనల్ ఆర్డరు ఆఫ్ గుడ్ టెంప్లార్సు (Inter- national order of Good Templars) సంఘమున ప్రధానసభ్యుడుగా నుండి సంఘమును జయప్రదముగ నడపినందుకు ప్రయాగపట్టనమున వీరికీ సంఘమువారు, (డి, జి, డబ్ల్యు, సి, టి) D, G, W, C, T ) అను బిరుదమును బహుమాన పతకమును సమర్పించిరి, డి, జి, డబ్లు, సి, టి అనగా Divine Grand worthy, Commanding Templar అని పేరు. అనగ ఆధ్యాత్మిక నైతికధర్మ ఘనప్రచారక యోధాగ్రేసరుడు అని యర్థము. కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహిత కొంతభాగమునకు జ్ఞానపరముగ నర్థమును ప్రకటించిరి. బందరులో వేదపీఠమును స్థాపించి వేదవృక్షము నొకదానిని నిర్మించిరి. శతక్రతువులలో జేరిన అగ్నిష్టోమ మహాయాగమును పేరు బృందావనపురమున జరిపిరి. భగవద్గీతా గూఢార్థదీపిక

మొదలగు అనేక వేద వేదాంత గ్రంథములను నూతనముగ రచించిరి. స్మార్త కర్మ భాగమునంతను అందరకు సులభముగ తెలియునటుల తెనుగుతో అచ్చొత్తించి ప్రకటించిరి. వీరు సంస్కృతాంధ్ర ఆంగ్ల జర్మన్ భాషలయందు అసమాన ప్రజ్ఞాదురంధరులు. మాక్సిముల్లర్ మున్నగుజర్మన్ వేదశాస్త్ర పరిశోధకులచే గౌరవపత్రములను బడసియుండిరి. గవర్న మెంటువారివలన 1900 వ సంవత్సరమున ఉపకార వేతనమును గైకొని యుద్యోగమును చాలించి 1901 సం॥ న వేదార్థ ప్రకాశిక యను సంస్కృత మాసపత్రికను నడపుచు, తుదకు ఏకాదశి మహాపర్వాడి పుణ్యకాలమున వైకుంఠమున కేగి విష్ణు సాయుజ్యము నొందిరి.

ఇట్టి పుణ్యపురుషుడు బ్రాహ్మణులకు లంచమిచ్చి అగ్న్యాధానమును చేసియుండిరని పీఠాధిపతులు వ్రాయుటయు, అట్లు వ్రాయుట దూషణ మెంతమాత్రము కాదని చయనుల వారు సమర్థింపబూనుటయు, దానిని ఒక బెజవాడ వైశ్య ప్రముఖుడు అంగీకరించుటయు, పౌరుషమింకను నిలిచియున్న ప్రతివైశ్యునకును పరితాపము కలిగించకమానదు.

లంచమిచ్చినట్లు ఒకరిపై నారోపించుట ఇండియన్ పీనల్‌కోడ్డు (శిక్షాస్మృతి) ను బట్టి యొక గొప్ప నేరమగును. నిజముగ మన లక్ష్మీనరసింహ సోమయాజులవారే యిప్పుడు సజీవులై యున్నచో మానసష్టము ప్రతిష్ఠాభంగము, కలిగించి నందుకు ఆ దూషణ గ్రంథమును వ్రాసిన శృంగేరిపీఠాధిపతుల మీదనుఁ ఆగ్రంథమును సమర్థింప బూనినవారిమీదను, ఆ

సమర్థనమును అంగీకరించి బాహాటముగా తప్పులేదనివాదించు చున్న వారిమీాదను సివిల్ క్రిమినల్ చర్యలను జరిపించి యుం దురు. మరియు ఆదూషణ గ్రంథమును రద్దుపరిపించి పునర్ము ద్రణము లేకుండ నిషేధపు టుత్తరువును తెప్పించియుందురు. ఏమీా! జగద్గురువులగు శృంగగిరి పీఠాధిపతులమీాదను, ఘన పండితులమీాదను, చర్యజరిగించ లక్ష్మీనరసింహదుగారు అంత సమర్థులా ఏమియని కొందరు తృణీకరింపవచ్చును. కాని, యీా దిగువ విషయములను గ్రహించుడు.

1. లోగడ విరూపాక్షశంకరపీఠమువారు శ్రీలక్ష్మీనరసింహ సోమయాజులవారికి నిందాపూర్వకమైన నొక ఆంక్షుపత్రికనంపి యుండ ఆశంకరస్వాములవారిమీాద మన సోమయాజులవారు శిక్షాస్మృతిక్రింద కేసును దాఖలు చేసిరి. ఆ కేసు తుదకు హై కోర్టులో పరిష్కారమై స్వాములవారికి శిక్ష విధింపబడెను. హైకోర్టుజడ్జి ఘనతవహించిన శ్రీ ముత్తుస్వామి అయ్యరుగారు తీర్పుచెప్పిరి. స్వాములవారు నేరస్థులనియు 200 రూపాయలు అపరాధమును చెల్లించవలెననియు లేనిచో ఒక మాసము సామాన్య చెరసాలశిక్ష ననుభవించవలె ననియు తీర్పు కాబడెను.

(2) కడపకాపురస్థులగు దుర్భాక వెంకటాచలశాస్త్రి లవారు వైశ్యులకు వేదాధికారము లేదనిచెప్పుచు 1891సం॥ లో "వైశ్యశాంకరీ" అను వైశ్యదూషణ గ్రంధమును ప్రకటిం చిరి. వారికి మన సోమయాజులవారు లాయరు నోటీసునిప్పించి కేసు దాఖలుచేయబూనగా ఆశాస్త్రిలవారు క్షమాపణ

పత్రికను వ్రాసుకొని తాను వ్రాసినగ్రంథము పొరపాటు అనియు, తాను బ్రాహ్మణుడును, వైదికియును అయియున్నందున తన గ్రంథమును రద్దుపర్చుకొనుటకగు ఖర్చును వైశ్యులను ప్రార్థించి మిగుల సంతాపము నొందినందున మన్నింపబడెను.

(3) డిప్యూటికలెక్టరు హోదాలోనుండినట్టియు; రాయబహద్దూర్ బిరుదాంకితులును, బ్రహ్మసూత్రార్థమును రచించినట్టియు, శ్రీ వల్లూరి జగన్నాధరావు పంతుగారు "ఆర్యవైశ్యులు యావన్మంది సంపూర్ణముగా నశించినారు" అని వైశ్యులను దూషణచేసినందుకు మన సోమయాజులవారు, ఆ పంతులవారిపై విశాఖపట్టణం సబ్ కోర్టులో 1893 సం॥రం లో దావా దాఖలుచేసిరి. అంతట పంతులుగారు తాము కావించిన ప్రసంగమునకు పరితాపమునొంది సమాధానమును కుదుర్చుకొని రాజీపడిరి.

ఈ విధముగా అనేక వైరివర్గమును జయించి వైశ్యులకు శ్రౌతస్మార్త హక్కులను స్థిరపరచిపోయిన మనలక్ష్మీనరసింహసోమయాజులవారిని గూర్చి వ్రాయబడిన ఈ వైశ్యవేదోక్తక్రియావిచారవ్యవస్థా అను దూషణగ్రంథమును శృంగేరీస్వాములవారు 1893 సం॥లో మనసోమయాజులవారుజీవించియుండగనే పూర్తిచేసిరి. కాని శ్రీలక్ష్మీనరసింహ సోమయాజులవారు 1901 సం॥ లో పరమపదించిన పిమ్మటనే శృంగేరీవారు తమగ్రంథమును అచ్చువేయించి ప్రకటింప గలిగిరి. దీనినిబట్టి చూడగ యిప్పుడా దూషణగ్రంథముపై చర్యతీసికొన సమర్థు

లైన వైశ్యులు లేరుగదాయనెడి ధైర్యమే శృంగేరీస్వాముల వారి ప్రకటనకు కారణభూతమని కనబడుచున్నది. నిజముగ శృంగేరివారు అభిప్రాయపడినట్లు, చర్యతీసుకొనుటకు తగిన పాండిత్యము గలవారుగాని సమర్థులుగాని రోషముగలవారు గాని వైశ్యులలో ప్రస్తుతము కనిపించనిమాట సత్యము. కాని ఆదూషణగ్రంథమును ఖండించుచు అనేక సభలిదివరలోనే జరిగి యుండెను. ఖండనగ్రంథములును వెలువడెను. ఇందుకు గాను నెం2రు. కరపత్రమును చిత్తగించుడు. పాండిత్యమంతగా లేకపోయినను వైశ్యులలో నింక కొందరి శరీరములయందు ఆర్యుల పవిత్రరక్తము నిలిచియున్నందున చయనులవారి మృదు వచనములకు మోహముజెందుటలేదు. కాని చయనులవారి వాదమునందింకను విశ్వాసముజూపుచున్న ఒక బెజవాడ వైశ్య ప్రముఖుడు మా కరపత్రములను చించివేయక సావధానముగ చిత్తగించిన యెడల వైశ్యదూషణ గ్రంథమును ఆయనకూడ సమర్థింప జాలడు, అని సవినయముగ విన్నవించుకొను చున్నాము.

ఇట్లు విన్నవించు,
వైశ్యవేదోక్తసంస్కార
ప్రోత్సాహక సంఘము.

---

# (నెం 5 రు-కరపత్రము.)

"తేపి శూద్రాది నిషిద్ధ కర్మాచరణ మాశ్రితాః సంకీర్ణాః"—అనగా వైశ్యులు శూద్రవిహితములైన పురాణోక్త కర్మలు చేయుచుండుటచేత సంకరులైయున్నారు.

ఈవిధముగ వైశ్యదూషణ గ్రంథమునగలదు. "ఊరూ తదస్యయద్వైశ్యః" పరమేశ్వరుని ఊరుభాగములనుండి యుద్భవించి పవిత్రులైన వైశ్యజాతి ద్విజాతులలో చేరియున్నదని యెల్లరు నంగీకరించవలసినదియే. అట్టి ద్విజులైన వైశ్యులకు వేదాధికారము సృష్ట్యాదినుండియు కలదు. అప్పటినుండియు బ్రాహ్మణ క్షత్రియులతోబాటు వైశ్యులును వేదకర్మానుష్ఠానమునే జరుపుకొనుచుండిరి. కాని అసూయాపరులైన కొందరు బ్రాహ్మణులు విద్యాలోపముగల వైశ్యులను గూర్చి చాల కాలముక్రిందట కొన్ని గ్రంథములనువ్రాసిరి. ఆగ్రంథములలో వైశ్యులకు శూద్రవిహితమైన పురాణకర్మాధికారమే కలదనియు వారు వేదమంత్రములతో కర్మలు చేసికొనరాదనియు వ్రాసి ఆగ్రంథములు ప్రమాణగ్రంథములని వాదించుచుండిరి. అంతేగాక వేదోక్తముగ కర్మలుచేసుకొనుచుండిన వైశ్యులను బాధపెట్టి, కొన్నిచోట్ల దెబ్బలుకొట్టియు, చార్జీలుపెట్టియు, పౌరోహిత్యము చేయించకయును వైశ్యులకు బహుయిక్కట్లు దెచ్చిపెట్టిరి. దృష్టాంతముకొఱకు రెండుమూడు యంశముల నీదిగువ నుదహరించుచున్నాము.

(1) శ్రీమామిడి వెంకటార్యులవారు తనప్రథమపుత్రు నకు వేదోక్తవిధానముగ ఉపనయనము చేయించ దలచెను. బ్రాహ్మణులెవరును వైశ్యులకు వేదోక్తముగ ఉపనయనము చేయించ మనినందున వెంకటార్యులవారే యాజకత్వము వహించి ఉపనయనమును ప్రారంభించెను. కాండ్రేగుల జగ్గప్ప మున్నగు కొందరు బ్రాహ్మణులు ఈర్ష్యవహించి కోర్టులో చార్జీపెట్టిరి. మేష్టరు పర్లేరుగారు అప్పటి యధికారి, బ్రాహ్మణులమాటలు వేదప్రమాణమనినమ్మి ఆవటుని పంచశిఖలను రద్దుజేయించి జందెమును త్రెంచవలసినదిగా ఉత్తర్వుచేసెను. అంతట వేంకటార్యులు చేయునదిలేక ఆకుమారుని దాచి పెట్టిరి.

(2) నంబూరు వెంకటదాసుగారు తనకుమారునకు వేదోక్తముగ నుపనయనము చేసికొనుచుండెను. బ్రాహ్మణులు అసూయాగ్రస్తులై వేంకటదాసుగారి ఇంటిపైకెక్కి పెంకులు నణగద్రొక్కి రాళ్ళవానగురిపించిరి. ఇంటిలోనున్నవైశ్యులు సలసలకాగిన నూనెను పిచుకారులతో వారిపైచిమ్మి, పిమ్మట కొట్లాటలుజరిగి దెబ్బలుతగిలి గాయములుపడి రక్తగాత్రులై ఇరుపక్షములవారును కోర్టులకెక్కిరి. ఉభయులకును విశేష ధననష్టమును, శరీరకష్టమును ప్రాప్తమైనవి. తుదకు సీమలో అప్పీలుచేసుకొనగా అక్కడ ప్రీవికౌన్సిలువారీదిగువ తీర్పునిచ్చిరి.

| | | |
|---|---|---|
| వాదులు ......నంబూరి వెంకటదాసువగైరా | } | 27-6- |
| ప్రతివాదులు......కాజ కొండావధానులువగైరా | } | 1818 |

మూర్సు ఇండియన్ అప్పీల్సు.

"కోమటివర్ణస్థులు వారివారియొక్క శుభాశుభ కర్మ లను వారిగృహములయందు వేదమంత్రములుతోటి బ్రాహ్మణులచేత శాస్త్రోక్తముగ జరిగించుకొనవలసియున్నది. ఎవరైన ఆటంకపెట్టినను ఆటంకపెట్టుటకు ప్రయత్నించినను కోర్టువారి డిక్రిని తిరస్కరించినట్లు ఎంచబడి శిక్షకు అర్హులగుదురు." అని కోర్టువారు తీర్పునిచ్చిరి.

(3) 11-7-1891 తేదీన కడపజిల్లా ప్రొద్దుటూరు కాపురస్తులు దుర్భాక వెంకటాచలశాస్త్రిగారు వైశ్య శాంకరీయను నొక గ్రంథమును ప్రకటించిరి. దానిలో వైశ్యులు "బహుశాపగ్రస్తానాం వైశ్యానాం" అని శాలంకాయనఋషియొక్క శాపములు బొందియుండిరనియు, వారు వేదోక్త కర్మల కనర్హులనియు పురాణకర్మలనే చేసికొనవలసిన దనియు వ్రాసియున్నారు. ఈగ్రంథమును ప్రమాణమనిచెప్పి బ్రాహ్మణపౌరోహితులు వైశ్యులను మాయపుచ్చి కొన్నిచోట్ల పురాణ కర్మలను చేయించుచుండిరి.

ఈసంగతి శ్రీలక్ష్మీనరసింహ సోమయాజిగారికి తెలిసి ఆగ్రంథము వ్రాసిన శాస్త్రిలవారికి లాయరు నోటీసునిచ్చి చార్జిదాఖలు చేయబోగా ఆశాస్త్రిలవారు "నేను వైదికిని క్షమింపుడు పొరబడి గ్రంథమును వ్రాసితి" నని జవాబునీయ అప్పుడు కేసును విరమించిరి.

(4) గంగ్రడకోట కుమారస్వామి శాస్త్రియను మరియొక వైదిక పండితుడు ప్రౌఢసరస్వతీ యను పేరుబెట్టుకొని ఒకవైశ్యదూషణగ్రంథమును ప్రకటించెను. అందులో నిట్లువ్రాసిరి.

"వైశ్యులకు వేదోక్త కర్మ లేదు. కోమట్లు ప్రతిలోమ అనులోమజాతిలోనివారు (సంకరులు) కలియుగమందు వైశ్యులు లేనేలేరు." ఈవిధముగ తెలిపిరి. దీనికి ప్రౌఢసరస్వతీ పత్రికా ఖండనమను నొకగ్రంథమును లక్ష్మీనరసింహాంగారు వ్రాయించి ప్రకటించిరి. ఆగ్రంథము 5 వ పేజీలో నిట్లు జవాబు వ్రాయ బడెను.

"ఈయన భిక్షాటనమునకు వైశ్యులే ముఖ్యాధారము లగుటచేత వారివద్దకు యాచనకు వెళ్లినప్పుడు ఇందుకు తగిన మర్యాద గలుగునేమో...భస్మాసురునివలె తనహానిని తానే తెచ్చుకొనునటులయున్నది"

చిత్తగించితిరా? వైశ్య సోదరులారా! మనవైశ్యులు పూర్వమునుండియు వేదకర్మలను జరిపించుకొనుచుండగ, ఎట్లు బ్రాహ్మణులు అడ్డుపడి సంఘములో ద్వేషములు పుట్టించియు, నేరములుమోపియు, సివిల్ క్రిమినల్ కేసులు దాఖలుచేసియు కల్పనాగ్రంథములను సృష్టించియు, దౌర్జన్యముచేసి వైశ్యుల వేదోక్త కర్మలపై దాడివెడలిరి. ధైర్యస్థైర్యములుగలవైశ్యులు పూర్వకాలమునుండియు తమ వంశ పారంపర్యముగ ఎన్నికష్ట ములకో పాల్పడియు నేటివరకు విధ్యుక్తముగ, వేదోక్తవిధాన ముగనే కర్మలు చేసికొనుచూవచ్చుచున్నారు. కాని వైశ్యులు ముఖ్యముగ వ్యాపారములయందు మగ్నులగుచు ధనసంపా దనయే ప్రధానోద్దేశ్యముగ కొందరు వ్యవహరించుటచే ఈ బ్రాహ్మణులు ధాటికి నిలువలేకను కొందరు వారి మోసపు

మాటలయందు భక్తివిశ్వాసములుంచియు తమపురోహితులు చేయించు పురాణోక్త కర్మలనుచేసియుండిరి. వారివంశీకులును పారంపర్యముగ పురాణోక్తముగనే కర్మలుచేయుచుండిరి. ఇట్టి వారినిగూర్చియే "వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థా" అను దూషణగ్రంథములోనిట్లు శృంగేరిస్వాములవారు తెలిపిరి.

"వైశ్యులు శూద్రవిహితములైన పురాణోక్త కర్మలు చేయుచుండుటచే సంకరులై అతినీచవృత్తియందున్నారు."

ఈసంగతియే మనచయనులవారు సమర్థింపబూనినట్లు చెప్పబడినది.

"అమ్మ తాపెట్టనూపెట్టదు, ఇతరులు పెట్టితే ఓర్చనూ లేదు." అను సామెతప్రకారము వైశ్యులకు వేదోక్తకర్మలు బ్రాహ్మణులు తాముచేయించరు. వైశ్యులేచేసికొనగా చూచి ఓర్పునుచెందరు. వీరిబాధపడలేక కొందరు వైశ్యులు పురాణోక్తకర్మలు చేసికొనుచుండిరి. పురాణోక్తకర్మలు చేసికొనుచున్నారు గనుక వీరు సంకరులైరి అని శృంగేరిస్వాములవారి వంటి సర్వసంగ పరిత్యాగియు, రామకృష్ణ చయనులవంటి ఘన పండితులును వాదించుచున్నారు. ముందుకు పోతే నుయ్యి వెనుకకుపోతే గొయ్యి, పురాణోక్తకర్మలెవరైన వైశ్యులు యిప్పటికినిచేయుచుండినచో అందువలన కలిగిన పాదిత్యము మా అభిప్రాయప్రకారము అడ్డుపెట్టిన బ్రాహ్మణులకేతగులునుగాని ఆచరించుచున్న అమాయక వైశ్యులకు అంటదు. పైగా అట్టి వైశ్యులకు ప్రాయశ్చితముచేయుట

కూడ వీలులేదని తెల్పినారు. దీనినిగూర్చి ముందు సంచికలో వ్రాయబడును. బెజవాడపురములో నేటికి పురాణోక్తకర్మలు జరుపు వారుందురని మేము నమ్మజాలము.

ఇట్లు, విన్నవించు,

వైశ్య వేదోక్త సంస్కార ప్రోత్సాహక సంఘము.

# నెం 6 రు—కరపత్రము.

“ప్రాయశ్చిత్త మపినాస్తి”—ఇట్టి దోషములుగల వైశ్యులకు ప్రాయశ్చిత్తముకూడలేదు, అని వైశ్యదూషణ గ్రంథము తెలిపియున్నది. దీనినే చయనులవారు సమర్థింప బూనిరి. బెజవాడ వైశ్యప్రముఖుడు అంగీకరించినదియు నీ గ్రంథమునే.

వైశ్యమహాశయులారా:—ఈకలికాలమున ప్రతివర్ణము వారికిని ధర్మశాస్త్రమునందలి ప్రామాణ్యబుద్ధియు, వేదోక్త కర్మలయందు విశ్వాసమును తఱుగుచున్నసంగతి సర్వజనవిదితమైయున్నది. కాని తెలిసియో తెలియకయో మొండి పట్టుతో యింకను వైశ్యులు కర్మలను జరుపుకొనుచునే యున్నారు. ధర్మశాస్త్రములయందు ప్రమాణబుద్ధియు వారల కింకను నశించలేదు. పూర్వసాంప్రదాయముల నింకను పట్టుకొని వ్రేలాడుచున్నవారు. వైశ్యులే దేవాలయములను కట్టించియు సత్రముల స్థాపించి బ్రాహ్మణభోజన వసతులకై తంటాలు పడుచున్నవారును వైశ్యులే. ఎచ్చటసమారాధన సంతర్పణ జరుగవలసియున్నను చందాజాపితా వైశ్యులే తయారు చేయ వలసివచ్చుచున్నది. దానధర్మములింకను బ్రాహ్మణులకు చెల్లించుచున్నవారును వైశ్యులే. ఇట్టిస్థితిలో వైశ్యజాతినొష్ఠన బ్రహ్మదేవుడిట్లు వ్రాయుటకేమికారణము? వైశ్యులకు ప్రాయశ్చిత్తములుకూడ పనికిరావట” వారు యేదుష్టకార్యములను చేసిరి? యే బ్రహ్మ హత్యాది మహాపాతకములకు లోనైరి?

పోనిండు తమవర్ణధర్మమేమైన తప్పించియుండిరా? ఇంకను సార్కారులో పెక్కండ్రు తమస్వధర్మమైన వ్యాపారమును ముఖ్యవృత్తిగానవలంబించుచున్నారే! కాని సర్కారుకొలువుకూటములలో నౌకరీవృత్తిని చేబట్టి దాసులై పోలేదుగదా!! తమవర్ణధర్మములైన స్వాధ్యాయ తపస్సులుమాని గవర్నమెంటు నవుకరీవృత్తిని గౌరవముగా చలాయించుచున్న అగ్రజన్ములను ప్రాయశ్చిత్తములుకూడ అక్కరలేక పవిత్రులుగా నెంచుటయేమి? కులధర్మమును పాటించుచున్న వైశ్యులకు ప్రాయశ్చిత్తములు కూడ పనికిరాని పాతిత్యమేల?

పంచములకుకూడ గాయత్రీమంత్రానుష్ఠానముగలదని స్వామి శ్రద్ధానంద మున్నగు మహనీయులు ప్రచారముచేసి వారిని అన్యమతములలోనికి బహిష్కృతులుగాక హిందూమతములోనే వారికి గౌరవస్థానములు కల్పించుచున్న యీరోజులలో సృష్ట్యాదినుండి ద్విజులని ప్రసిద్ధివడసిన యీవైశ్యజాతి కర్మమేమి తగలబడినదని, వైశ్యదూషణ గ్రంథములో "వైశ్యులు గాయత్రీ పతితులైరి." అని వ్రాసిరి? అర్థము తెలియకనో యింకను సంధ్యావందన మాచరించుచున్నవారు వైశ్యులే యని చెప్పవచ్చును. పుణ్యమువచ్చుననుయుద్దేశ్యముతోనైతేనేమి, మరి యేయుద్దేశ్యముతోనైతేనేమి బ్రాహ్మణ భోజనములకై కొందరుపగలుసత్రములను కొందరు రాత్రిసత్రములను నిర్మించుచున్నవారును వైశ్యులే. భయముతోనేమి భక్తితోనేమి యింకను నూతన దేవాలయములను స్థాపించుచున్నవారును, ప్రాతదేవాలయములను జీర్ణోద్ధారణము

గాపించుచున్న వారలును వైశ్యులే. నోములు వ్రతములు అని పేరుబెట్టి చీటికిమాటికి బ్రాహ్మణులను పిలిచి పూజించుచున్న వారును వైశ్యులే. అన్నివర్ణములవారును గుళ్ళు గోపురముల మీద విశేషధనమును వినియోగించకూడదని తీర్మానించి ఆ ధనమును తమవర్ణస్థుల విద్యాభివృద్ధికై ఖర్చుపెట్టుచుండ విద్యనుసున్నజుట్టుకొనికూడ దేవబ్రాహ్మణ పూజలు విరివిగా జేయుచున్నవారును వైశ్యులే.

ఇట్టిస్థితిలో చేసినమేలును మఱచువారుందురా? తాము చేసినమేలుకు నిజముగా వైశ్యులు హిందూసంఘములో నెంతగౌరవముగ చూడబడవలెను? ఇదివరకులేని మాలమాదిగలకు గాయత్రీయుపదేశములు సంఘములోను దేశములోను సమ్మతములగుచుండగ అనాదినుండి వచ్చుచున్న వైశ్యులకు గాయత్ర్యధికారము అడుగంటిపోవలసినదేనా?

ధర్మశాస్త్ర నిబంధనలనుబట్టియు, వేదసూత్ర నియమములనుబట్టియు పరీక్షింప మొదలుపెట్టితిమేని, యిప్పుడు ధర్మముల నుల్లంఘించక అగ్నిహోత్రతుల్యముగ పవిత్రజీవనము గడుపుచున్న వారెవరో ముందుకువచ్చి "నేను" అని నిలువబడనిఁడు. ధర్మవ్యవస్థాధికారముగలిగి ఆంక్షలు చేయగలిగిన పీఠాధిపతులయొక్క మఠములలోనే కూనీకేసులు, వారసత్వపు తగాదాలు చెలరేగి వారికింకను వ్యవహారములు తెగక విదేశ పరిపాలకుల కోర్టుచూరులను బట్టుకొని వ్రేలాడుచున్నారు. ఇట్టి పీఠాధిపతులకే మన నరసింహ సోమయాజులవారు రు 200 జరిమానా వేయించియుండినది. ఇంకను సర్వసంగపరిత్యాగు

లైన కొందరు సన్యాసులవిషయమై ఆలోచించెదమనినవారు కఠోరములైన తమసన్యాసధర్మములను తప్పించియుండుటేగాక వారుకావించుచున్న నీతివిదూరకరములైన చేష్టలు నిత్యము మన వార్తాపత్రికలయందు ఘంటా ఘోషమగుచు నేయున్నవి. ఇంకను బ్రాహ్మణాది వర్ణములను విచారించెదమనుకొనినవీరిలో ఎన్ని వర్ణద్వేషములు, వర్ణాంతరతగాదాలు, అధికారానధికార తగాదాలు, యిన్ని చెలరేగి సంఘమును చికాకుపఱచుచున్నవి? మరియు ధర్మమును వ్యవస్థచేయుటకై యేర్పడు సభలు, పరిషత్తులు వీనితరహాను చూచెదమా? ఆసభలనొక్క పర్యాయము దర్శించినవారికి సంగతులు చక్కగ దృఢపడ గలవు. కేకలు, అల్లరులు, గడబిడలు, వ్యక్తిదూషణలు, సూటీపోటీలు, తుదకు మాననష్టపు దావాలతో పరిసమాప్తి యగుచున్నవి. ఇంకను ఆశ్రమధర్మములను పరిశీలించెదమనిన బ్రహ్మచారులను తయారుచేయు గురుకులాశ్రమములుసున్న. ఏబదియేండ్లు దాటిన తరువాత వనప్రస్థులయ్యేవారు నిండుసున్న. కలియుగమునందు నిషేధింపబడిన సన్యాసులసంఖ్య మాత్రము సవ్యముగా సాగుచున్నది. ఇంకను నిజమైన గృహస్థులు కంచుకాగడాబెట్టి వెదకినను దొరకుట దుర్లభము. ఈవిధముగ వర్ణాశ్రమ ధర్మములడుగంటిపోగా వీటిని చక్కపఱచుట పీఠాపతుల యొక్కయు చయనులవారువంటి పండితోత్తముల యొక్కయు విధియైయుండ వారందునుగూర్చి వ్యవస్థచేయ బూనలేదు. అట్టిధర్మోల్లంఘనమునకు ప్రాయశ్చిత్తము యవసరమే వారిదృష్టికి తగులలేదు. కాని పురాణోక్తకర్మలుచేసి

కొనుచున్న వైశ్యులను సంస్కరించుటకు ప్రాయశ్చిత్తములు కూడ లేవట. కర్మలను అసలే ఎగబెట్టినవారు నిర్దోషులట. ఏదోవిధముగ జరుపుకొనుచున్నవారు పాపులట?

(1) పంచపంచ ఉషఃకాలమున నిద్రలేచి సుస్నాతులై ఆదిత్యునకు అర్ఘ్యప్రదానముల నిచ్చుటకుమారు లంబోదరాయనమః ఉదరం పూజయామి; అని నిద్రలేచుటతోడనే కాఫీ హోటల్నుకు బోయి ఉపమా, యిడ్డెనలను నాలుకలమ్మకు నైవేద్యమిచ్చు ద్విజోత్తములు కొందరు.

(2) న్యాయస్థానములకేగి తమ కేసులను నిర్వహించుటకై ఎట్టి అసత్యపు బోధలచేనైనను సాక్ష్య సాధనములను తయారుచేయు పెద్దలు కొందరు.

(3) బూట్సుకాళ్ళతోనే భోజనములుచేయుట కంగీకరించు ఫ్యాషనెబుల్ జంటిల్‌మేన్‌లు కొందరు.

(4) తెల్లదొరల ప్రాపు సంపాదించుటకై గోమాంస భక్షణాదికములతో గూడిన దొరల విందులలో పాల్గొనుచున్న సంస్కారప్రియులు కొందరు.

(5) జంధ్యములను బొడ్డులలో పూడ్చిపెట్టి సీమ సారాయి, బోలోన్ బ్రాంది మున్నగు సురాపానముల నందిచ్చు ఇంగ్లీషు క్లబ్బులకేగు ఘనులు కొందరు.

(6) షష్టి పూర్త్యుత్సవములు జరుపుకొనియు కామవాంఛా నివృత్తిగాక, అమాయకస్త్రీలైన భోగమువాండ్రకు

కన్నెరికములు బెట్టి, గుర్ణీతిపాలై, పైకిమాత్రము నిష్ఠతో వర్తించు శిష్యులు కొందరు.

(7) డెబ్బదియేండ్లు దాటి కాటికి కాళ్ళుజాచియు అష్ట వర్ష ప్రాయముగల నోరులేని కన్యలను శాస్త్రవిధి తప్పకుండ పాణిగ్రహణ మహోత్సవములను జరుపుకొనుచున్న ముసలి పెండ్లికొడుకులు కొందరు.

(8) ఆష్ట్రేలియా దొరలనిగాని, అమెరికా దొరసాను లని గాని దేశభేదములను పాటింపకయు, హిందూ మతమని గాని, క్రైస్తవసిద్ధాంతమనిగాని యాలోచింపక సివిల్ మ్యారేజి ఆక్టుప్రకారం ఒక్క తృటిలో గాంధర్వ వివాహములను జేసి కొనుచున్న అగ్రజాతి స్త్రీ పురుషులు కొందరు.

(9) మలయాళ కన్యలను దెచ్చుకొని రహస్యముగా బెండ్లియాడి తుదకు ఆకన్యలు శూద్రజాతివారమనియు వారల కిదివరకే వివాహములైనవనియు పిమ్మట తెలిసి, పోలీసు నేరములక్రింద శిక్ష ననుభవించుచున్న పెద్దమనుష్యులు కొందరు.

(10) యజ్ఞయాగాదులకని వేలకొలది చందాధనమును వసూలుపరచి అందులో కొలదిభాగము మాత్రమే యజ్ఞము నకై ఖర్చుపెట్టి మిగిలిన హెచ్చుమొత్తమునుగూర్చి ప్రజలకు లెక్క జమాఖర్చు చెప్పక తామే కైంకర్యముజేసి ధనవంతు లైన మహామహులు కొందరు.

హిందూసంఘమున ఈ ప్రకారము చతుర్వర్ణముల లోను పెద్దలు ప్రవర్తింపుచుండ వీరలందరును ప్రాయశ్చిత్తము లేకయే పవిత్రులని యెంచబడుచుండగ కొందరు పురాణోక్త కర్మ చేయుచున్నారని సాకుజెప్పి వైశ్యులకు ప్రాయశ్చిత్తములు కూడ పనికిరావని శృంగేరీపీఠస్థులును, వీరిసిద్ధాంతమును బలపరచు చయనులవారును, ఇట్లు కంఠోక్తిగ పలుకుట సాహసము.

"హిందూసంఘమునందు వైశ్యులకు గల స్థానము" అను శీర్షికతో వాసవియను మాసపత్రికయందు శ్రీయుత నంబూరి వెంకట్రాయ గుప్తగారు వ్రాసిన ఈ దిగువ సమాచారమును చదివిన ప్రతివైశ్యుడును తాను ఎంత హీనస్థితి యందున్నట్లెంచబడుచున్నాడో తెలిసికొనగలడు.

"బ్రహ్మ క్షత్రియ వైశ్యులను మూడుజాతులకును ద్విజులని పేరు. కాన వేదాధ్యయనమునకు బ్రాహ్మణులతోబాటు వైశ్యులకు కూడ హక్కుగలదు. కాని రాను రాను వైశ్యుల విషయమై బ్రాహ్మణుల భావము లెట్లు పరిణమించుచున్నదియు తెలిసికొనుటకు ఒక చిన్న దృష్టాంతమును కనుపరచుచున్నాము. మన వైశ్యసోదరులలో నొకరికి వేదగ్రంథములు కావలసియుండి పై డిపోకు ఆర్డరునీయగ ఆ బ్రాహ్మణ వర్తకుడు యిచ్చినజవాబు (ఇంగ్లీషుజాబుకు) తెలుగుతర్జుమా యీ క్రింద వివరించడమైనది.

(జాబు)

| | | |
|---|---|---|
| జి. ఎస్. జోసియర్ అండు సన్సు. | { | మైసూరు |
| ప్యాలెసు-ఋత్విక్కులు-పండితులు | } | 1923 ఏప్రిల్ 29 |

ప్రియమైన అయ్యా!

తాము వ్రాసిన 17 తేదీ గల జాబు చేరినది. అందుకు మేము మీకు బదులువ్రాయు నదేమనగా:— వేదాధ్యయన పరులగు బ్రాహ్మణులకుమాత్రమే మేము గ్రంథములను విక్రయించెదము. లేదా అట్టి బ్రాహ్మణులకు ధర్మము చేయదలచినవారికి విక్రయించెదము.

ఇట్లు
జి. యస్ జోసియర్ అండు సన్సు

వైశ్యసోదరులారా! చిత్తగించితిరా! పైన తెల్పిన బ్రాహ్మణ వేదగ్రంథ విక్రయదారుడు వైశ్యులకు తమ వేదగ్రంథములను విక్రయించడట. వేదవిక్రయమే దూష్యముగదా! అది అట్లుండనిండు. తనసరుకునువిడుదల జేసి లాభమును పొందుటకు కొనువారు బ్రాహ్మణులైన నేమి, వైశ్యులైననేమి? పైగా బ్రాహ్మణునకు వైశ్యుడు దానముచేసెదనని చెప్పినట్లైన అప్పుడు ఆ గ్రంథములను వైశ్యులకు విక్రయించెదరట. ఇయ్యది కేవలము వైశ్యులయెడగలఅసూయాబుద్ధినే వెల్లడించునుగాని మరియొకటికాదు. ఇట్టిసంగతులు బ్రాహ్మణవర్తకుడు చెప్పినాడుగనుక సరిపోయినది. ఒకవేళ తెలిసితెలియక యే వైశ్యవర్తకుడైనను, "బ్రాహ్మణులకుముక్కుపొడిని విక్రయిం

చము.'' అనిచెప్పి నిరాకరించినచో "నశ్యదానంమహాదానం" అని బోధించు ముక్కుపొడి ప్రియులు ఆవైశ్యుని భరతం పట్టించక యుందురా? జర్మనీ, అమెరికా మొదలగు క్రిష్టియన్ దేశములలో వేదపాఠశాలలను స్థాపించి వేదవిద్యనుపంచముల యందు సహితము వ్యాపింపజేయుచున్న యీదినములలో హిందూదేశములో పుట్టి ద్విజులలో చేరిన వైశ్యులకు వేదాధ్యయనము నేర్పుట మొదలగు విషయముల నటుండనిచ్చి తుదకు ఆవైశ్యులకు వేదగ్రంథములను అమ్ముటకుకూడ బ్రాహ్మణులకు ఆక్షేపణ కలిగియుండుట మిగుల శోచనీయము.

ఈ సమాచారము తెలిసిన పిమ్మటనైనను మన బెజవాడ వైశ్య ప్రముఖుని యభిప్రాయము మారునా? ఆయన హృదయ మేమైన కరుగునా? ఇంతటనుండియైన తన వర్ణము వారిమీద ఆయనకు అభిమానము కలుగునా?

ఇట్లు విన్నవించు,

వైశ్య వేదోక్తసంస్కార ప్రోత్సాహక సంఘము.

# నెం 7 ఱు కరపత్రము

ప్రాయశ్చిత్తమెవ్వరికి? తప్పుచేయించినవానికా? చేసినవానికా?

వైశ్యులు వేదోక్తాధికారమును సృష్ట్యాదినుండియు కలిగియుండి, విధిగా నాచరించుచుండగా, మధ్యలో మాన్పించిన వారెవరు? పురాణగ్రంథములను ప్రయోగగ్రంథములను కల్పించి వైశ్యులకు శాలంకాయన ఋషిశాపము తగిలినదనియు వారలకు పురాణోక్తకర్మయే కర్తవ్యమనియు బోధించిన వారెవరు? అనాది గోత్రసూత్రములుండగా వికారగోత్ర సూత్రములను సృష్టించినవారెవరు? వైశ్యులు సంకరులనియు గాయత్రీపతితులనియు నిరూపించుచు వైశ్యవేదోక్తక్రియా విచారవ్యవస్థా యను గ్రంథమును తయారుచేసినది యెవరు? వైశ్యులకు పురాణోక్తప్రయోగ గ్రంథమును ప్రకటించిన దుర్భాక వేంకటాచలశాస్త్రిలవా రేవర్ణస్థులు? వైశ్యులు అనులోమవిలోమ జాతిసంతతివారని వ్రాసిన ప్రౌఢసరస్వతీ నామకుడగు గండ్రకోట కుమారస్వామి శాస్త్రిగా రేవర్ణస్థులు? మామిడి వేంకటార్యులవారు తనపుత్రునకు వేదోక్త విధానమున ఉపనయనము చేసికొనుచుండగా వైశ్యులట్లు చేసికొనుట కధికారములేదని మేష్టరు పట్లేరుధొరగారియొద్ద కేసును దాఖలుచేసిన కాండ్రేగుల జగ్గప్ప మొదలగువారు బ్రాహ్మణులేగదా? నంబూరు వేంకటదాసుగారు తనకుమారునకు వైదికోపనయనము గావించుచుండ వారియింటిపై కెక్కి పెంకులను చితగద్రొక్కి అల్లరిచేసి రక్తగాత్రములగునట్లు కొట్లాటలు

జరిపించిన కాజ కొండావధానులు మున్నగువారు బ్రాహ్మణులే గదా? ఆతుకూరి లక్ష్మీనరసింహ దీక్షితులవారు రాజమహేంద్రవరములో డిష్ట్రిక్టుమునసబు హోదాలోనుండగ వారియింటిలోని వేదపుస్తక భాండాగారమును తగులబెట్టినవారెవరు? బ్రాహ్మణులు ఈ ప్రకారముగ ప్రవర్తించి పురాణకల్పములను తయారు జేసినప్పటికిని వానిని నిరాకరించి వైశ్యులు వేదకర్మలనే జరుపుకొనుచుండగా దౌర్జన్యముచేసి బలవంతముగ కొందరిని పురాణకర్మలలోనికి దింపినవారు బ్రాహ్మణులేగదా? ధర్మశాస్త్ర పరిచయముగలవారు బ్రాహ్మణులు; ధర్మశాస్త్రజ్ఞానము లేనివారు బ్రాహ్మణేతరులు, ఇట్టి స్థితిలో బ్రాహ్మణేతరులెవ్వరైనను వైశ్యులమీద శాస్త్రవిరుద గ్రంథములను సృష్టించియున్నయెడల బ్రాహ్మణులప్పుడు వైశ్యుల పక్షమున జేరి శాస్త్రప్రమాణములను రుజువుచేసి ద్విజులలో చేరిన వైశ్యుల వైదిక హక్కులను కాపాడుటకై తాము నడుముబిగించి అట్టి దూషణ గ్రంథములను రద్దుపరిపించవలసిన బాధ్యతగలవారై యున్నారుగదా? ఇట్టిపని జరుగకపోగా ధర్మవిరుద్ధములైన గ్రంథములను తామే తయారుచేసి వైశ్యుల వేదోక్తకర్మను రద్దుపరిపింప బూనుటయా? బ్రాహ్మణులు చేయవలసినపని?

రామక్రిష్ణ చయనులవారు 16-9-29 తేదీన తమ సంతకముతో ప్రకటించిన నోటీసులో, క్షత్రియపరిపాలకులు గతించినప్పటినుండియు దేవబ్రాహ్మణపూజలుగావించుచు బ్రాహ్మణజీవనము విషయమై సర్వవిధముల పాటుబడుచున్నవారు వైశ్యులేయని తెలిపియున్నారు. అట్టి వైశ్యుల విషయములో

నేనా? బ్రాహ్మణులిట్లు ప్రవర్తించవలసినది? వైశ్యులెప్పుడై నను వేదోక్తకర్మలను మానెదమని చెప్పియుండిరా? పాపము వారికి అభము శుభము తెలియదు. బ్రాహ్మణులేమి బోధించిన అయ్యది వేదమంత్ర ప్రమాణమని శిరసావహించి వారుచేయుడనిచెప్పిన పనులన్నియు చేయబూనిన సాధు మూర్తులు. "వైశ్యులారా! మీరు బహుశాపగ్రస్తులు" అని దుర్భాక వేంకటాచలశాస్త్రిగారు కేకవేసినప్పుడు "చిత్తము స్వామీ, మాగతియేమి? అనిఅడిగిరి. కడప, కర్నూలు, బల్లారి జిల్లావైశ్యులు "వేదోక్తకర్మలను వెంటనేమాని నేనుబోధించు పురాణోక్తవిధానము నాచరించినయెడల మీకు శాపవిముక్తి యగును" అని శాస్త్రిగారు ప్రత్యుత్తరమిచ్చిరి. "స్వామీ! ఇట్లు మమ్ముకృతార్థుల జేసినందుకు మీకు ప్రత్యుపకార మెట్లు చెల్లించుకొనవలసి యుండును?" అని వైశ్యులు కావించిన విన్నపము నాదరించికాబోలు, వారు రచించిన వైశ్యశాంకరీ యను ప్రయోగ గ్రంథములో సీమంతము అను కర్మనుగూర్చి వ్రాయుచు ఇట్లు తెలిపిరి.

"లడ్డుకాదిఫలదత్త్వావిప్రేభ్య."

అనగ, బ్రాహ్మణులకు లడ్డూలు పంచిపెట్టవలసినదని వ్రాసిరి. ఎంతకాలము ఆవైశ్యులీప్రకారము కర్మలుచేయు చుండిరో తెలియదుకాని, 1892 సం॥న పాపము మనలక్ష్మీ నరసింహా సోమయాజులుగారు ఆ శాస్త్రిగారికి సివిల్ నోటీసు నిచ్చి కేసు దాఖలు చేయబోగా, వారు క్షమాపణగోరి సవరణ

పత్రికను ప్రచురించిరి. ఆయుత్తర ప్రత్యుత్తరముల సారాంశము యినతగియున్నది.

ఆ. లక్ష్మీనరసింహ్వాంగారు.— " శాస్త్రిగారు! వైశ్యులకు శాలంకాయనఋషి శాపమిచ్చి నట్లెక్కడయున్నది? శల వీయుడు."

శాస్త్రిగారు—"అయ్యా పద్మపురాణమందున్నది"

ఆ. ల. నరసింహాంగారు:— స్వామి, పద్మపురాణమును నేను చూచితిని, అందెచ్చటను మీరుచెప్పినసంగతి కానరాదే? మరియెచ్చట నున్నది?"

శాస్త్రిగారు:— అయ్యా ! నేను స్వతహాగా పద్మపురాణ మునుజూచి నేనాగ్రంథమునందు వ్రాయలేదు. నామిత్రుడొ కడు తనయింటి అడపమీద నొక పద్మపురాణములో అట్లున్న దని నాతోచెప్పగా, ఆ మాటలను నమ్మివ్రాసితిని."

ఆ-లక్ష్మీనరసింహాంగారు:— శాస్త్రిగారూ! మీ మిత్రునడిగి, ఆ పద్మపురాణమును నాకుబంపుడు?"

శాస్త్రిగారు:— "అయ్యా, నామిత్రునియొద్దనున్న గ్రంథము పద్మపురాణము కాదట. అదియేదో ఒక పాతపుస్తకమట"

ఆ. ల. నరసింహాంగారు:— "స్వామీ! ఆపాతపుస్తకము నొక పర్యాయము నాకు బంపుడు"

శాస్త్రిగారు:—"అయ్యా! నన్ను తిప్పలు పెట్టకుడు. నేను బ్రాహ్మణుడను వైదికిని, ఏవో, నామిత్రుడు చెప్పినమాటల నునమ్మి గ్రంథమును వ్రాసినాను. వెంటనే ఆగ్రంథమును రద్దుపఱచి సవరణ పత్రికను ప్రకటించెదను."

వైశ్యసోదరులారా! చిత్తగించితిరా, వైశ్యులకు వేదోక్తకర్మ విధానము నశించుటకు కారణము, వైశ్యులయొక్క కర్మలోపముచేతనో, లేక, విద్యావంతులై ధర్మశాస్త్ర పరిజ్ఞానము కలిగి, వైశ్యులవలన దేవబ్రాహ్మణ పూజలు గైకొనుచున్న బ్రాహ్మణ మహానుభావులయొక్క పురాణకల్పముల కల్పనచేతనో, తమరే సత్యమును గ్రహింప గలుగుదురు.

ఇంతియేగాదు. కొన్నిచోట్ల పౌరోహితులు విద్యాగ్రంథమేమియులేని వైశ్యులగృహములలో వివాహోపనయనములు జరిపించునప్పుడు ఆపురోహితులు వైదిక వివాహమంత్రములనుగాని లేక తుదకు పురాణోక్త వివాహశ్లోకములనుగాని ఉచ్చరించుటకు బదులుగా సుమతీశతకములోనిపద్యములు, గంగానమ్మ, పోలేరమ్మలమీాది సుద్దులు, దండకాలు, పాడిమేళాల గల్లంతులు ముచ్చటగానడిపి, ఉపనయనములు, వివాహములు చేయించుచుండిరి. పాపము అమాయకులైన వైశ్యులకేమి తెలియగలదు ?

విఘ్నేశ్వరపూజకు సోలెడుగిద్దెడు, గౌరీపూజకు తవ్వెణ్ణరసోలెడు, పుణ్యాహవచన నానికి మానెడుసోలెడు, మామూాళ్ళు బ్రాహ్మణున కొప్పచెప్పి బ్రహ్మముడిలో వరహాబిగించి, ముత్తైదులకు మూాడు వాయినాలిప్పించి, అలకలో అల్లునికి అయిదు వరహాలు అర్పించుకొని ఈపరాలకు దొంగచెంబుక్రింద దోసెడురూపాయలుపోసి బ్రహ్మత్వ దక్షిణక్రింద ఆడబడుచు యొక్క హారతిరూపాయలు చెల్లించమని పురోహితబ్రాహ్మణులు చెప్పినట్లుచేసి యిల్లు నాగవల్లి తీర్చినట్లుచేసు

కొని పెం డ్లైందిగదాయని పదిలముగా పఠకబెట్టుదురు. ఈ విధముగ కొన్నిచోట్ల వివాహతంతు, బొత్తుగా మంత్రశూన్యమై కర్మరహితమై జరుపబడుచున్నది.

ఇందుకు దృష్టాంతము కావలెనన్న దుర్భాక వేంకటాచల శాస్త్రిగారు ప్రకటించిన సవరణపత్రికలో నిట్లువ్రాసిరి.

"ఒక్కొక్కచోట వైశ్యులు గృహ్యాగ్రంథములేక, వారివారి పురోహితులుచెప్పు గణాష్టకములు, అమరము, బాలరామాయణము, మహిమ్నము మొదలగు గ్రంథముల యొక్క శ్లోకములే, వివాహ ఉపనయనమంత్రములుగ నుపయోగించుచున్నారు." చిత్తగించితిరా! శుద్ధమైన వివాహ వైదిక మంత్రములకుబదులు పురోహితులు బాలరామాయణ పద్యాలుపాడి, కర్మలు చేయించుచున్నారని శాస్త్రిగారే సాక్ష్యమిచ్చు చున్నారుగదా ? ఈ పాదిత్యమెవరిది ? ఇక ప్రాయశ్చిత్తమెవరికి? దీర్ఘముగ నాలోచించుడు.

మరియు, పురోహితులు కొన్నిచోట్ల తెలియక పొరపాట్లు చెప్పుటచే మహాదోషములను మూటగట్టుకొనవలసి వచ్చుచున్నది. ఈ బెజవాడ పురములో నొక వైశ్యసోదరుని యింట్లో ఉపనయనము జరిగియుండెను. సుముహూర్త కాలమున పురోహితుడు చూర్ణికా పఠనముచేయుచు, సీతారుంధత్యహల్యా ద్రాపదీ తారామండోదరీ పాంచాలీ దమయంత్యాది మహాపణ్యాంగనానాం" అనిచెప్పెను. ఈవాక్యములో మహాదోష పదమొకటి ప్రయోగింపబడెను. అది యేమన,

పణ్యాంగన అని చదువకూడదు. పుణ్యాంగన అని యుండ వలెను. శబ్దములో లోపము ఆవగింజయంతమాత్రమే కలదు. అనగ ప అనే అక్షరమునకు కొమ్ముమాత్రము లేదు. కాని అర్థములో హస్తిమశక తారతమ్యము కలదు. పణ్యాంగన యనగ, వెలయాలి (మానమును విక్రయించు కొనునది) పుణ్యాంగన యనగ పతివ్రతాస్త్రీ యనియర్థము. సీతా దమ యంత్యాదులను మహాపుణ్యాంగనలనుమంత్రము చెప్పుటవలన మన ఉపనయనకర్మకు మంగళము సేకూరునుగాని అట్టివారిని భోగమువాండ్రైన పణ్యాంగనలు అని పేర్కొనుటచే మహా పాదిత్యము కలుగక మానగు. ఇట్టి స్థితిలో ఒకమిత్రుడు లేచి ఆ పౌరోహితుని మందలించి, అయ్యా, సీత మొదలగుస్త్రీలను గూర్చి పణ్యాంగనలని పలుకవలదు. "పుణ్యాంగనలని దిద్ద గోరుచున్నాను". అని నుడువగా ఆ పురోహితునకు ఆగ్రహము వచ్చెను. ఈపాదిత్యమెవరిది ? ఇయ్యది అర్థము తెలియని పాపము.

ఇకను తెలిసి మోసబుద్ధితో చేయునవియు అనేకములు గలవు. కొన్నిచోట్ల వైశ్యులు తమ పురోహితులను బిలిచి "అయ్యా ! మాకు కర్మలు వేదోక్తవిధానమున చేయించండీ" అని అడిగెడివారికి పురోహితు లీదిగువ విధముగ చెప్పి భయ పెట్టిరి. "వేదోక్తము కావలెనంటే నట్టింట నిప్పుపెట్టవలెను. నట్టింట నిప్పుపెట్టిన మరునాడు యింట్లోపీనుగ బయలుదేరును" అని జవాబు చెప్పుటచే బ్రాహ్మణుల మాటలు నమ్మి కొన్ని జిల్లాలలోని వైశ్యులు భీతావహము జెంది, వేదోక్తకర్మలకు

స్వస్తి జెప్పిరి. కొన్ని ప్రాంతములలో పురోహితు లట్టి జవాబీయక, వేదోక్త విధానమే యని చెప్పి పురాణశ్లోకములనే వల్లించి కర్మలు చేయుచున్నారు. వేదోక్తమునకును పురాణోక్తమునకు కర్మభేదముగాని మంత్ర వ్యత్యాసముగాని గ్రహించజాలని అమాయకులైన వైశ్యులకా, లేక మోసగించిన బ్రాహ్మణ యాజ్ఞీకులకా, ఈ పాతకము చుట్టుకొనుట.

మరియొక విచిత్రనాటకముకూడా కొన్నిచోట్లజరిగినదట. ఒక సాహుకారు గృహములో గ్రహశాంతి జరుపవలసియుండి, బ్రాహ్మణుడు హోమగుండములో నాహుతులను విడుచుచు నీక్రింది విధముగ మంత్రములను జెప్పుచుండెను.

[1] ఓం, కట్టా, యస్వాహా, కట్టా ఇదంనమమ.

[2] ఓం, కంపా, యస్వాహా, కంపా, ఇదంనమమ.

అనగా ఓ,కట్టెపుడకా, ఓకంప పేడా! మిమ్ముహోమము చేయుచున్నాను, చక్కగా హుతమగుదురుగాక, అని మంత్రార్థము. ఇంతలో మరియొక శాస్త్రిలవారువచ్చి, ఈ దిగువ మంత్రమును చెప్పెను.

“ ఇదేమిటయ్యా, స్వాహా, ఇదేమిటి, ఇదంనమమ.” అనగా, “ ఇదేమిహోమము, ఇదేమిమంత్రమయ్యా,” అని అర్థము.

ఇందుకు జవాబుగ పురోహితుడు, ఈ క్రింది హోమ మంత్రమును ప్రయోగించెను.

"అప్పైతే, నీకూనాకూ, చెరిసగాయస్వాహా, నీకూ నాకూ చెరిసగం, ఇదంనమమ."

"అట్లాగైతే, ఓ బ్రాహ్మణుడా, శెట్టిగారినుండి నేను సంగ్రహించబోవు డబ్బులో నీకూనాకూ చెరిసగమేగాని అంతానాకుగాదు. సుమా" అని అర్థము. ఈ ప్రకారముగ దొంగలూ దొంగలూ కలిసి ఊళ్లు పంచుకొన్నట్లుగ, కొన్ని ప్రాంతములలో బొత్తుగ చదువుసంధ్యలేని పల్లెటూరు శెట్టిగార్ల కష్టార్జితద్రవ్యము, కట్టెకంపలతో హోమమగుచున్నది. ఈ పాతకమును ఎవరెవరికి ఎన్నెన్నిపాళ్లు పంచిపెట్టవలయునో ఆ కట్టెకంప, బ్రాహ్మణులే చెప్పవలెను.

ఈ కరపత్రమును సావధానముగ చిత్తగించినవారికి, నిజస్థితి తెలియకమానదు. వైశ్యులు అనాదినుండియే వేదోక్త కర్మలయందు శ్రద్ధాభక్తిగలవారలై బహుకాల మాచరించు చుండిరి. కాని కొలదికాలముక్రిందట కొందరు బ్రాహ్మణులు అసూయాగ్రస్తులై, దూషణగ్రంథములను ప్రకటించి, ఆ గ్రంథములలో.

(1) వైశ్యులు కలియుగమున పూర్తిగ నశించిరి.

(2) నశించిపోగా ఉన్నవారు సంకరజాతులు.

(3) వారు గాయత్రీపతితులు.

(4) వారికి ఋషిగోత్రసూత్రములు లేవు.

(5) పురాణోక్త కర్మలు చేయించుచుండుటచే అతినీచ వృత్తిలో నున్నారు.

(6) వారిని సంఘములో కలుపుకొనుటకు ప్రాయశ్చిత్తములు కూడ పనికిరావు.

(7) అక్కడక్కడ కొందరు వైశ్యులు ఇటీవల లంచములనిచ్చి బ్రాహ్మణులను వంచించి, వేదోక్తముగ కర్మలుచేయించు కొను చున్నారు.

(8) వారిలో నొకడు ఆత్మూరి లక్ష్మీనరసింహం అనువాడు అగ్న్యాధానముకూడ చేసినాడు.

ఇట్టి సంగతులను ప్రకటించుచు సిద్ధాంతగ్రంథములను, ప్రయోగ గ్రంథములను, సంగ్రహగ్రంథములును, పురాణ కల్పనా గ్రంథములను, చిత్రవిచిత్రములుగ వ్రాసి వెదజల్లిరి. ఈగ్రంథముల నాధారపరచుకొని పౌరోహితులు, కొన్నిచోట్ల తెలియకను, కొన్నిచోట్ల తెలిసియు, మరికొన్నిచోట్ల మోస బుచ్చియు, కొన్నిప్రాంతములలో దౌర్జన్యములు జరిపి, దెబ్బ లుకొట్టి, పుస్తకములను తగలబెట్టి, చార్జీలు దాఖలుచేసి, ఆంక్షపత్రికలను తెప్పించి, పరిపరివిధముల వ్యాఖ్యానములు వ్రాసి, విపరీతార్థములను చెప్పి, వైశ్యులను నానాతంటాలు పెట్టినప్పటికిని, ఇన్ని శ్రమలకోర్చియు బహువంది వేదోక్త ముగనే కర్మలాచరించు చున్నారు. ఇట్లు తమ వేదమతము నశించిపోకుండ, సృష్ట్యాదినుండియు పెనుగులాడి పట్టుకొని వచ్చుచున్న వైశ్యులకిప్పుడు ప్రాయశ్చిత్తములుకూడా పనికి రావట. ఈ చరిత్రను సాకల్యముగ చిత్తగించిన పిమ్మటనైనా, ప్రాయశ్చిత్తము నిజముగ నెవ కి చేయించవలెనో, ప్రాజ్ఞులు గ్రహించెదరుగాక!

ఇదియంతయు, దేవబ్రాహ్మణ పూజాఫలముగాక మరి యేమైయుండును? దేవబ్రాహ్మణ పూజలను బాహాటముగా నిరాకరించి, బ్రాహ్మణేతరోద్యమమును సాగించి స్వకులపౌరోహిత్యముచే కర్మలను జరుపుకొనుచున్న బ్రాహ్మణేతరసోదరుల యొక్క సంఘగౌరవము, విద్యాభివృద్ధి, వ్యాపారవిజృంభణము, కులాభిమానము, పరదూషణా సహిష్ణుణ, స్వదేశభక్తి, స్త్రీ విద్యావ్యాపకము, సంస్కృత విద్యాప్రచారము, రాజకీయస్థానములయందు పలుకుబడి, ఉన్నతోద్యోగములసంపాదన, ఖద్దరు దీక్షావ్రతము, స్థానికపరిపాలనా కౌశలము తక్కువజాతుల వారియెడల సహకారచింతను పరికింపుడు. ఇట్టి సౌభాగ్యములు బ్రాహ్మణేతరులు సంపాదింపగలిగిరిగాదా! "దేవబ్రాహ్మణులకై మన సర్వస్వమును ధారబోయండీ" అని నిత్యము చెవులు తడకలుకట్టునట్లుబోధించు మనబెజవాడవైశ్యప్రముఖుని మాటనునమ్మి నడుచుకొనిన మనవైశ్యులస్థితియెట్లున్నదియు తెలిసికొనుటకు శాంతముతో, ఓపికతో, కరపత్రమును చిత్తుకాగితాలబుట్టలో దాఖలుచేయక, శ్రద్ధతోచిత్తగింపుడనియే మాప్రార్థన.

ఇట్లు, విన్నవించు.

వైశ్య వేదోక్తసంస్కార ప్రోత్సాహక సంఘము.

---

## నెం 8 వ కరపత్రము.

"మీ కష్టార్జిత ధనమంతయు, దేవబ్రాహ్మణుల కర్పింపుడు" అని ప్రబోధము చేయుచున్న బెజవాడ వైశ్య ప్రముఖునినమ్మి నడుచుకొని నందుకు వైశ్యులు పొందిన ఫలితములు.

(1) గతసంవత్సరము కార్తికమాసములో శ్రీమల్లేశ్వరస్వామివారి శివాలయమున నిత్యము పూజలు, లింగాభిషేకములు, దీపదానములు, కర్పూరహారతులు మున్నగునవి స్వామికి భక్తులనేకులు స్త్రీ పురుషులువచ్చి ఉపచారములు సలుపుచుండిరి. ఇట్లుండనొకనాడు మామూలుప్రకారము కొందరు వైశ్యులు గుడిలోనికిబోయి స్వామికి అర్చనాదులు జరుపవలెననిసంకల్పించిరి. కాని అచ్చటనున్నఅర్చకులు వైశ్యులను లోపలకు బోనీయక అడ్డుపఱచిరి. కారణమేమని యడుగగా, "యీదినము పౌర్ణమిసోమవారం జనసమర్ద ముండును. అర్చకుల రాకపోకలకు యిబ్బందిగానుండును. అందుచేత ఈనాడు యెవరును లోనికి రాకూడదను నియమమేర్పాటు చేసినాము" అని అర్చకులు జవాబుచెప్పిరి. ఈయేర్పాటు న్యాయమైనదియు, అందరును ఆమోదించవలసినదే అయి యున్నది. ఏలననగా, కార్తీకసోమవారం ఉపవాసపుదినము గనుక పెక్కుమంది స్త్రీపురుషులు ఆనాడు దేవాలయమునకు వచ్చి పూజలొనర్తురు. వారందరిని లోనికి పోనిచ్చేయెడల ఆలయములోపల యిబ్బంది కలుగుననుమాట వాస్తవమే

కాన అట్టి యేర్పాటు సమంజసముగనే యున్నదని నమ్మి మన వైశ్యసోదరులు లోనికివెళ్లక అర్చకులయాజ్ఞను శిరసా వహించి బైటనే తమ పూజాదులు జరుపుకొనుచుండిరి.

ఇట్లుండ కొందరు బ్రాహ్మణులు ఆలయములోనికి ప్రవేశించిరి. అర్చకులు వారిని ఆటంకపరచక పోవుటయేగాక, ఆదరముతో లోనికిపోనిచ్చిరి. ఈ విపరీతచర్య మనసోదరులకు కొంతన్యూనతను కలిగించినందున వెంటనే ఒకరిద్దరు లేచి ఆలయములోనికి ప్రవేశింపయత్నించిరి. అర్చకులు వారిని అడ్డుపెట్టిరి. కారణమేమని వైశ్యసోదరులడుగగా "వైశ్యులు లోనికిరాకూడదు." అని బదులుచెప్పిరి. వైశ్యులు లోనికిరాకూడదని మీరు ఇదివరకు ఆజ్ఞచేయలేదు. జనసమ్మర్దమగును గనుక ఎవరును లోనికి పోకూడదని మీరు ఉత్తరువును కావించిరి. ఇప్పుడు బ్రాహ్మణులనుమాత్రమే పోనిచ్చెదము, అని మొదటిఉత్తరువును మార్చుటవలన మీ కేదియో దురుద్దేశ్యముండి యుండవచ్చునని వారిలో మనవారనిరి. కాని వైశ్యులు సాధారణముగ దౌర్జన్యమునకు పూనుకొనరు. ప్రశాంతముగ బయటనేనిలవబడియుండిరి. కాని వారిమనసులో బ్రాహ్మణులుకావించిన ఉపాయము,పన్నుగడ, దురుద్దేశ్యము వీటినిగూర్చి పరితాపములేకపోలేదు. ఇంతలో ఒక శూద్రస్త్రీ లోనికి బాహాటముగ ప్రవేశించెను. అర్చకులు అడ్డుచెప్పక పోనిచ్చిరి. ప్రపంచములో యేమానవుడైనను యిట్టి అవమానమునుబొంది సహించియుండునా ? జనసమ్మర్దమునకై యేర్పాటు చేసిన ఆటంకమును యిప్పుడు రెండువర్ణములవారి

విషయమై పాటించక, ఒక్క వైశ్యవర్ణముమీదనే ప్రయోగించిరి. బ్రాహ్మణులును శూద్రులును లోనికివెళ్లుటకు హక్కు కలిగియుండ అట్టిపని జరుపుటకు వైశ్యులకేల హక్కులేదో తెలియలేదు.

కాని ఈ యన్యాయమును, అవమానమును సహించలేని కొందరు ఆర్యవైశ్యులు యింకను లేకపోలేదు. కేవలధనసంపాదనకే మనుజుడు పుట్టలేదు. వైశ్యచక్రవర్తులనాటి రక్తమును, వైశ్యశూరాగ్రేసరులనాటి పౌరుషమును యింకను కొందరిలో దాగియున్నమాట వాస్తవము. పూర్తిగ నశించలేదు. మన వైశ్యసోదరులు అన్నవరపు వెంకట్రామయ్యగారు మొదలగు కొందరు లోనికివెళ్ళిరి. కాని వెంటనే అర్చకులును బ్రాహ్మణులును యేకమై వారిని బయటకులాగివైచిరి. అప్పుడు ఉభయపక్షములకును కొంతపోరాటము కలిగినది. చేతులు కలుపుకొనిరి. "వైశ్యులు దేవాలయములో ప్రవేశించిరి. గనుక దేవునికి మైలసోకినది. సంప్రోక్షణకానిదే పూజాదులు జరుపము" అని బ్రాహ్మణులు కలవరపడిరి. అర్చకులు వారందినములు దేవాలయమునకు బీగంవేసిరి.

ఏమిచిత్రము! శూద్రస్త్రీ ప్రవేశమువలన అపవిత్రము జెందజాలని దేవాలయము వైశ్యప్రవేశమువలన అంటుపడినది. సంప్రోక్షణ బ్రాహ్మణ సమారాధనలచే గాని దేవుడు తిరిగి శుద్ధిపడడట-ఈ దేవాలయమునకు ధర్మకర్తలు వైశ్యులు ఈ ధర్మకర్తలేమైన విచారణ చేయగలిగిరా? చేసియున్న యెడల న్యాయమును విమర్శించిరా? ప్రయోజన మేమైన

యుండెనా? అర్చకులుగాని బ్రాహ్మణులుగాని ధర్మకర్తల మాటను లక్ష్యపెట్టినట్లు తోచదు. లక్ష్యపెట్టవలెనని ధర్మకర్తలకును దురదయున్నట్లు కనుపించలేదు. ఎవరు ఖర్చుపెట్టిననేమి? పిమ్మట సంప్రోక్షణజరిపి, వైశ్యసంపర్కదోషము దేవాలయ సరిహద్దులనుండి తొలగిపోవుటకై బ్రాహ్మణ సంతర్పణమాత్రము తృప్తికరముగ జరిగించిరి. ఇయ్యది దేవ బ్రాహ్మణ పూజయొక్క మొదటి ఫలితము.

[2] గడచిన కృష్ణష్టామికి కొందరు స్వాములును బ్రాహ్మణులును శ్రీ బెజవాడ కన్యకాపరమేశ్వరీ అన్నసత్రం మేడమీదను, కృష్ణజయంత్యుత్సవమును జరపించిరి. ఆయుత్సవ సందర్భమున పురములోని బ్రాహ్మణులును, వైశ్యులును స్త్రీ పురుషసమేతముగ మామూలుప్రకారము భక్తులు కాలక్షేపమునకు వేంచేసిరి. అచ్చట సమావేశమైన స్త్రీ బృందములోని బ్రాహ్మణ ముత్తైదువులకుమాత్రము గంధము, పసుపు, కుంకుమ, రవికెగుడ్డలు మున్నగు సువాసినీ మర్యాదలను జరిపిరి. వైశ్యస్త్రీలకు అట్టిమర్యాదలను జరుపక పంపివేసినసంగతి యెల్లరకును తెలిసియేయున్నది. సర్వమును తెలిసిన బ్రాహ్మణోత్తము లిట్లుకావించుట పాడియేనా? పండ్లుఫలములుగాని, దక్షిణ తాంబూలాదులుగాని, వస్త్రవాహనాలుగాని, కావలెనని తంటాలుపడువారుకారు, మన వైశ్య స్త్రీ సోదరీమణులు. వారును సువాసినులే గనుక, బ్రాహ్మణ ముత్తైదువులతో పాటు, గంధము, పసుపు, కుంకుమ, యిట్టిమర్యాదలను వైశ్య స్త్రీ లేలపొంద నర్హులుకారో, బ్రాహ్మణమిత్రులు వెల్లడించి

యుండలేదు. ఆనాడు జయంత్యుత్సవమును దర్శించుటకు వెళ్లిన శ్రీయుత ఆత్మకూరి నరసింహంగారి అర్ధాంగలక్ష్మియు శ్రీయుత గుడివాడ వీరయ్యగారి స్నుషారత్నమును [కోడలు] మొదలగు పెక్కండ్రు వైశ్యనారీమణులు, బ్రాహ్మణులచే గౌరవింపబడక పరిభవము జెందినవారగుటచే మిక్కిలి విచార పడి, లేచివెళ్లిరి. ఈకన్యకాపరమేశ్వరీ అన్నసత్రమునకు ధర్మ కర్తలెవరు? వైశ్యులే. ఆధర్మకర్తలెవరైనా, యీ వైశ్య స్త్రీల పరాభవమునుగూర్చి విచారమునొందిరా? విచారణయే మైన చేసియుండిరా? లేదు. జయంత్యుత్సవము జయప్రదముగ జరిగి, అన్నశాంతికొరకు బ్రాహ్మణ భోజనములు మాత్రము సలక్షణముగనే జరిగినవి. ఇయ్యది దేవబ్రాహ్మణ పూజ యొక్క రెండవ ఫలితము.

(3) బెజవాడలో వైశ్యవిద్యార్థుల వసతికై అన్నసత్రం మేడమీాద కొంత యేర్పాటుచేసిరి. ఆవిద్యార్థులకు భోజన ములు, సత్రంరాసి వంటలోనుండి తీసిపెట్టుచుండిరి. మరునాడు చద్దిఅన్నముకూడ పెట్టుచుండిరి. విద్యార్థుల సౌకర్యములను విచారించుటకు పైతనిఖీకర్తగ, ఒక ఆఫీసరుగాని విద్యార్థి కుడుగాని విద్యార్థుల సౌకర్యములను తెలిసిన యొక వైశ్య పెద్దమనుష్యునిగాని నియమించుట మంచిదని యీాపురము లోని వైశ్యులందరును సంకల్పించి (1) గుజ్జు సుబ్బారావు గారు బి. ఏ. యల్, టి. గారినిగాని (2) తూనుగుంట్ల రామ స్వామిగుప్త బి. ఏ. బి. యల్ గారినిగాని (3) చుండూరు వెంక టరెడ్డి బి. ఏ. గారినిగాని [4] సింగంశెట్టి నారాయణమూర్తి

బి. ఎ. గారుగాని లేక వైశ్యులలో విద్యావంతులై, విద్యార్థుల లక్షణములను సౌకర్యములను తెలిసిన యొకఅనుభవశాలిని గాని, నియమించ వలసినదని ధర్మకర్తలను కోరిరి. కాని ఆధర్మకర్తల యుద్దేశ్యమేమోగాని ఇంతమంది వైశ్యవిద్యాధికులలో ఒక్కరైనను తనఖీకర్తగ నుండుటకు పనిరాకిలేదట. తుదకు నెలకు 10 రూపాయిలు జీతము పుచ్చుకొను బ్రాహ్మణగుమాస్తాలనే తనిఖీకర్తలగ నేర్పాటుచేసిరి. ఈబ్రాహ్మణ గుమాస్తాలయందు ధర్మకర్తలకు భక్తివిశ్వాసములుండుట ప్రశంసార్హమైన సంగతియె, కాని ఇంగ్లీషు చదువుకొను విద్యార్థుల సౌకర్యములసంగతి పాపము యీ వసూళ్లుచేసే గుమస్తాలకేమి తెలియును? విద్యార్థులు బహుకష్టముల పాల్పడిరి. అన్నము ఒకప్పుడు పక్వముకానిది. నెయ్యిలో నూనెకలసినది. మజ్జిగలోచచ్చిన చిమటలు, కూరలు సిసలుగలేకపోవడము, ఆరోగ్యముచెడి చాలామందికి అప్పట్లో రోగములు కలిగెను. ఈవిషయమై కొందరుపెద్దలు విచారణలుసల్పి రెండుమూడు రిపోర్టులను ధర్మకర్తలకు బంపినను వారు లెక్కచేయలేదు. ఆరిపోర్టులను ప్రకటించుటకు సిద్ధముగానున్నాము- ఎందరో వైశ్యులు, మహానీయులు, విద్యాసంపన్నులుండగా, వారిని తృణీకరించి అనుభవములేని బ్రాహ్మణ గుమస్తాల వశముచేసి విద్యార్థులకు కష్టములను కలుగజేయించు చున్నదియేది? ఇయ్యది దేవబ్రాహ్మణ పూజయొక్క మూడవ ఫలితము.

(4) బెజవాడ కన్యకాపరమేశ్వరి అన్నవైశ్యసత్రం కమిటీవారు వైశ్యులగృహములలో వివాహాది కార్యములకు

ప్రతివివాహమునకును రు 6-0-0 సత్రంఫండు వసూలుచేయు చున్నారు. ఈ సుంకమును వసూలుచేయుటకు కమిటీవారు ఒక బ్రాహ్మణగుమస్తాను నియమించిరి. వారిపేరు కుంచనపల్లి బుచ్చిరామయ్యగారు. కన్యాదాతలయొద్ద రు 6-0-0 వసూలు చేసియు రు 5-0-0లకు మాత్రమే రశీదు లిచ్చు చున్నారు. ఇట్లుచేయుటకు కారణమేమని కొందరు తెలిసినవారుఅడుగగా "నేను అనేక సంవత్సరములనుండి ఈ ప్రకారముగనే వసూలు చేయుచున్నాను. నాకు మామూలుకలదు. కట్నం మొత్తము రు 6-0-0 లలో నాకు వాటాకలదు. నావాటా సొమ్ము మినహాయించుకొని రశీదు నీయవలసినదని నేను అధి కారముపొందినాను" అని యీ బ్రాహ్మణగుమస్తా దౌర్జన్యము చేసి అధికారం చలాయించి నోటులేని వైశ్యులయొద్దను, నోరున్న వైశ్యులయొద్దను గూబలు మెలివేసి లాగుచున్నాడు. ఇట్లు చేయుట శిక్షాస్మృతి ప్రకారం గొప్పనేరమగును. ఈ విషయమై కొందరు పెద్దలు కమిటీవారితో మనవి చేసికొన్నను వారు తూష్ణీభావమును దాల్చిరి. వైశ్యమహాజనుల మొఱ లనుకూడ పాటింపకుండ చేయుచున్న ఈమహాశక్తి యేది? ఇయ్యది, దేవబ్రాహ్మణపూజయొక్క నాల్గవ ఫలితము.

(5) బెజవాడ వైశ్యవిద్యార్థుల వసతిగృహమును, అందలిపరిపాలనయు, సత్రములో నుంచుటచే కొన్నిఅనర్థములు తటస్థించు చున్నవనియెంచి, వైశ్యమహాజనులు మూడుసంవత్స రములక్రింద, సత్రంకమిటీవారిచే నొకతీర్మానమును చేయించి యుండిరి. వైశ్యవిద్యార్థి వసతిని, సత్రములోనుండి తీసివేసి,

స్కూలుకు సమీపమున నొక అద్దెగృహమును తీసికొని అందులోనేర్పాటుచేయించవలెననియు, దానిమీద తనిఖీకర్తగ నుండుటకు శ్రీయుత గుజ్జు సుబ్బారావు బి. ఏ. యల్. టి. హిందూహైస్కూలు టీచరుగారిని యేర్పాటుచేసి తీర్మానించిరి. ఈ తీర్మానము జరిగి మూడేండ్లయినది. ఇంతవరకు ఆ తీర్మానమునుల్లంఘించి విద్యార్థులను బ్రాహ్మణగుమస్తాల పరిపాలనక్రిందనే కృశింపచేయించుచున్న మహాశక్తియేది?- ఇయ్యది దేవబ్రాహ్మణ పూజయొక్క అయిదవ ఫలితము.

(6) బ్రాహ్మణ గుమస్తాగారైన కుంచనపల్లి బుచ్చిరామయ్యగారు, వైశ్యాహాస్టలును గూర్చి కమిటీవారికి రిపోర్టు వ్రాసిన యొకపెద్దమనుష్యుని విషయమై చిట్టూరి రామకృష్ణయ్యగారితో కొన్నినిందావాక్యములను పలికిరి. ఆనిందావాక్యములగూర్చి విచారించవలసినదని ఆ పెద్దమనుష్యుడు కమిటీవారితో పిర్యాదిచేయగ, కమిటీవారు జోక్యము పుచ్చుకొనలేదు. ఇట్టి ఘనకార్యములు వైశ్యసంఘమువారికి గుమస్తా బుచ్చిరామయ్యగారు యొనర్చినందున, తమ కృతజ్ఞతను చూపుటకై కమిటీవారు బుచ్చిరామయ్యగారికి ప్రమోషన్ చేసినట్లును, ఆయన రేపో యెల్లుండియో, ఉద్యోగం చాలించుకొనేయెడల కమిటీ ఫండులోనుండి, ఆయన జీవితపర్యంతమును ఆయన భార్యాబిడ్డల జీవితపర్యంతమును, పించను (పెన్షను)నిచ్చి శాశ్వతజీవన యేర్పాటుచేయ సంకల్పించచినట్లు తెలియుచున్నది. ఇట్టిఅద్భుతచర్యలను కావించుచున్న శక్తియేది? ఇయ్యది దేవబ్రాహ్మణ పూజయొక్క ఆరవఫలితము.

(7) బెజవాడ ఇంద్రకీలాద్రి పర్వతముపైన అనాదిగా వేంచేసియున్న శ్రీదుర్గామల్లేశ్వర దంపతుల దేవాలయము లకు, నిరంతరము సేవయొనర్చి శాశ్వత కట్టడములను నిర్మిం చుటయందును, తీర్థయాత్రికులకు సౌకర్యముల నేర్పాటుచే యుటయందును, ధనమును, స్వహస్త పరహస్తములద్వారా సేకరించి దేవాలయోత్సవాదులు గావించుటయందును బహుభక్తి శ్రద్ధలతో ఈశ్వరసేవయొనర్చినదేవాలయధర్మకర్త ప్రముఖులు కీ. శే. మాజేటి నాగభూషణంగారేమి, వారి తదనంతరము అకుంఠిత కార్యదీక్షతో నేటికిని ధర్మకర్తృత్వ మును చెలాయించుచున్న వారి పుత్రరత్నమగు శ్రీయుత మాజేటి అంకయ్యగారేమి, ప్రజలయొక్కయు, దేవాలయ పరిపాలక బోర్డువారియొక్కయు గౌరవమునకు పాత్రులు కావ లసియుండగ వారల సంగతినే తలపెట్టక రు 10-0-0 జీతమును గ్రహించు దేవస్థానపు గుమస్తా చోడవరపు వాణీపతిగారి ఛాయాపటమును, మల్లేశ్వరస్వామి ఆలయ సరిహద్దులలోగల శంకరమఠము గోడమీదను నిర్మించియుండిరి. మహనీయులైన ట్రస్టీలు, అనేకులుండగ వారినందరిని విడచి రు 10-0-0 జీతము సంపాదించు ఒక బ్రాహ్మణ గుమాస్తాయొక్క ఛాయావిగ్రహ మును శంకరమఠమున, దత్తాత్రేయులతోబాటు, ఆది శంకరు నితోబాటు, దుర్గాదేవితోపాటు, సమాన గౌరవమునిచ్చి వివిధ ఛాయలతో విస్ఫుటాక్షరములతో, చిత్రకారుని నైపుణ్యము నష్టముకాకుండ, గోడమీాద చెక్కించి ఆయనగారి కీర్తిచంద్రి

కలను ఆచంద్రతారకముగ కాపాడనెంచిన మహాశక్తియేది ? ఇయ్యది దేవబ్రాహ్మణ పూజయొక్క ఏడవఫలితము.

(8) దేవాలయోత్సవాదులలో అనవసరమైన ఖర్చుల తగ్గించి, విద్యావ్యాపనకై వినియోగించ వలసినదని బహు జనాభిప్రాయమై యున్నది. ఈకారణమువలన కొందరు వైశ్యవిద్యాభిమానులును పెద్దమనుష్యులును బెజవాడ కన్యకా పరమేశ్వరీ అన్నసత్రం కమిటీ ధర్మకర్తలతో నీవిషయమై ప్రస్తాపించిరి. గడచిన శివరాత్రి ఉత్సవములకు రు 150. (నూట యేబదిరూప్యములు మాత్రమే ఖర్చుపెట్టెదమని సత్రంకమిటీ ధర్మకర్తలు ఆపెద్దమనుష్యులయెదుట ఒప్పుకొని వారిని ఆప్రకారము నమ్మించి తుదకు రు 1500 (పదిహేనువందల రూపాయిలు) ధనవ్యయము గావించినట్లు తెలియుచున్నది. ఇయ్యది దేవబ్రాహ్మణ పూజయొక్క ఎనిమిదవ ఫలితము.

(9) శ్రీకన్యకాపరమేశ్వరి అన్నసత్రంలో నిదివరకు నిత్యము చీట్లునిచ్చుపనిని కమిటీ శెక్రటరీగారు స్వయముగ జరుపుచుండుట ఆచారముగ నుండెను. ఇప్పుడాయుద్యోగము బ్రాహ్మణగుమాస్తాలపరమై యున్నట్లును, గుమస్తాలే చీట్ల నిచ్చు అధికారమును చెలాయించు చున్నట్లును తెలియుచు న్నది. ఇది దేవబ్రాహ్మణ పూజయొక్క తొమ్మిదవఫలితము.

[10] గవర్నరుపేటలోని రామమోహన్ వైద్యశాలా విద్యార్థులకు సత్రంఫండులోనుండి కొంత అన్నరూపేణ సహాయము చేయుటకు తీర్మానింపబడి ఆప్రకారము ప్రతిసంవత్సర మును సహాయము చేయుచుండిరి. కాని యిటీవల ఆతీర్మానము

నుల్లంఘించి, ధర్మకర్తలు సహాయముచేయుటను మానివేసి రట. ఇది దేవబ్రాహ్మణ పూజయొక్క పదియవఫలితము.

(11) సత్రంసభవారి తీర్మానమేమియు లేకుండగనే కమిటీవారు (శ్రీ) వెంకటేశ్వర ఆయుర్వేద వైద్యసంఘము మొదలగు తమకు యిష్టము వచ్చిన సంస్థలకు సహాయములు చేయుచున్నట్లువదంతిగలదు. ఇయ్యది దేవబ్రాహ్మణుల పూజయొక్క పదునొకండవ ఫలితము.

(12) వైశ్యవిద్యార్థులలో బి. ఏ. క్లాసులలో చదువుకొను నొకనికి, ఇంటరు మీడియేట్ క్లాసులో చదువుకొను ఇద్దరికిని. స్కూలుజీతములు సహాయము చేయుటకు సత్రం కమిటీ సభలో తీర్మానమైయున్నను, ఆతీర్మానము కమిటీవారు ఉల్లంఘించి వైశ్యవిద్యార్థులకు సహాయము నిరాకరించిరి. ఇయ్యది దేవబ్రాహ్మణ పూజయొక్క పండ్రెండవ ఫలితము.

వైశ్యసోదరులారా! దేవబ్రాహ్మణ పూజను బోధించు బెజవాడ వైశ్యప్రముఖుడును మనమును పొందుచున్నఫలితములీవిధముగ ద్వాదశ తరంగములతో కూడియున్నది.

ఇట్లు, విన్నవించు,

వైశ్య వేదోక్త సంస్కార ప్రోత్సాహక సంఘము.

---

# నెం 9 రు—కరపత్రము.

మల్లాది చయనులవారు 16-9-29 తేదీన ప్రకటించిన కరపత్రములో "శ్రీశృంగగిరి స్వామిగాని తానుగాని వైశ్యులను వర్ణసాంకరులని దూషించియుండలేదు" అని ఖండితముగా వాదించుచున్నారు. ఈవాక్యము కేవలము అసత్యమని రుజువు చేయుటకు శృంగేరిస్వాములవారు వ్రాసిన దూషణగ్రంథము నుండి కొన్ని వాక్యముల నుల్లేఖనమొనర్చి నెం 2 కరపత్ర ములో తెల్పియున్నాము. అందలి ప్రథమ ఉల్లేఖనమున యిట్లున్నది.

"ఏకేచనస్థితాః తేపి శూద్రాది నిషిద్ధకర్మాచరణ మాశ్రితాః సంకీర్ణాః"

అనగ, ఇప్పుడున్న వైశ్యులు శూద్రకర్మలుచేయు చుండుటచే సంకరులైనారు.

ఈప్రకారము స్పష్టముగ వ్రాసియున్నను, వ్రాయలేదని చయనులుగారు వాదించుట చిత్రముగానున్నది. ఇంతేగాక అట్లువ్రాయుట దూషణకాదని తెలుపుట అంతకన్న చిత్రము గానున్నది. పోనిండు, వైశ్యులు సంకరులనిగదా శ్రీవారి వాదము. కారణమేమైయుండును?

(1) వైశ్యులు అగమ్యాగమనముచేసిరా?
(2) "హత్యలేమైన గావించిరా?
(3) నెలజీతాలకు దేవతార్చనలుచేసిరా?
(4) దురన్న దుర్దానములకు లోబడిరా?

(5) సురాపానముల కలవాౖరైరా?
(6) అర్థాపేక్షచే అస్యతములాడిరా?
(7) తప్పుదస్తావేజులు వ్రాసిరా?

ఇవియేవియు చేయలేదని దూషణగ్రంథమే మనకు సాక్ష్యము - ఏలనన, ఆగ్రంథము, వైశ్యులు సంకరులగుటకు కారణమును విస్పష్టము తెలిపియున్నది. "వైశ్యులు శూద్ర విహితమైన పురాణోక్త విధానముల నవలంబించిరి అని హేతువును ప్రతిపాదించుచున్నది.

కాని వైశ్యులెన్నడును బుద్ధిపూర్వకముగ పురాణోక్త కర్మలను ఆచరించియుండలేదు. ఆచరించుటకు అంగీకరించియు నుండలేదు. బ్రాహ్మణులే వారిని కొన్ని చోట్ల దౌర్జన్యముచేసియు, కొట్లాటలు జరిపించియు మోసబుద్ధితో పురాణ గ్రంథములను ప్రయోగ గ్రంథములను సృష్టించియు, కర్మలను పౌరాణికముగ జరిగించి, తాము వేదోక్తముగనే కర్మలు చేయించుచున్నట్లు కొందరు యజమానులతో నమ్మకద్రోహపు వచనములుకూడ మాట్లాడియు, పలుతావుల వైశ్యుల వేదోక్తపద్ధతిని బ్రాహ్మణులేతప్పించియుండిరి. మామిడి వెంకటార్య పండితులు, ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులు మున్నగు వైశ్యసంఘుసంస్కర్తలు బయలుదేరినప్పటినుండియు అమాయక వైశ్యులు బ్రాహ్మణులుచేసిన మోసమునుండి తప్పించుకొని పదిపురుషాంతరములనుండియు వైశ్యులు వేద చోదితక్రియలనే చేయుచుండిరి. ఒకరిద్దరెవరైనను యింకా శేషించియున్నచో వారికి అడ్డు, బ్రాహ్మణులేకాని తదితరులు

కారు. ఇట్టిస్థితిలో వైశ్యులు సంకరులని వ్రాయుట సాహసము. మోసముతోను దౌర్జన్యముతోను వైశ్యుల వేదకర్మలకు అడ్డుకలిగించినవారే సంకరులు కాగలరుగాని పెద్దలనియు గురువులయు, నమ్మి వారిబోధలను నమ్ముకొని పురాణోక్త కర్మలుచేసినవారు సంకరులెన్నటికిని కాజాలరు. ఈవిషయమై నెం 5 రు. నెం 6 రు కరపత్రములలో చర్చించబడియున్నది.

వైశ్యులు సంకరులనిగదా -పీఠాధిపతులును, చయనులవారును వాదించుచున్నారు. అయితే దూషణగ్రంథములోని ఈవాదనను చయనులవారు యింతవరకును ఖండించక నేటికిని స్వాములవారు వ్రాసినది నిర్దుష్టమేయని సాధింపబూనుటచే వారు ఒక్క వైశ్యులనేగాకయింకా వైశ్యులతోసంబంధములు గలుగజేసికొని యున్న వారినందరిని సంకరులుగాచేయబూనుకొనుచున్నారు. ఎట్లన, సంకరులకు పౌరోహిత్యము చేసినవారు సంకరులేగదా? సంకరులవల్ల దానధర్మాదులు గ్రహించువారు సంకరులేగదా? సంకరులు స్థాపించిన దేవాలయములను సందర్శించువారు సంకరులేగదా? సంకరుల కుపదేశములుగావించువారు సంకరులేగదా? ఇంతమందిని సంకరులను చేయుచున్న పీఠాధిపతుల వాదమును చయనులవారు యింకను లిఖితపూర్వకముగ రద్దుపఱచకయుండుటజూడ, ఈసంకరవాదము, ఆచంద్రతారకముగ వైశ్యుల మెడలో గుదిబండవలె వ్రేలాడుచుండవలెననియే వారియుద్దేశ్యమైనట్లు కనుపించుచున్నది. అట్టి పుణ్యమును వారును వారి అనుయాయులను బొందనీయుడు.

కాని రాబోవు కొన్ని చిక్కులుమాత్రము వారాలోచించవలసియుండును. వైశ్యదూషణగ్రంథమును చయనులువారివంటి పండితులు బహిరంగముగ నిర్దుష్టమని వాదించుటచేతను వారు వైశ్యులచే నిరసింపబడిన పుష్పగిరి పీఠమునకు ఆస్థానపండితులగుటచేతను, గుంటూరులోని పురోహితులు చయనులవారి సిద్ధాంతమును నమ్మికొని, వైశ్యులకు మేము పౌరోహిత్యమును చేయము అని బహిరంగనోటీసునిచ్చి మానుకొనియుండిరి. అందుచే ఆపుర వైశ్యులు యితర ప్రాంతమునందలి బ్రాహ్మణ పౌరోహితుల సహాయముచేతను స్వకుల పురోహితుల సహాయముచేతను కర్మలను యథావిధిగ జరుపుకొనుచుండిరి. ప్రాతపౌరోహితు లిప్పుడు బర్తరపు కాబడి పని లేక జీవనాధారమునకై అల్లాడుచున్నారు. అందులో ఒకరిద్దరు పౌరోహితులు వైశ్యులకు కొన్ని ప్రత్యేక షరతులతో యగ్రిమెంటులనువ్రాసి తిరిగితమపౌరోహిత్యముతమకిప్పింపుడని వేడుకొనుచున్నారు.

చయనులవారి పట్టుదల ఇందరికి ఇన్నికష్టములను దెచ్చిపెట్టినది. ఇంతటితో ముగిసిన బాగుగనుండును. వారు సంచరించు తావులలోనెల్ల యిట్టిచిక్కులు తటస్థించకమానవు. బహు పండితులచేతను, అనేక విద్వత్ సభలలోను వైశ్యదూషణగ్రంథమని ముండనము చేయబడిన యీ వైశ్యవేదోక్త విచారక్రియావ్యవస్థాయను గ్రంథమునకు పుష్పగిరి పీఠాధిపతులును చయనులుగారును ఒక ఖండనమునువ్రాసి వైశ్యుల నిర్దోషిత్వమును స్థాపించవలసియున్నారు. లేనిచో గుంటూ

రులో తాముగలిగించిన చిక్కులను పునః ప్రతిచోటను కల్పించిన వారగుదురు.

బ్రాహ్మణులలో పూర్వము, నియోగిశాఖయని ప్రత్యేకముగ యేర్పడి యుండలేదు. వైదికులును నియోగులును కలిసి మెలసియే, స్మార్తపక్షమునకు జెంది, మిత్రీభావముతో కర్మానుష్ఠానాదులు జరుపుకొనుచుండిరి. కాని, వైశ్యులలో ఆత్మూరి లక్ష్మీనరసింహ దీక్షితులను వారుద్భవించి వైశ్యులకు శ్రుతి స్మృతి సదాచారములయందు శ్రద్ధాభక్తులు కల్పించి సంస్కారులుగచేయ నడుముకట్టిన విధమున నియోగులలో శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితుల వారవతరించిరి. ఈ మహనీయులు గుంటూరుజిల్లాలోని రేపల్లె గ్రామమున ప్రమాది సం॥ర జేష్ఠ శు ౯ (నవమి) తిథియందు తులాలగ్నమున జన్మించిరి. వీరు సాహిత్యమునందును శ్రౌతస్మార్త ప్రయోగమునందును, ధర్మశాస్త్రమునందును, ఋగ్యజుర్వేదములందును, పూర్వోత్తర మీమాంసములందును, తర్కవ్యాకరణ శాస్త్రములందును అద్భుతమైన పాండిత్యముగలవారు. వీరు మేధాదక్షిణామూర్త్యుపాసకులు. శాస్త్రీయాచారములను ఆచరించుటయందు బద్ధకంకణులైనవారు. స్వసంఘీయులందు శ్రుతి స్మృతి సదాచారములను ప్రచారమొనరింప నడుముకట్టిరి. అంతకు పూర్వము జరుగుచున్న ఆచారములందు శాస్త్రవిరోధాంశములను సవరించుచుండిరి. వీరిమార్గము అశాస్త్రీయమనియు వైదికులీ మహనీయునిపై దండయాత్ర సాగించిరి. అప్పటినుండియు వైదిక పండితులకును నియోగిపండి

తులకును తర్క వితర్కములు, వాదోప వాదములు చెల రేగెను. శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారు ఈ వైదికులు పెట్టిన కష్టములకోర్చి తుదకు తాను ప్రచారము చేయుచుండిన మార్గమే శాస్త్రవిహితమైనదని శ్రీ పుష్పగిరి పీఠాధిపతులగు శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వాముల వారిచే నొప్పించి తనసిద్ధాంతమును నెగ్గించిరి. ఆనాటనుండియు నియోగులు వైదికులనుండి చీలిపోయి వేరుశాఖగా వ్యవహరించుచుండిరి. ఆలగాయతు నియోగప్రముఖులు స్వశాఖా పౌరోహిత్యమును స్థాపించి, అనేక దురాచారములను సంస్కరించి, శుద్ధస్మార్తగ్రంథములను తయారుచేయించి తమ నియోగిశాఖవారలకు శ్రౌతస్మార్తకర్మములయందు శ్రద్ధాభక్తికలిగించిసంస్కారులుగచేసిరి. వైదికులకు లోబడినంతవరకు వారిని వృద్ధిపొందనీయక వైదికబృందము అడ్డుపెట్టజొచ్చెను. నియోగులు, విద్యావిషయమైగాని, కర్మవిషయమైగాని, వైదికులమీాద ఆధారపడక తమనియోగి బిడ్డలకు ప్రత్యేక గురుకులాశ్రమముల నేర్పాటు చేసి, తాముచేయు దానధర్మములన్నింటిని నియోగి శాఖీయుల విద్యాభివృద్ధికై వినియోగించి బహు స్వల్పకాలములోనే వైదికుల ప్రతిబంధములనుండి తప్పించుకొని ప్రస్తుతము అత్యున్నతస్థితియందున్నారు. నియోగులిప్పుడు వేదాధ్యయనమునందేమి, ధర్మశాస్త్రజ్ఞానమునందేమి, యజ్ఞ యాగాది క్రతువుల నాచరించుటయందేమి, వైదికులను మించిన ప్రజ్ఞాధురంధరులైయున్నారు. ఇతర కులములవారు అభివృద్ధి కావలెనని నియోగులు మిక్కిలి కోరుచుందురు. అట్టిఓర్పు మనవైదికకక్షు

వారికి పూజ్యం. వైశ్యవర్ణమువారికి తోడునీడై సహాయసాను భూతులొనర్చినది నియోగి పక్షమువారే యనవచ్చును. శ్రీ మామిడి వెంకటార్యులవారిని శ్రీ లక్ష్మీనరసింహ సోమ యాజులవారిని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించినది, యీ వైదిక మహానుభావులే. మన వైశ్యులు చేయు దానధర్మములు, అన్నియు యీ వైదికులే పొందుచు న్నారు. అందుకనియె వైశ్యులమీద వైదికుల కింత యపార ప్రేమ. యే వైశ్యుడైనా వేదమును చదువుకొన యత్నించినా వైదికుడు లేచి, నీకు హక్కు లేదని వాదించును; ఏ వైశ్యుడైన వేదోక్తముగ కర్మానుష్ఠానము చేయ సంకల్పించిన వెంటనే నీకు శాలంకాయన శాపముగలదని నిరోధించును. ఏ వైశ్యుడు యజ్ఞము చేసెదనని నిలబడునో అప్పుడే వైదికులందరు కుట్ర జేసి, శృంగేరీపీఠమునకు పరుగెత్తి ఆంక్షపత్రమును తెప్పించి సిద్ధముగ నుంచెదరు. తుదకు లక్ష్మీనరసింహ సోమయాజిగారికి కుడిభుజమువలె నిలచి వారియజ్ఞమును జయప్రదముగా సాగిం చుటకై తోడ్పడినందుకు నియోగిప్రముఖుడును బెజవాడ వాస్తవ్యుడును అయిన కీ. శే. దాసు శ్రీరామ పండితుల వారిని ఈ వైదికులుపెట్టిన బాధ వర్ణనాతీతము. తుదకు దాసు శ్రీరాములు గారిపై ఆంక్షపత్రిక నోటీసుకూడ జారీచేయించిరి. ఆనోటీసు నకలునిందు కనపరచుచున్నాము.

బందరు బ్రాహ్మణ సభవారు దాసు శ్రీరాములుగారికి ఇచ్చిన నోటీసు.

మహారాజశ్రీ దాసు శ్రీరాములుగారికి

బందరుపట్టణ స్థితాశేష బ్రాహ్మణసభవారి తరఫున యీక్రింద వ్రాలుచేసినవారు తెలియచేసేది యేమంటే.

శ్రీశ్రీ గురుస్వాములవారి ఉత్తరువులకు విరోధముగా ఆత్మూరి లక్ష్మీనరసింహంగారు వారి దురాచారమునకు విరుద్ధముగాను వేదమంత్రసహితముగాను బంధుయాజకముగాను జరిగించినటువంటి శ్రౌతకర్మకు (అగ్నిష్టోమము) మీరు వెళ్ళినట్టు సభవారికి తెలియవచ్చినది. గనుక ఆవిషయమై విచారించుటకు మహారాజశ్రీ రాజబహద్దరు వారిమేడమీద యీ సం॥రం వైశాఖ శు ౬ శనివారం పగలు 6 గంటలకు సభజరుగును. ఆకాలమునకు మీరు అక్కడికి దయచేయవలెనని కోరుతాను.

చిత్తగించవలెను

| | |
|---|---|
| హేవళంబినామసం॥<br>వైశాఖ శు ౧౨ గురువారం | పురాణం సుబ్రహ్మణ్య అవధానులు వ్రాలు అని వున్నది. |

ఇంకా కొన్ని సంతకములున్నవి.

వైశ్యసోదరులారా! చిత్తగించితిరా! మనవైశ్యశిఖామణి మహాయాగమునకు పూనుకొనగా, ఆయనను సంహరింప ప్రయత్నించుటేగాక, ఆయనకు తోడ్పడిన మన నియోగి మిత్రుని తాళంకూడ, వైదికులు పట్టించిరి. పైనోటీసుకు దాసు శ్రీరామపండితుడు యిచ్చిన జవాబు బహు చక్కగా నున్నది.

ఎవరును తిరిగి నోరుయెత్తేటట్టులేదు. నిజముగ ప్రతివారును చదివితీరవలెను.

దాసు శ్రీరాములుపంతులుగారు

వైదిక, సంఘమువారికిచ్చిన జవాబు. [సంగ్రహము.]

అయ్యా!

బందరుపట్టణ స్థాశేష బ్రాహ్మణులతరఫున మీరు నాకు వ్రాసినట్లు వ్రాసినారు............ఇచ్చట అనేక బ్రాహ్మణులను నేను కనుంగొని మీరు అందరు నాకు రిజిష్టరు ఉత్తరమువ్రాయుటకు వడ్లమన్నాటి వెంకట్రామయ్యగారు వగైరాలకు అధికారమిచ్చినారా?అని అడిగితే, మేము అటువంటి ఉత్తరువు నియ్యలేదని చెప్పినారు. బందరు పట్టణస్థులలోనే కొంతమంది నాపక్షమునే అవలంబించియున్నారు.

బ్రాహ్మణులనగా, మీమతమందు ఏమతమువారో నాకు తెలియకయున్నది. వైష్ణవులు మీసభకు వచ్చినారా? వైదికులందరును వచ్చినారా? అన్నిమతములవారి దస్కతులతో అధికారపత్రిక మీరు పుచ్చుకొన్నారా?

అశేషబ్రాహ్మణులలో ఎన్నిభేదము లున్నవో మీరెరుగరా? వైదికులు నియోగులకు నమస్కారము చేయరు. సభాతాంబూల మివ్వరు. ప్రాయశ్చిత్త పరిషిత్తునకు రానివ్వరు. యాజనము చేయించుకొనరు. నమస్కారము వైదికునకు చేసినను, ఆశీర్వాదము చేతురుగాని తిరిగి నమస్కారము చేయరు.........ఇప్పుడు మన బ్రాహ్మణ్యములో యీ

హిందూరాజ్యములో అంతటను 763 భేదములున్నవట. దుఃఖమెందుకురాదు? ఇప్పుడు తిరిగి 764 వ భేదముకొరకా యీసభ? బాగుగానున్నది.

మీమతముల కన్నింటికిని ఒక్కొక్క మతమునకు నలుగురైదుగురు ఆరుగురు వరకు ధనాకర్షక మహాదంభ దర్పోద్దీపక గురువులుండియుందురుగాని నామతమున కింకా గురు శ్రీశ్రీలు ఏర్పడలేదు. భగవంతుడొకడు, వేదమొకటి మాత్రమే ఆధారముగానున్నది.

నామతమునందు ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులుగారుచేసిన యజ్ఞము శాస్త్రీయము, క్రమమైనదని తోచినది. నాకేకాదు. బాగుగ విచారించినయెడల మీకును తోచును.........వారు చేసిన యజ్ఞముకూడా పిష్టపశువుతో చేయబడినది. జంతుహింసలేదు. దుష్కార్యములేదు. అగ్నులు, ఆహుతులు ఏమి పాపము తెచ్చిపెట్టును?

శ్రీమత్కందాళ రామానుజాచార్యులవారును, చింతా వెంకటనారాయణ సిద్ధాంతిగారును, వైశ్యులు యజ్ఞముచేయ వచ్చుననియు, ఆచారవిరుద్ధము కాదనియు, ఉపన్యాసములిచ్చి నాకు తెలియని అంశములుకూడ బోధించినారు.

నన్ను విచారించుటకు మీకు అధికారమేలేనట్లు కన బడుచున్నది. ఒకవేళ యొకఅధికారమును కలుగజేసికొన్నను, యేవైదిక విధుల నతిక్రమించితినని నన్ను విచారిస్తారు? మీరు వ్రాసిన ఉత్తరములోనే కానరాదే!

అగమ్యాగమనము చేస్తినా?
హత్య చేస్తినా?
నెలజీతాలకు దేవతార్చనలను చేస్తినా?
వైదిక కర్మలను త్యజించితినా?
దురన్న దుర్దానాలకు లోబడితినా?
సురాపాము చేస్తినా?
కన్యాశుల్కము పుచ్చుకొంటినా?
అర్థాపేక్షతో అసత్యములాడితినా?
తప్పు దస్తావేజులను వ్రాస్తినా?

ఇటువంటి వేమియు చేయలేదే!

సోదరులారా! కోతిపుండు బ్రహ్మరక్షస్సు చేయకండి. లేనిపోని గంద్రగోళాలు పొసగుతవి. నాకును సహాయులనేకు లుండకపోరు. ఎందుకు పీకులాట పెట్టుకొంటారు? వేరే పనులులేవాయేమి మీకు? నాకా! సర్వముత్యాగము చేసికొన్నాను. ఇతర వర్ణములవారికి మనయందు సత్యవాదిత్వ విశ్వాసమిప్పుడు నశించిపోయినది. అటువంటి విశ్వాసము మనయం దితరులకు గలుగులాగున ప్రవర్తనవలన గనబరచుట ధర్మమైనపనియు, ఐకమత్యమునకు ప్రధానమైనపనియునై యున్నవి.

20—5—97

చిత్తగించవలెను,
దాసు శ్రీరాములు.

సోదరులారా! గ్రంథము పూర్తిచేయబోవుచున్నాము. పదియవ పత్రికతో సమాప్తియగును. ఈతొమ్మిది సంచికలను బట్టి తేలిన సారాంశమేమి ?

(1) ఏవర్ణమువారైననుసరే. ప్రప్రథమమున విద్యనుసంపాదింపవలసియుండును.

(2) విద్యవలన కలిగెడు గౌరవము మఱిదేనివలనను కలుగనేరదు.

(3) ఇంతవరకు వైశ్యులు విద్యవిషయమైఅలక్ష్యముచేయుటచేతనే సంఘములో అన్నివర్ణములకంటె నీచముగ చూడబడుచున్నారు.

(4) ప్రతివైశ్యుడును తమబిడ్డలకు పండ్రెండుసంవత్సరముల లోపల తప్పక వేదోక్తవిధముగా ఉపనయనమును చేయించి సంధ్యావందనాది నిత్యకర్మల ననుష్టించునట్లు శ్రద్ధతీసికొనవలసియున్నారు.

(5) వైదిక, సంస్కృత, ఆంగ్లవిద్యలలో తమబిడ్డలకు ఉత్తమశిక్షనొసంగుటకై, ఈబెజవాడపురమునఒకవైశ్యగురుకులాశ్రమమును స్థాపించి అందుకు ఒక లక్షరూప్యములు శాశ్వతనిధి ప్రోగుచేయవలెను.

(6) ఇంగ్లీషువిద్యచదువుచున్న వైశ్యబాలురకు భోజనవసతులు, స్కూలుజీతములు, మున్నగు సహాయమును విరివిగా చేయవలెను.

ఇంతవరకు మా ప్రబోధమువలన మీకు కలిగిన శక్తిని వృథాగా వ్యర్థపరచవలదు. ఆశక్తిని నిజమైన కులాభివృద్ధికై మరల్పుడు. మిమ్ము మీరు నమ్ముకొనుడు. మీస్వశక్తి మీాదనే ఆధారపడుడు. ఇతరులకు పరాధీనులుకాకుడు. నిజమైన విద్యావ్యాప్తికై పాటుపడుడు. వైదిక కర్మను అనుష్ఠానము చేయుడు. మనమెవరితోను కలహమునకు బూనుకొననక్కర లేదు. మనయిల్లు మనము చక్కబెట్టుకొనవలెను. మనవర్ణమును మనము ఉద్ధరించవలెను.

ఈకార్యకలాపమును, ఈనిర్మాణ కార్యక్రమమును కొనసాగించుటకై మనమవలంబించవలసిన సాధన విధానమును 10 నెంబరు కరపత్రములో వివరింపబడును. నెం 10 రు కరపత్రము ధర్మశాస్త్రప్రమాణములతో నిండి నిబిడీకృతమైయున్నది. విద్యయొక్క ప్రభావము, దానముయొక్క లక్షణములు మున్నగు అపూర్వ విషయములు సప్రమాణముగ వివరింపబడియున్నవి. శ్రద్ధాభక్తితో చదువుకొని మేలుపొందనుద్దేశ్యముగలవారికే ఆనె 10 రు, ఆకరు కరపత్రములు పంచిపెట్టబడును. అట్టి శ్రిద్ధాభక్తిగలవారు మాత్రమే కోరుడు.

ఇట్లు విన్నవించు,

వైశ్య వేదోక్తసంస్కార ప్రోత్సాహకసంఘము.

---

తుదిపత్రము! ఆఖరుసంచిక!

## నెం 10 రు. కరపత్రము.

వైశ్యులు ధనవంతులయ్యును, శిష్టాచార సంపత్తి గలిగియు, దేవబ్రాహ్మణ పూజాదురంధరులయ్యును, ఇతరులచే నీచముగా పరిగణింపబడుటకు కారణము, విద్యాలోపమే, యని గతసంచికలయందు నిర్ధారణచేయబడి యుండెను. అట్టి విద్యనుగూర్చి తెలుపుచున్నారము.

పూర్వము భాగీరథీతీరమున పాటలీపుత్రమను పేరుగల యొక నగరముండెను. ఆ పురమును సుదర్శనుడను రాజు పరిపాలించుచుండెను. ఆయన ఒకనాడా నదీతీరమున నేకాంతముగ విహరించుచుండ ఆకాశవాణి యిట్లుపలికెను.

1. అనేక సంశయోచ్ఛేది పరోక్షార్థస్యదర్శకం ।
సర్వస్యలోచనం శాస్త్రం యస్యనాస్త్యంధ ఏవసః ॥

మరియు,

2. యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకతా ।
ఏకైకమప్యనర్థాయ, కిముయత్రి చతుష్టయమ్ ॥

అనఁగ, సర్వసందేహములను బోగొట్టునదియు, మనకు పరోక్షముగనుండు వస్తువులను చూపునదియు, విశ్వమున కంతకు నేత్రమువంటిదియునగు జ్ఞానమెవరికి లేదో వాడు అంధుడే సుమా.

మఱియు, యవ్వనము, ధనసమృద్ధి, రాజ్యాధికారము, అజ్ఞానము, ఈ నాల్గింటిలో ఒక్కొక్కటియే అనర్థకారణము అన్నియు కలిసియున్నచో కలిగేఅనర్థమును చెప్పనక్కరలేదు.

ఆకాశవాణి పలికిన నీ వాక్యములను రాజు వినిన వాడై, విద్యావాసనలేని తన కుమారుల స్థితినిగూర్చి యిట్లు ఖేదపడెను.

కోర్థః పుత్రేణ జాతేన, యోన విద్వాన్నధార్మికః।
కాణేన చక్షుచాకింవా ? చక్షుః పీడైవ కేవలమ్ ॥

అనఁగ విద్యావంతుడు కానట్టియు, ధర్మము నాచరింప నట్టియు, కుమారుడుపుట్టి యేమిలాభము ? గ్రుడ్డికన్నువలన ప్రయోజనము లేకపోగా బాధకరముకూడ అగును.

అజాతమృత మూర్ఖాణాం వరమాద్యౌ నచాన్తిమః।
సకృద్దుఃఖకరా వాద్యావన్తిమస్తు పదేపదే ॥

కొడుకులు పుట్టకయుండుట, పుట్టి మృతినొందుట, బ్రతికి విద్యలేకయుండుట, ఈ మూటిలో మొదటి రెండును శ్రేష్ఠములు. కాని మూడవదికూడదు. ఏలననగా. మొదటి రెండును ఏదోయొకప్పుడే దుఃఖమును కలిగించును, మూడవది ఎల్లప్పుడును దుఃఖము కలిగించును.

రాజు ఈప్రకారము చింతించి, పద్యావ్యాసంగ మేమియులేని తనపుత్రులను విష్ణుశర్మయను పండితుని వశము నందుంచి, ఆగురుకులాశ్రమమున వారికి సమస్తవిద్యలు వచ్చువరకు నుంచెను.

కానవిద్యయందు కొఱవడియుండిన వైశ్యులకు ప్రత్యేకముగ నొకగురుకులాశ్రమము నేర్పాటుచేసి, అందు సకల వేదవిద్యాపారంగతులైన పండితుల రావించి, వైశ్యబాలురకు ఎనిమిది పండ్రెండు సంవత్సరములలోపల యథావిధి ఉపనయనాది సంస్కారములు గావించి ఆచార్యుల వశమునందుంచి వారికీకాలమున కనుగుణ్యములగు, వేదవిద్య, లౌకికవిద్య, వృత్తివిద్య, నీతి మతవిద్య, వీనిని శ్రద్ధగా బోధించునట్లు యేర్పాటుచేయించవలెను.

శ్లో॥ విద్యయాతదారోహంతి యత్రకామాః పరాగతాః।
నతత్రదక్షిణాయాంతి నావిద్వాగ్ంస స్తపస్వినః॥

సమస్త సౌఖ్యములకు మూలస్థానమేదికలదో, అట్టి పదమును మనుజుడు విద్యవలన పొందగలుగును. ధనమువలన కాని, చాతుర్యముచేతగాని, జ్ఞానశూన్యమైన తపస్సుచేతగాని లభింపని యెట్టి పదార్థమునైనను విద్యవలన సేకూరగలదు.

విద్యాదదాతి వినయం వినయాద్యాతి పాత్రతాం।
పాత్రత్వాద్ధన మాప్నోతి, ధనాద్ధర్మం తతస్సుఖం॥

విద్యవలన వినయమును, వినయమువలన యోగ్యతయు యోగ్యతవలన ధనమును, ధనమువలన ధర్మమును, ధర్మము వలన సౌఖ్యమును కలుగును.

రూపయౌవన సంపన్నా విశాలకుల సంభవాః। విద్యాహీనాన శోభన్తే నిర్గంధా ఇవకింశుకాః॥

ఎంతరూపయౌవ్వన సంపన్నుడైననేమి? ఎంత గొప్ప కుటుంబమున బుట్టిననేమి? వాసనలేని పలాశపుష్పమువలె విద్యలేనివాడు ప్రకాశింపజాలడు.

కింకులేన విశాలేన విద్యాహీనేన దేహినాం।
విద్యావాన్ పూజ్యతేలోకేనాऽవిద్యః పరిపూజ్యతే॥

విద్యలేనివాడు ఎంతగొప్ప వంశమున బుట్టిన నేమి ప్రయోజనము? విద్యగలవాడే లోకమున పూజింపబడునుగాని అదిలేనివారికి గౌరవము లేనేలేదు.

విద్యాధనం శ్రేష్ఠతరం, తన్మూలమిత రద్ధనమ్। దానేన వర్ధతేనిత్యం, నభారాయన నీయతే॥

అన్నిధనములలో విద్యాధనమే శ్రేష్ఠతమమైనది. ఎందుచేతననగా, ఇతరుల కిచ్చినకొలది విద్యవృద్ధియగు చుండును. గాని తఱుగదు. మరియు దానిని మోయవలసిన యవసరమే లేదు.

కామధేను గుణావిద్యాహ్య కావేఫలదాయినీ। ప్రవాసే మాతృ సదృశి, విద్యాగుప్తం ధనంస్మృతం॥

కామధేనువు కోరినప్పుడెల్ల కోరికలను దీర్చునట్లు విద్య యెల్లవేళలను ఫలము నొసగును. తల్లివలె పరదేశమునందు తనకు సౌఖ్యము కలుగజేయును. విద్య ఒక రహస్యమైన ధనము.

శునఃపుచ్ఛ మివవ్యర్థం జీవితంవిద్యయావినా। నగుహ్య గోపనేశక్తం నచదంశ నివారణే॥

విద్యలేని బ్రతుకు కుక్కతోకవలె వ్యర్థమగును. కుక్క తనతోకతో, ఈగలను దోమలను తోలుకొనజాలదు. పైగా తన గుహ్యాంగమునుకూడ మూసికొనజాలదు. అట్లనే మనుజుడు విద్యలేనిచో నిష్ప్రయోజకుడగును.

అందువలననే భర్తృహరి విద్యలేనివానిని పశువుతో బోల్చి యున్నాడు.

"విద్యావిహీనః పశుః"

కాన వైశ్యసోదరులారా?

మీబిడ్డలయొక్క విద్యావిషయమై శ్రద్ధతీసికొనుట మీధర్మమైయున్నది. ఇందుకు ధనమవసరమని వేరుగ చెప్పనక్కరలేదు. మీరుచేయుచున్న సమస్తదానములలోను మిగుల శ్రేయస్కరమైనది విద్యాదానమేయని నమ్మడు. విద్యాదానమే పరమధర్మము. ఏలననగా, విద్యలేనివానికి ధర్మమేదియో అధర్మమేదియో తెలిసికొనుటకు వీలుకలుగదు.

ధర్మాధర్మౌన జానాతిలోకోయం విద్యయావినా।
తస్మాత్ సదైవధర్మాత్మా విద్యాదానరతాభవేత్ ॥

అనగ, విద్యలేనిచో మనుజులకు ధర్మాధర్మ జ్ఞానముండనేరదు. కావున ధార్మికులైనవారు విద్యాదానము చేయవలెను.

వైశ్యులు దానధర్మములు చేయుటయందు ప్రఖ్యాతిని చెందినవారైయున్నారు. కాని వీరికి యుక్తాయుక్త పరిజ్ఞానము లేనందున తాముచేయు దానములకు ఫలితమొకప్పుడు లేక

పోగా ఎమరు పాదిత్యముకూడా చుట్టుకొనగలదు. కాన దాన ధర్మములుచేయు ప్రతివారును దానలక్షణములను గూర్చి ముందుగా తెలిసికొనుట అవసరము.

దానమునుగురించి సంపూర్తిగ తెలిసికొననలెనన్న, నాలుగువిషయముల జ్ఞానము అవసరము.

[1] దానమిచ్చువాడు

[2] దానమును పుచ్చుకొనువాడు

[3] దానమిచ్చు కాలము దేశము.

[4] దానమీయబడు వస్తువు

ఈనాల్గింటినిగూర్చి తెలియవలెను.

[1] దానమిచ్చువాడు - దానమిచ్చువాని యుద్దేశ్యమేమి? కొందరు తమ కోరికలను తృప్తిజెందించుటకై దానముచేయుదురు. కొందరు దాక్షిణ్యముకొరకును, కొందరు మోహము కొరకును, మరికొందరు యితరులకు భయపడియు దానములు చేయుదురు.

[ఎ] కామదానం { తమ మనస్సులోని కోరికను సఫలపర్చుకొనుటకై చేయబడుదానము.

[బి] లజ్జాదానం { దాక్షిణ్యముకొరకు లోబడి, చేయనిచోఏవరేమనుకొనెదరో అనేసిగ్గుచే చేయబడునది

[సి] హర్షదానం-మనోహరమైన సంగీతగాంద్రు మున్నగువారలకుయిచ్చి, తమ యిందిృయ తృప్తిచేసికొనువారి దానము.

[డి] భయదానం { దానధర్మములు చేయనియెడల ఇతరులు తనకు కీడు చేయుదురని భయముతో చేయబడు దానము.

ఈ నాలుగును అయుక్తదానములు - మనస్సులో యేవిధమైన కోరికగాని, లజ్జగాని, హర్షముగాని, భయముగాని లేక ఈశ్వరప్రీతికొరకు ఫలాపేక్షలేక చేయబడుదానము యుక్తదాన మనబడును. దాత దానముచేయువస్తువును తానే స్వయముగ తీసికొనివెళ్లి ప్రతిగ్రహీతకిచ్చుట, ఉత్తమము. ప్రతిగ్రహీతను తన యింటికిపిల్చి యిచ్చుట మధ్యమము. ఒకరువచ్చి అడిగినమీాద యిచ్చుట అధమము. ఒకరివలన పనిచేయించుకొని అందుకు ప్రతిఫలముగనిచ్చు దానము నిష్ఫలము. ఈ అర్థమునే ఈక్రిందిప్రమాణము బోధించుచున్నది.

"అభిగమ్యోత్తమందాన మాహూయైవతు మధ్యమం।
అధమంయాచమానంతు, సేవాదానంతునిష్ఫలమ్॥

[2] ఇంకను దానమును పుచ్చుకొనువాడు అనగ దానప్రతిగ్రహీత పాత్రుడై యుండవలెను. ప్రతివాడును దానమును పట్టరాదు. దానమునుపట్టుటకు తగిన గుణములుగలవాడే దానార్హుడు. అట్టివానికి, విద్య, నడవడిక, శాంతము, సత్యము, చేసిన మేలుమరువకయుండుట, వేదశాస్త్ర జ్ఞానము, గోవులయెడల భక్తి, తాను దానమును గ్రహించినవస్తువును ఇతరులకు వినియోగించుటయున్నగు లక్షణములెవరికి యుండునో అట్టివాడే దానమునకర్హుడు. ప్రమాణము:-

విద్యాయుక్తో ధర్మశీలః ప్రశాంతః శాంతోదాంత స్సత్యవాదీకృతజ్ఞః స్వాధ్యాయవాన్ స్మృతివాన్। గోశరణ్యో దాతాయజ్వా, బ్రాహ్మణ పాత్రమాహుః?

మరియు, శ్రోత్రియుడును, సద్వంశసంభూతుడును వినయముకలవాడును, తపస్సుచేయువాడును, దరిద్రుడును, సర్వభూతములకు మేలొనర్చువాడును, ఇట్టి గుణములుగలవానికిచ్చిన దానమెంతకొంచెమైనను ఇచ్చినివానియొక్క ఇరువది యొక్క తరములను తరింపజేయును.

శ్రోత్రియాయకులీనాయ, వినీతాయతపస్వినే। వ్రతస్థాయ దరిద్రాయ సర్వభూత హితాయచ। ఈదృశాయ నరవ్యాఘ్రదత్త మల్పంశచీపతే। కులంతారయతే। దాతుస్సప్త సప్త చసప్త చ॥

ఈ ప్రమాణముపై తెల్పినవిషయమును ధృవపఱచుచున్నది. ఇట్టి లక్షణములుగలవాడు పాత్రుడనబడును. ఇట్టి పాత్రునకీయబడు దానము సత్పాత్రదాన మనబడును. దానమును బట్టువాడు పైనతెల్పిన సర్వలక్షణములను గలిగిన సత్పాత్రుడైనను, తానుగ్రహించిన ధనమును, దుర్వినియోగము చేయరాదు. ఆధనమును తాను సద్వినియోగము చేయవలెను. ఆద్రవ్యము నెన్నటికిని కూడబెట్టి కేవల తనస్వలాభమునకై వాడరాదు. ఇతరుల యుపయోగార్థము కాలాను సందర్భముగ వాడవలెను. అట్లు చేయనివాడు దొంగయనబడును. ఆ దొంగకు దానమీయరాదు. ఎట్లన:—

పాత్రభూతోపి యోవిప్రః ప్రతిగృహ్య ప్రతిగ్రహం।
అసత్సు వినియుంజీత । తస్మైదేయం నకించన॥ సంచ
యం కురుతేయశ్చ । ప్రతిగృహ్య సమంతతః॥ ధర్మార్థం నోప
యుంజీత। నతంతస్కర మర్చయేత్

అనగా పాత్రుడైనప్పటికిని తాను గ్రహించిన ద్రవ్య
మును యితరులకు సద్వినియోగము చేయనివానికి దానముచే
యరాదు. మరియు తాను దానముపట్టినదానిని ప్రోగుచేసి
ధర్మార్థముగ నెవడు ఖర్చుపెట్టడో అట్టిదొంగను ఎవరును
పూజించరాదు. అని యర్థము.

సోదరులారా! మీరిదివరకెన్నియో, దానధర్మములను
చేసియుండిరిగదా, మీవలన దానమును గ్రహించినవాడు
ఆద్రవ్యమును తాను నిల్వయుంచుకొనక లోకక్షేమముకొఱకు
వినియోగించిన బ్రాహ్మణుడింతవరకొక్కనిపేరు మీరుచెప్ప
గలరా? మహాత్మగాంధి భారత దేశమువంతటను సంచారము
చేయుచుండ జాతి, మత, కుల, వివక్షతలేక వారికి ఎందరెన్ని
దానములిచ్చిరో మీకు తెలియనదికాదు. వారికి కొందరు
ధనము, కొందరు వస్త్రములు, కొందరు ఆభరణములు,
కొందరు భూములు, అనేకవిధములుగా దానమొసర్చియుండిరి.
ఈద్రవ్య సముదాయమునంతకు సరియైన జమ ఖర్చు లెక్కను
ప్రకటించి, అద్దానిని దేశజనుల ఉపయోగార్థమై తిరిగి ఖర్చు
పెట్టుచున్నాడా ? లేక అందులోనుండి ఒక్క పైసాయైనను
తాను స్వంతమునకుపయోగించుచున్నాడా? కాన పైనతెల్పిన
ప్రమాణవాక్యములలో తెల్పినరీతి దానముపట్టినవాడు తిరిగి

సద్వినియోగ మొనర్చిన ప్రతిగ్రహీతలలో మహాత్ముఁడగ్ర
గణ్యుడు.

[3] దానముచేయుటకు దేశకాలపరిస్థితులు చూడవలెను.

మనవారు దానము చేయునప్పుడు కండ్లుమూసికొని దానముచేసెదరుకాని, ఏదేశమునకే దానముచేయవలెనో, యేకాలమునకేదానముచేయవలెనో తెలిసిచేయరు. ఆకాలము ననుసరించి ఆప్రాంతమున కవసరమేదో అట్టి దానము చేయవలెను గాని "దశదానాలకు తోటకూరకట్టయే" అనే సామెతగా వ్యవహరించరాదు. కరువువచ్చి అన్నముదొరకని దినములలోను అట్టి ప్రాంతములలోను, అన్నదానము చేయవలసియుండును. ఇప్పుడు సింధునది వరదలువచ్చి ఆప్రాంతమున పంటలునశించి అచ్చట అన్నములేక జనులు అల్లాడుచున్నారు. ఇట్టిస్థితిలో మనముచేయు అన్నదానము లీప్రాంతములో చేయుటకన్న సింధుప్రాంతమైన పంజాబుదేశస్థులకు చేయుట యుక్తముకాదా? అయిదుసంవత్సరముల క్రిందట మనకృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాలకు తుపానుదెబ్బతగిలి ఎందరో బీద జనులకు యిండ్లు, వాకిళ్ళు కొట్టుకొని పోయినప్పుడు ఇతరదేశములవారుమనకుసహాయమీయలేదాఇట్టిదానములుచేయుటకు నాదేశమనియు, నాజాతియనియు, నాదిపెద్దకులమనియు, ఇతరులది తక్కువకులమనియు భేదమేమియుండును? ఎవరికి అవసరము తటస్థించునో వానికిచేయు సహాయమే దానమనిపించుకొనును గాని, ఇతరముకాదు. కడుపునిండిన బ్రాహ్మణునకు పెట్టవలెనా? అన్నములేక మలమలమాడుచుండిన యితర వర్ణ

స్థులకు పెట్టవలెనా ? అను ప్రశ్నకు మీరే సమాధానము జెప్పుడు - శాస్త్రమేమి చెప్పుచున్నది ? ఆ యా కాలముల యందు, ఆయా దేశములయందు, పాత్రాపాత్రత నెఱిగి ఖర్చు పెట్టవలయుననే గదా బోధించుచున్నది.

దుర్భిక్షేచాన్న దాతారం। సుభిక్షే ధనదాయినం। హేమంతే వస్త్రదాతారం। గ్రీష్మేంబువ్య జనప్రదం। ఆతపే ఛత్రదాతారం। పాదుకా ప్రదమేవచ। ఆర్తత్రాణ విధాతారం। దానశౌండం ప్రచక్షతే। తద్యోగ్యకాలే యద్దత్తం। కించిదప్యధికం భవేత్॥

అనగ, కరువుగల స్థానమున అన్నమును, కరువులేని చోట్ల, యితర అవసరములకు ధనమును; చలిచే బాధపడు వారికి వస్త్రములును, ఎండచే బాధపడువారికి ఉదకమును గొడుగులును, చెప్పులును, ఆయా యోగ్యతల ననుసరించి చేయబడు దానముకించిత్తైనను అయ్యది అక్షయంబగును.

## (4) దానమీయబడు వస్తువు.

సాధారణముగ దానము చేయువారు, అన్నమునే ముఖ్యముగ వినియోగించు చుందురు. అన్ని దానములలోను అన్నదానమే శ్రేష్ఠమని చెప్పుటకు సందియములేదు. ఈ కారణముచేతనే మన భారతదేశమున ప్రతిపట్టణమందును ప్రతి గ్రామము నందును విరివిగా అన్నసత్రములు స్థాపింపబడి యున్నవి. ఇంకను వృద్ధిబొందుచున్నవి. ఈసందర్భమున మనము గమనించవలసిన కొన్ని విషయములు కలవు. మన హిందూ

దేశమున, వర్ణాశ్రమవిధులననుసరించి ముఖ్యముగ అన్నము కొరకు యితరులమీద ఆధారపడవలసి యుండువారెవరు?

(1) గురుకులాశ్రమమున విద్యాభ్యాసమొనరించు బ్రహ్మచారులు.

(2) యత్యాశ్రమమును స్వీకరించి సన్యాసోపనిషత్తులో చెప్పబడిన సన్యాసధర్మముల ననుష్టించు పరివ్రాజకులు.

(3) అంగసౌష్టవము లేక, సంపాదించుకొనుటకు శక్తిశూన్యమై ఆకలిచే పరితపించు వికలాంగులు.

ఈమూడు తరగతులవారికే మన సంఘమువారు అన్నమిచ్చి పోషింపవలసిన బాధ్యతకలదు. వీరిలో పూర్వపద్ధతి ప్రకారము బ్రహ్మచర్యము ననుష్టించు బ్రహ్మచారులు గాని, సన్యాసవిధులను తప్పిపోకుండ స్వధర్మము నాచరించు సన్యాసులుగాని యీకాలమున దొరుకుట దుర్లభము. ఎవరైన అట్టి నిష్టగలవారున్నచో తప్పక సంఘమువారు పోషించవలసినదే. ఇంకను మూడవ తరగతికి చెందినవారు, అన్నదానమునకు పాత్రులనుటకు సందియములేదు. కాని మనముపెట్టు అన్నము నిజముగా వికలాంగులకు జెందుటలేదు. శరీరదారుఢ్యముగల వాడు నిజముగ బీదవాడైనను సంఘమువారు వానికి అన్నము పెట్టనక్కరలేదు. వానికి పని కల్పించి, వానిచేత పనిచేయించి యావత్కాలము వాడు స్వంతముగ సంపాదించుకొనునట్లు చేయుట మనవిధియైయున్నది. అట్లుచేయుటకు బదులు, బీదవాడుగదాయని మనము అంగసౌష్టవముగలవానికి అన్నము బెట్టి పోషింప మొదలుపెట్టినచో, ఎన్నిసత్రములైన చాలవు.

అది యట్లుండగా ఆబీదవాడు పనిపాటలలోనికి వెళ్ళక సోమరి పోతుగ పెరుగుటవలన దేశములో సోంబేరీలను తయారుచేసిన వారగుదుము. ఈకారణముచేత నేగదా, తెల్లవారగనే ఉదయమైనది మొదలు ప్రొద్దుగూకువరకు మనకొంపలచుట్టు ఎందరు అక్షయపాత్రలు తెచ్చువారు, బుడబుక్కలవారు, గంగిరెద్దుల వాళ్ళు, బండమోడివాళ్లు, మున్నగువారెందరు పనిపాటలు వదలి మనలను బాధించుటేగాక వాళ్ళు సోమరులై దేశానర్థమునకు తోడ్పడుచున్నారు? మనసత్రంసొమ్ముగాని మనస్వంతడబ్బుగాని ఈసోంబేరీలకేల వినియోగించి, నిరుద్యోగసమస్యను క్లిష్టపరచవలెను? మనిషి 1కి దినమునకు రు 0-8 0 చొప్పున కూలిచ్చి రాటముపని, మగ్గముపని నేర్పెదనని మహాత్మా గాంధి, ఈ సోంబేరీల నాహ్వానించినప్పుడు వారుయిచ్చిన జవాబు వినతగి యున్నది. "అయ్యా? మాకు సత్రములలోను దేవళములలోను, కడుపునిండా కూడు దొరకుచున్నది. పది యిండ్లు అడుక్కుంటే మాకుటుంబమునకు జీవనము గడుచుచుండగా మేముకష్టపడి రాటంపని యేలచేయవలెను? మేము మీపనికి రాజాలము" ఈ ప్రకారం పలుకు సోంబేరీలను తయారుచేసి దేశదారిద్ర్యమును అభివృద్ధిచేసిన దెవరు? మన అన్నసత్రములును, ప్రసాదములు పంచిపెట్టు దేవాలయములును, యుక్తాయుక్తములు చూడక ఖర్చుచేయు గృహస్థులును, వీరే మనదేశ దరిద్రమును పెంపుచేసి, మహాత్ముని యుద్యమమును సాగనీయక అడ్డుతగులు చున్నవారు. కాన నిజముగ మనముచేయవలసిన విధి యేమనగా, గ్రుడ్డి, కుంటి

వాళ్ళు, వికలాంగులు, దేహము బాగాయున్న బీదలు వీరలకు వృత్తినేర్పించి, వారు శాశ్వతముగ స్వంతముగ సంపాదించు కొనేవారినిగ తయారుచేయుట మనవిధి. అంతేగాని కూర్చుండ బెట్టి వారిని పోషించరాదు.

ఇంకను అగ్రజాతులైన, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రులకు ఈ దేశకాలమున కవసరమైన విద్యాదానము చేయుటకై మనము ప్రయత్నించవలెను. అందులో అన్నివర్ణ ములకంటెవిద్యావిషయములోవెనుకబడియున్నవర్ణమేది? వైశ్య జాతియే అని అందరు ఒప్పుకొనక తప్పదు. కాన వైశ్యుల కిప్పుడు విద్యాదానము చేయుటకై అన్నివర్ణములవారును సహాయము చేయవలసి యున్నారు. విద్యావిషయమున తక్కిన వర్ణములవారితో సమానస్థితికి వైశ్యులను లేవదీయవల సిన బాధ్యత అన్నివర్ణములవారికిని అన్ని సంఘములవారికిని గలదు. తక్కిన వర్ణస్థులు పూనుకొనకపోయినను, స్వకుల విద్యాభివృద్ధికి వైశ్యులు దాన ధర్మములను చేయవలసి యున్నారు.

అన్నదానాత్ పరంనాస్తి విద్యాదానంతతోధికం
అన్నేనక్షణ తృప్తిస్స్యా ద్యావజ్జీవంతు విద్యయా ॥

అనగా అన్నదానముకంటె మించినదిలేదు. కాని అన్న దానముకన్న విద్యాదానము శ్రేష్ఠతరము. కారణమేమన అన్నముపెట్టినచో తాత్కాలిక తృప్తికలుగును. విద్యనేర్పిన యెడల బ్రతికియుండువరకు అన్నము పెట్టినట్లగును.

సర్వేషామపి దానానాం । విద్యాదానం పరంస్మృతం
వార్యన్నగోమహీ వాసస్తిల కాంచనసర్పిషాం ॥

అనగా, అన్నిదానములలో విద్యాదానమే గొప్పది. వారి=జలదానముకంటెను. అన్న=అన్నదానముకంటెను గో=గోదానముకంటెను, మహీ = భూదానముకంటెను వాసః = వస్త్రదానము కంటెను, తిల = నువ్వుల దానముకంటెను, కాంచన = హిరణ్యదానముకంటెను, సర్పిషామ్ = ఆజ్యదానముకంటెను, విద్యాదానం = విద్యనేర్పుటకై ఖర్చుచేయు ధనము, పరంస్మృతమ్ = మిక్కిలి శ్రేష్ఠమైనదని ఎంచబడుచున్నది.

వైశ్యశిఖామణులారా? తామికసంశయమును పోద్రోలి శీఘ్రముగామీరు మీ బాలురకు విద్యాదానము నొసఁగుటకై గట్టిప్రయత్నములకు బూనుకొనుడు. వైశ్యవిద్యానిధిసంఘము అనుపేరుతో ఒకసంఘమును స్థాపింపుడు. మీగృహములలో జరుగు శుభాశుభకర్మలకు, దశదానములు, షోడశమహాదానములు అన్నియు, విద్యానిధి సంఘమువారికే చేయుడు. స్త్రీల నోములు వ్రతములలో వాయనములు విద్యానిధికే యొసంగుడు. మరణకాలమునందు విల్లు [మరణశాసనమును] వ్రాయునప్పుడు, యావదాస్తిలో కొంతభాగము వైశ్యవిద్యానిధి సంఘమువారిపేర దఖలువ్రాయుడు. ఉత్సవములు, ఊరేగింపులలో అనవసరమైన ఖర్చులుఆపివేసి, ఆ ధనమును విద్యానిధికి సమర్పింపుడు. వైశ్యులు తక్కినవర్ణస్థులతో సమానముగ విద్యావంతులగు వరకును, మీరుతక్కిన దానధర్మములను

మాని విద్యాదానములనే చేయుడు. ఇదివరకు స్థాపింపబడిన సత్రములలో విశేషభాగము వైశ్యవిద్యార్థుల భోజనఖర్చుకై వినియోగింపుడు. ఇంకముందు సత్రములు, దేవాలయములను స్థాపింప సంకల్పించువారు, ప్రస్తుతమువాటిని విరమించి వైశ్య గురుకులాశ్రమములు, విద్యావసతి గృహములు, వైశ్య బాలురకు స్కాలర్‌జీతములు, పుస్తకములు విద్యార్థివేతనములు, బహుమతులు, పోటీపరీక్షలు, మున్నగువానికై ధనమును వెదజల్లుడు. వైశ్యులు వేదకర్మలను నేర్చుకొనుటకును, వేదోక్తసంస్కారములను గావించుటకును, వేదపాఠశాలలను స్థాపించుడు. రోగములచే బాధనొందువారి సౌకర్యముకొరకు ధర్మ ఆసుపత్రులను నెలకొల్పుడు.

మీరు దానముచేయవలసిన పద్ధతినిగూర్చి ఇన్ని శాస్త్ర ప్రమాణములనిచ్చియున్నాము. శాస్త్రము నుల్లంఘించి మీరు చేసేఅపాత్రి దానములు నిష్ప్రయోజనము లగుటయేగాక, ఎదురు పాపముకూడ సంభవించగలదు. ఇందుకు ప్రమాణము వినుడు:—

అపాత్రేవాపియద్దత్తం । దహత్యాసప్తమం కులమ్।
హవ్యందేవానగృహ్ణన్తి । కవ్యంచపితరస్తథా॥

కూడని దానములెవరుచేసెదరో అట్టివారియొక్క యిరువదియొక్క వంశములునాశనమగును. అపాత్రునకీయబడిన హవ్యమును దేవతలంగీకరింపరు. అట్టి కవ్యమును పితృదేవతలును గ్రహించరు. అట్టిఅపాత్రదానములు చేయుటవలన యేమి ప్రయోజనమో యోజింపుడు. నపుంసకునకు కన్యా

దానముచేసిన చందమున నుండును. బూడిదలో నేయిపోసి నట్లగును. ఓటికడవలో నీళ్ళుపోసిన పోలికగానుండును. ఈవిధముగ శాస్త్ర ప్రమాణములనువదలి: స్వార్థపరులు బోధించు మాటలనునమ్మి, మీరుచేయబోవు అయుక్తదానము నిష్ప్రయోజనములనుటకు సందియములేదు.

షండునకు బిడ్డనిచ్చిన చంద మొందు॥
బూడిలో నేయివ్రేల్చిన పోల్కినోటి॥
కడవలో నీరువెట్టిన కరణియగు న॥
పాత్రజనులకు బెట్టుట పారవేందా్రి॥

వైశ్యసోదరులారా! కొందరు స్వార్థపరులును బ్రాహ్మణభక్తిని నటించువారును, దేవపూజను అభినయించువారును మీకడకేగి మేమువ్రాసిన గ్రంథమంతయు శుద్ధతప్పనిమీకు దుర్బోధచేసి మీమతులు విరగదీయుదు రనుటకు సందియము లేదు. మీరు మేము చెప్పినమాటలనుగాని, ఆ స్వార్థపరులు బోధించువాక్యములనుగాని నమ్మిమోసపోతిమని చింతింప నక్కరలేదు. మీయందు అంతరాత్మకలదు. ఆయనయేభగవానుడు. ఆయన మీదను దృష్టినిలిపి మేమువ్రాసిన సంగతులలోని యదార్థమును స్వయముగా మీబుద్ధి యుక్తులచే ఆలోచింపుడు. యదార్థము మీకేగోచరించగలదు. ఇంతకాలము, దానపద్ధతిని, దానలక్షణములను, మీకెవరును బోధపర్చక పోవుటచే, మీదానములన్నియు అపాత్రదానములై ప్రయోజనములేకపోగా, ఎంతపాతకమును కలుగజేసియుండెనో పై శాస్త్రవచనములను పరిశీలింపుడు. కాని ఆదోషము విద్యా

గ్రంథము లేని వైశ్యులకంటె నేరదు. విద్యాజ్ఞానములుకలిగి, స్వార్థపరులై మీవలన గ్రహించిన అపాత్రులకే ఆపాదించును. కాని యికముందట్టి పనులుచేయరాదు. దానమునకర్హులైన వాడెట్లుండవలెనన్నను మీకుసందేహము కలిగినయెడల మఱి యొకపర్యాయము జాగ్రత్తగావినుడు.

సత్యందానం క్షమాశీలం, అనృశంస్యత పోఘృణా।
దృశ్యన్తే యత్ర నాగేంద్ర, సబ్రాహ్మణ ఇతిస్మృతః।

అనగా, సత్యము, దానము, ఓర్పు, మంచిప్రవర్తనము, కాఠిన్యము లేకుండుట, తపస్సు కరుణ-ఈలక్షణము లెవరియందు కనబడునో, అట్టివాడు బ్రాహ్మణుడనబడును, వానికే దానధర్మములనుచేయవలెను. ఈకాలమున అట్టి లక్షణములుగల వారిలో మహాత్మాగాంధిగారు ప్రథములు. అట్టి మహాత్ములకు దానముచేసినప్పుడు ఆ ధనముతిరిగి దేశమునకే వచ్చుచున్నది. ఒక్క పైసాకూడ ఆయనస్వంతమునకు తినుట లేదుగదా!

ధర్మార్థం నోపయుంజీత, నతంతస్కర మర్చయేత్ ॥

అనిఇదివరలో ప్రమాణవచనమును చూపియున్నాము. దానియర్థమేమనగా ఎవరైతేదానము గ్రహించి ఆద్రవ్యమును యితరులకు వినియోగించక స్వార్థమునకై ఖర్చుపెట్టుకొనునో అట్టి దొంగను పూజింపవలదు. అని శాస్త్రమువక్కాణించుచున్నది.

కాన మహాశయులారా! పైన తెల్పినలక్షణము లేమనుష్యునియందుగాని, యేసంస్థయందుగాని కనబడునో, అట్టి

వ్యక్తికిగాని, సంస్థకుగాని మీరుదానము చేయవచ్చును. ఏలన నగా అట్టి లక్షణములుగలవాడు అనేకమ్మకము గలిగించు వాడై యుండును. అట్టివానికి ఆలక్షణములు ప్రధానముగాని వానిచక్కదనమును మనము పాటించనక్కరలేదు. వానివయస్సును మనము చింతన చేయనక్కరలేదు. వానిబడ్డుపొడుగులు చూడనక్కరలేదు. వానివర్ణము, వంశము, లోకప్రఖ్యాతి గమనించనక్కరలేదు, వానిగుణములే మనకుసాక్ష్యము. అట్టి గుణములుగలవాడు బ్రాహ్మణుడు కావచ్చును, క్షత్రియుడు కావచ్చును, వైశ్యుడు కావచ్చును. లేక యేయితరవర్ణస్థుడైన కానిండు. పైన తెల్పిన లక్షణములను స్వయముగ పరీక్షించి దానముచేసినయెడల ఫలముకలుగును. లేనిచో యెదురు పాపము సంభవించును, అయితే బ్రాహ్మణవర్ణములో బుట్టిన వానికేదానము చేయవలెనని కొందరు మీతో హుంకరించి, మొరాయించెదరు. అప్పుడుమీరు వారికి సమాధానము చెప్ప వలసినదేమనగా బ్రాహ్మణవర్ణములో పుట్టినను పైన తెల్పిన లక్షణములు లేనివానికి మేము దానము చేయము. లేక బ్రాహ్మణవర్ణములో పుట్టకపోయినను పైనతెల్పిన లక్షణము లున్నచో వానికి దానము చేసెదము, అని సమాధానము చెప్పుడు. జన్మచేత బ్రాహ్మణత్వము రానేరదు. పుట్టినప్పుడు ప్రతివారును శూద్రులే. కాని ఉపనయన సంస్కారులైన వెంటనే వారు ద్విజులగుదురు. వేదమును పఠించినతోడనే విప్రులగుదురు. బ్రహ్మజ్ఞానము కలుగుటతోడనే బ్రాహ్మణు లగుదురు. కాన బ్రాహ్మణగర్భమున జన్మించినను, ఆయన

బ్రహ్మజ్ఞాని యైనప్పుడే బ్రాహ్మణుడగును. ఇందుకు ప్రమాణము:—

జన్మనాజాయతేశూద్రః । కర్మణాజాయతేద్విజః ।
వేదపాఠంతు విప్రాణాం । బ్రహ్మజ్ఞానంతుబ్రాహ్మణః॥

ఈశ్లోకములోని యర్థము స్పష్టముగ తెలియుచునే యున్నది. మరికొందరు వాదప్రియులువచ్చి వైశ్యులు దానము బట్టుటకు అర్హత లేదు అనిమిమ్మును దబాయించి నిరోధించెదరు. అట్టి మిత్రులకు మీరుబోధించవలసినది యేమనగా;—స్వకులస్థులగు బంధువులకును, ధనహీనులకును చేయుదానము కోటిరెట్లు ఫలమునిచ్చునని శ్రుతపరచుడు. ఇందుకు ప్రమాణము:- న కేవలం బ్రాహ్మణానాం। దానంసర్వత్రశస్యతే। భగినీ భాగినేయానాం। మాతులానాం పితృష్వసుః। దరిద్రాణాంచ బంధూనాం। దానంకోటి గుణంభవేత్ ॥

అనగా ఎప్పుడును బ్రాహ్మణునకే దానమీయవలెనని విధిలేదు. తోడబుట్టు, మేనల్లుడు మేనమామ, మేనత్త, బంధువులలో డబ్బులేనివారు, వీరలకు చేయబడు దానము కోటిరెట్లు అధికఫల మీయగలదు. కాన వైశ్యశిఖామణులారా! మిమ్ములనిక నాయాస పెట్టదలచలేదు. ఈ పది కరపత్రముల ద్వారా తమకు మేము విన్నవింపదలచిన సంగతులు తమకు జ్ఞాపకముండి యుండును. అయినను ఉపసంహారమున సూక్ష్మముగ జ్ఞప్తికి తెచ్చుచున్నాను.

వైశ్యులు యింతకాలము శాస్త్రజ్ఞానమునగాని, లౌకిక విద్యావిషయమునగాని, వైదికకర్మ విషయమైగాని, బహు

అశ్రద్ధ వహించియుండిన కారణమున వీరికి సంఘములో గౌర
వము గాని, దేశములో పలుకుబడిగాని లేక, అనామధేయులై
పరిణమించుటయేగాక, బ్రాహ్మణ స్వార్థపరులు కొందరు అస
త్యములైనట్టియు అప్రమాణములైనట్టియు గ్రంథములను
కల్పించియు, సిద్ధాంతములను సృష్టించియు వైశ్యులు సంకరు
లనియు, అతి నీచులనియు, వీరిని సంఘములో చేర్చుకొనుటకు
ప్రాయశ్చిత్తములుకూడ పనికిరావనియు, బహిరంగముగ పండిత
సభలలో రాద్ధాంతముచేసి, ఈ వైశ్యజాతినంతను నిందాపాత్రు
లుగ చేయుచున్నారు. ఇందుకు మేము ఆ బ్రాహ్మణులను
నిందించము. ఏ వైశ్యప్రముఖులు, ఈనిందావాక్యములకు రోష
పడకయు, ఆరోషమును, విద్యావ్యాప్తికై వినియోగించకను,
వైశ్యులందరిని అజ్ఞానాంధకారమున ముంచివేయ ప్రయత్నించు
చున్నారో వారినేమేము సమాధానమడుగుచున్నాము. ఇకను
వాదములను కట్టిపెట్టి మేముసూచించిన పద్ధతులనవలంభించి
వైశ్యవిద్యాభివృద్ధికి తోడ్పడుడు.

ఆర్యవైశ్యుల పవిత్రరక్తము మీనాడులయందింకనే
మైన శేషించినచో, వైశ్యసోదరులారా? కార్యరంగమున
దుముకుడు; అజ్ఞానకూపమునుండిలేచి, జ్ఞానతేజస్సును పొందు
టకు రోషమింకేమైన మిగిలినచో, నడుములు బిగింపుడు,
ఇతరులెవరో దూషించినారని ఆగ్రహముచెందిన మహనీయు
లారా, అట్టి ఆగ్రహమును మీబిడ్డలకు విద్యలేకుండచేసి,
స్వార్థపరులైన బ్రాహ్మణులకు దాసులుగజేయ నిశ్చయించిన

కొందరి వైశ్యప్రముఖులమీద కనుపర్చి, వారిపాదములకు నమస్కరించి, వారిమతులను త్రిప్పి నేటినుండి వైశ్య విద్యా వ్యాప్తికై బూనునట్లు చేయుడు.

ఓంశాంతిశ్శాంతి శ్శాంతిః.

ఇట్లు, విన్నవించు

వైశ్యవేదోక్తసంస్కార ప్రోత్సాహక సంఘము.

1 వ అను బం ధ ము

# బెజవాడ - వైశ్యసోదరులకు

## విజ్ఞప్తి

ఆర్యులారా!

ఈదేశములోని అన్ని వర్ణములవారును, తమతమ వర్ణాభివృద్ధికరములగు కట్టుబాట్లను యేర్పాటుజేసికొని, శ్రేయస్సును బొందినవారగుచు అధికపలుకుబడిని సంపాదించి ఔన్నత్యదశకు వచ్చుచుండిరి. కాని వైశ్యవర్ణముమాత్రము యథాస్థితియం దుండకపోవుటయేగాక దినదినమునకు దిగనారిపోవుచున్నది. వైశ్యులు ఇట్లు హీనస్థితియందుండుటవలన ఒక్కవైశ్యవర్ణమునకేకాక దేశమంతకును అరిష్టదాయకము. దేహాము యొక్క అగంములలో ఒక్కచేతికి జబ్బుచేసిన యెడల ఆబాధ ఒకచేతికేకాక తక్కిన శరీరమంతకు బాధ వ్యాపించును. మరియు యీవైశ్యవర్ణము దేశసంఘములలో మిక్కిలి ఆయువుపట్టు స్థానమందున్నది. ఈప్రధానస్థానమును జబ్బుస్థితిలోనుంచి తక్కినభాగములు బాగుపడినను దేహాము ఆరోగ్యముగ లేదని యెట్లుచెప్పుదురో అట్లే యీ దేశమందలి అన్నిసంఘములలోను ప్రధానమైయున్న వైశ్యవర్ణముయొక్క లోపములనునివారించి దానినియున్నతస్థితికి తేకున్న యెడల యింటియొక్క పునాదియందలి లోపములను కప్పిపెట్టి యింటిపైభాగమును అలంకరించిన చందమగును. కానహిందూ దేశముయొక్క అభివృద్ధి వైశ్యులయభివృద్ధిమీాదను కూడ

ఆధారపడియున్నది. కనుక వైశ్యులు తమ అభివృద్ధిమార్గము లనుగురించి తమలోతాము కట్టుబాట్లు సేసికొనుట, యేకుల మువారికిని యెట్టి అభ్యంతరమును ఉండరాదు. వైశ్యసంఘము లోనిలోపములనుయీదిగువగొన్నింటిని పేర్కొనుచున్నాము.

1. నాయకులయొక్క లోపములు.

(1) ప్రజల యోగక్షేమములను కాపాడుటకే తమకు నాయకత్వము యివ్వబడినదని నాయకులు మఱచిపోవుట.

(2) సంఘముతాలూకు ఆస్తి, ధనము, సంఘసభ్యులకు చెందినదని మఱచి తమస్వంతమని నాయకులు భ్రమించుట.

(3) తా మేపనిని చేసినను సంఘముయొక్క శ్రేయస్సున కుపయోగపడుచున్నదా యని విచారించకపోవుట.

(4) తాము సంఘముతాలూకు ధనమును ఖర్చుపెట్టి తద్వారా, తమకీర్తిప్రతిష్ఠలకై పాటుపడుట.

(5) ప్రతిసంఘసభకు సభికులు తప్పక హాజరయ్యే టాగున నిబంధన లేర్పరచక యుండుట.

(6) నాయకులు తమబాధ్యత లేవో (Duties) తెలిసికొనక తమనాయకత్వపు హక్కులను (Rights) నిలుపుకొనుటకే యత్నించుట.

(7) తమ మనస్సులోనున్న సంగతిని బయలుపఱచక, మనస్సులోనున్నదానికివ్యతిరిక్తముగనోటితోచెప్పుట. నోటితో చెప్పినదానికి విరుద్ధముగ పనిచేయుట, అనగ త్రికరణ శుద్ధి లేకపోవుట.

(8) సంఘము యొక్క పనిని నెరవేర్చుటకు కాలవ్యవధిలేక స్వంతపనులలో మునిగిపోయి ఊపిరి తిరుగుటకుకూడ సావకాశముచిక్కని వారిచేతులలో నాయకత్వముండుట. శరీరదార్ఢ్యము, మనోదార్ఢ్యము, ఓపిక, ధైర్యము, నిర్భయత్వము, సత్యము మొదలగునవి లేనివారి చేతిలో నాయకత్వముండుట.

(9) సంఘముయొక్క సేవచేయుటకు కాలు కదల్ప లేకయు, కాలుకదలించి స్వంతముగ తిరిగి పనిచేసిన-చో అయ్యది తమ ప్రతిష్టకు భంగము కలుగజేయునను తలంపుతో అనవసరమగు యెస్టాబ్లిష్మెంటు ( Establishment ) ఖర్చు లను పెట్టుట.

(10) సభికులు అడిగిన ప్రశ్నలకు నాయకులు తగిన సంజాయిషీ నీయకయు, జవాబు నిచ్చినయెడల తమగణ్యతకు లోపమువాటిల్లునని నాయకులు యెంచుట.

(11) భేదాభిప్రాయము నెడల నాయకులు సహన శక్తిలేక తమపట్టు గెలువవలెనని పోరాడుచు అన్యోన్య కల హములను పెంచుకొనుట.

(12) సంఘాభిప్రాయమును యేకోన్ముఖమునకు తెచ్చుట, సభికులయందు నూతనాదర్శములను కలుగజేయుట వారికి నూతనవికాసమును పెంపొందించుట, ఇట్టి విషయము లను గూర్చి నాయకులు శ్రద్ధతీసికొనకపోవుట.

(13) నాయకులు తాము స్వయముగ యుక్తాయుక్త విచారణసేయక కేవలము తమ్మును స్తోత్రము చేయువారల

సిఫార్సులను దీసికొని వ్యవహరించుట, మొగమోటము, పక్ష పాతమును జూపుట.

**11.** అనుచరుల లోపములు.

[1] తమ క్షేమమును సంపాదించుటకే, నాయకులు తమవలన యెన్నుకొనబడినారని అనుచరులు మఱచిపోవుట.

[2] తమకు లాభకరమైన పనులను నాయకులు చేయ నప్పుడు వెంటనేవారిని మందలించి వారిపై తమ యొత్తిడిని కలుగజేయకుండుట.

[3] నాయకులు ప్రజలకు సేవచేయువలసినవారు అనే సంగతిని మఱచి వారు తమపై యజమానులని భ్రమించి వారి చర్యలను విమర్శించక యుండుట.

[4] అనుచరులు ప్రతి సభకు వెళ్లకయు సంఘపరిపా లనయందు తాము జోక్యమును పుచ్చుకొనకయు నాయకుల యిష్టారాజ్యమునకే వదలివేయుట.

ఇంకా యిట్టివి కాగితములమీాద వ్రాసి ప్రచురపరచు టకు వీలులేని లోపములు నాయకులయందు ముఖ్యముగను అనుచరులయందు స్వల్పముగను యున్నవి. నాయకులును, అనుచరులూను, పైన దెల్పిన లోపములను గూర్చి విచారించు టకై ఒకచోట త్వరలో సమావేశమై లోపములను పోగొట్టు టకు కట్టుదిట్టములను చేసికొనుట అత్యావశ్యకము.

# మహాసభ

ఇందుకొలకు యీ సం॥ శ్రావణ బ ౩౦ వారం తేది సాయంత్రము విజయవాడ వైశ్యమహాసభ యొకటిజరుగును. వైశ్యులుమాత్రమే హాజరుకావలెను. ఇతరవర్ణములవారికి సావకాశములేదు. ఈసభ అమావాస్య సాయంత్రము 4 గంటలకు శ్రీకన్యకాపరమేశ్వరీ అన్నసత్రం మేడమీదను జరుగును. మామూలుగ ప్రతిఅమావాస్యకు జరిగే సత్రంకమిటీమీటింగు ఆరోజున ఆపుదల చేయబడును.

ఆమహాసభకు ప్రతివైశ్య పురుషుడును స్త్రీయును తప్పక హాజరు అగునటుల యీలోగా ఆందోళన చేయవలెను. వైశ్యులందరకు యీసభయెడల మిక్కిలి యుత్సాహము కలుగునటుల పాటుపడవలెను. వైశ్య లేవర్తకమును చేయువారైనను, ఆరోజున దుకాణములను కట్టివేయుటయే గాక, వ్యాపారసంబంధమైనపనినిన్నీ సర్వత్ర యింటివద్దనుకూడ ముట్టరాదు. ఒకవేళ ఆరోజున తనకు ముఖ్యమైనపనియుండు నెడల యాపనిని యీలోపుగనే సర్దుబాటుచేసుకొని ఆరోజు నకు తాను రికామిగనుండునట్లు యిప్పటినుండియు తగు జాగ్రత్త తీసికొనవలెను.

మహాసభకు స్త్రీలుకూడ తప్పక హాజరుకాగల సదు పాయముగ ఆరాత్రి వైశ్యులయిండ్లలో వంటపనియుండరాదు. పితృదినముకూడ యగుటచే పండ్లు మొదలైన పచ్చిపదార్థ మునే భక్షింపవలెను. ఇందువలన స్త్రీలు, వంటశాలా బంధన

మునుండి ఆరోజున విడుదలయై సభకువచ్చుటకు అవకాశ ముండును. ప్రతిపురుషుడును తమస్త్రీలు సభకువచ్చుటకు అనుజ్ఞ నియ్యవలెను.

## సభోద్దేశ్యములు.

### 1. ఉపసంఘములు యేర్పడవలెను.

ఈ పురములో వర్తకముచేయు వైశ్యులు అందరిని వారివారి వర్తకస్వభావమునుబట్టి తరగతులుగ విభజింపవలెను.

1. ధాన్యపువర్తకులు [ఫ్యాక్టరీవారుసహా]
2. బియ్యపువర్తకులు
3. వస్త్రముల వర్తకులు
4. చిల్లరసరకుల వర్తకులు
5. తవుడు వర్తకులు
6. నూనెలువగైరా వర్తకులు
7. పచారి వర్తకులు
8. ఇనుప వర్తకులు
9. ఖాయిదా వర్తకులు
10. షరాబులు
11. వడ్డీ వర్తకులు
12. ఉద్యోగస్థులు
13. పై వ్యాపారములలో జేరని యితరవర్తకులు
14. వ్యాపారము లేనివారు

ఈ ప్రకారము ఆయావర్తకులు చిన్నసంఘములుగ యేర్పడి, అందుండి సమర్థులును, సంఘవిశ్వాసమును బొందిన వారును, కార్యశూరులునగు ఇద్దరిని పెద్దలుగ యేర్పాటుచేసి కొనవలెను. వారుమహాసభకు ప్రతినిధులుగ పంపబడవలెను. ఉపసంఘములు తమతమ నిబంధనల నేర్పాటుచేసికొనవలెను. తమయుద్దేశ్యములను మహాసభకును, మహాసభవారి యుద్దేశ్యములను తామును, ఈ ప్రతినిధుల ద్వారా తెలుపుకొనుచుండవలెను. ఉపసంఘములయొక్క హక్కు బాధ్యతలను యీప్రతినిధులు వహించవలెను. ప్రతిసంవత్సరము యీయుప సంఘములయొక్క కార్యనిర్వాహకులు ఎన్నికల ద్వారా ఏర్పాటుకాబడ వలెను.

II. వైశ్యులయొక్క జనాభాలెఖ్ఖ తయారుకావలెను.

(a) ఇండ్లవరుస నెంబరు
(b) ఇండ్ల మ్యునిసిపల్ నెంబరు
(c) ఇంటిలో కాపురముచేయు యజమానులపేర్లు.
(d) వృత్తి, జీవనాధారము.
(e) పురుషులపేర్లు.
(f) వారల వయస్సు.
(g) ఉపనయిన మయినదా.
(h) వివాహమైనదా.
(i) కర్మలు వేదోక్తప్రకారమా, పురాణోక్త ప్రకారమా?
(j) విద్యరాని పురుషులెందరు.

(k) యేవిద్యకు సంఘసహాయము కావలెను.

(l) స్త్రీల పేర్లు.

(m) వారల వయస్సు.

(n) విద్యరానివారెందరు.

III ఈపురములో వైశ్యుల పరిపాలనక్రిందగాని ఆదరణ క్రిందగాని యున్న

(a) స్కూళ్లు.

(b) ఆసుపత్రులు.

(c) అన్నసత్రములు.

(d) దేవాలయములు.

(e) పుస్తక భాండాగారములు.

(f) ఇతరసంఘములు-సమాజములు-సంస్థలు.

1. వీనికి మేనేజర్లు, ధర్మకర్తలుయెవరు?
2. ఆదాయమేమి.
3. ఆదాయమునెట్లు ఖర్చుపెట్టుచున్నారు.
4. వీనికి రూల్సు, రెగ్యులేషన్సుఏమి?

IV. <u>విజయవాడ వైశ్యమహాసభ.</u>

వైశ్యుల పురోభివృద్ధికరములైన అన్నిపనులను సమర్థతతో నెరవేర్చుటకును, అందరియందును సంఘీభావమేర్పడి ఒక యపూర్వమైన బలమును శక్తిని సంపాదించుటకు యిట్టి సభయొకటి స్థాపితము కావలెను. ఈసభకు రెండుధననిధులుండవలెను.

1. విద్యానిధి (Educational fund)
2. సాధారణనిధి (General fund)

ఈ రెండునిధులను ఏర్పఱచుటకై సభవారు చేయవలసిన విధులు.

(a) వైశ్యులయొక్క ధనము యేవిధముగ బైటపోవు చున్నదో విచారించి ఆధనప్రవాహమును వైశ్యనిధుల వైపునకు మఱలింపవలెను.

(b) 1. ఉపనయనము, వివాహాది శుభకార్యములకును
2. శ్రాద్ధములు; అపరకర్మములు మొదలగు అశుభకార్యములకును
(3) శ్రీరామనవమి మొదలగు ఉత్సవాదులకును
(4) లక్షవత్తుల నోము మొదలగు నోములు వ్రతములకును.

సభాప్రతినిధులు ఆ యా గృహస్థులయిండ్లకు వెళ్లి ఆకార్యములకు విధిగ అవసరమగు వ్యయమునుమాత్రము చేయించి వైశ్యనిధులకై మహాదానములను గైకొనుట.

(c) ధనవంతులై బిడ్డలులేనివారి అవసానకాలమందు విల్లు (Will) అనగ మరణశాసనములు మొదలగు యేర్పాటులను మహాసభవారు జాగ్రతగ జరిపించి యజమానుని యొప్పించి వైశ్యనిధులకై విశేషఆస్తిని Endowment సంపాదించుట.

(d) ధనవంతులయొద్ద గొప్పవిరాళములను పొందుట.

(e) వర్తకపు సరకులమీదను వైశ్యనిధులకై పాత్ర రుసుములను మార్పు చేయించుట, క్రొత్త రుసుములను కల్పించుట.

(f) ఇంకా యితర మార్గములను కనిపెట్టి నిధిని పెంపుచేయుట.

(g) సాధ్యమైనంత వరకు మొదటి రెండు సం॥ విద్యానిధినే హెచ్చుగ బలపర్చవలెను.

V. నిధిని ఎట్లు ఖర్చుపెట్టవలెను?

(1) విద్యార్థులకు సహాయము.

(a) ఇప్పుడు ఇంగ్లీషుస్కూళ్ళలో చదువు వైశ్యవిద్యార్థులకును యిక ముందు చదువుకొన దలంచిన విద్యార్థులకును సంఘసహాయము నపేక్షించు నెడల స్కూలు జీతములు, పుస్తకములకొరకు వారికి సహాయము చేయవలెను. పెద్దకళాశాలలలో చదువుకొనువారు కోరునెడల వారికి వడ్డీ లేకుండ అప్పునియ్యవలెను.

(b) ఇతరగ్రామవాసులైన యెడలను స్వగ్రామవాసులైనను సహాయము కోరినయెడల వారలకు ఉచితముగ భోజనవసతులు యేర్పాటు చేయవలెను.

[2] ఒకవిద్యాలయము స్థాపితము కావలెను. ఇయ్యది సాధ్యమైనంత వరకు గురుకులాశ్రమ పద్ధతి నుండవలెను. ఇందులో రెండుశాఖ లుండవలెను.

## (a) వైదికశాఖ Vedic

[1] వేదాధ్యయనము.

[2] సంధ్యావందనము, నమకము, చమకము, అభిషేకము షోడశకర్మలు మొదలగునవి.

[3] సంస్కృతవిద్య, పంచకావ్యజ్ఞానమువరకు.

[4] ధర్మశాస్త్రములు మొదలగు సనాతన ధర్మములను బోధించుట.

## (b) లౌకికశాఖ (Secular)

[1] వర్తకపు సరిలెక్కలు, వర్తకాభివృద్ధి మార్గములను నేర్పుట, బుక్కుకీపింగు, కమర్షల్ కరస్పాండెన్సు, ఆడిట్ మొదలగునవి.

[2] తెలుగు భాష:—భారత భాగవతరామాయణములు ధారాళముగ చదివి అర్థము చెప్పగలిగినంతవరకు.

[3] ఇంగ్లీషు—స్కూల్ ఫైనల్ స్టాండర్డువరకు.

(4) హిందీ—బాగుగచదవి అర్థము చెప్పుట, అర్థమయ్యే లాగు మాట్లాడగలశక్తి వచ్చునంతవరకు.

(5) చరిత్ర—ఆంధ్రదేశ హిందూదేశచరిత్రలు ముఖ్యముగను, ఇంగ్లండు, అమెరికా, ఇటలీ, ఫ్రాన్సు, రషియా, చైనా, టర్కీదేశచరిత్రలు క్లుప్తముగను (సంగ్రహము.)

(6) భూగోళము—ప్రపంచమునందలి స్థలములు, శీతోష్ణస్థితి మొదలగునవి తెలియునంతవరకు.

(7) ఆర్థిక, నీతిశాస్త్రములు—దేశముయొక్క ఐశ్వర్యమును సంపదను అభివృద్ధి చేయుమార్గములు దెల్పుట. పితృభక్తి - మాతృభక్తి-దేశభక్తి-భగద్భక్తి మొదలగునవి పురికొల్పు బోధనలు.

(8) లా (Law):-వైశ్యులుపోలీసువారిని చూచిగాని సర్కారు నౌకర్లు ఉద్యోగస్థులను చూచిగాని అనవసరమైన భయము జెందక తమ హక్కులను తాము తెలిసియుండుట ఆవశ్యకము. ఇందుకు యీక్రింద లా పాయింట్లున్నూ, ఆక్టులును తెలిసికొని యుండవలెను. కనుక వానిని నేర్పబడుట.

(a) ఇండియన్ పీనల్ కోడ్డు
(b) టౌన్ పోలీసుఆక్టు
(c) మ్యునిసిపల్ ఆక్టు
(d) లోకల్ బోర్డ్సు ఆక్టు
(e) రైల్వే ఆక్టు
(f) ఇన్ కంటాక్సు ఆక్టు
(g) ఫ్యాక్టరీఆక్టు
(h) కంపెనీస్ రిజిస్ట్రేషన్ ఆక్టు

వీనికి సంబంధించిన రూల్సు, రెగ్యులేషన్సు.

[3] వైశ్యులకు విద్యగాక ఇతరసహాయములు.

(a) బీదవైశ్యబాలురకు ఉచితముగ ఉపనయనములు చేయించుట.

(b) కర్మలు వేదోక్తముగ జరిపించుట.

(c) వైశ్యులు యే యుద్యోగములయందున్నను వారికి తగిన (patronage) అండను ప్రోత్సాహమును చూపుట.

[4] వైశ్యవర్తకసంఘమును (Chamber of Commerce)

వైశ్యులవర్తకపు హక్కులనుగూర్చి అధికారము చెలాయించుటకును, తమహక్కులను భద్రపరచుకొని సంఘగౌరవమును కాపాడుకొనుటకు.

[5] వైశ్యన్యాయవిచారణసభ స్థాపింపబడవలెను. వైశ్యులు తమలో తాముగాని యితరులతోగాని సివిల్, క్రిమినల్ మొదలగు వ్యాజ్యములు తటస్థించు నెడల వానివిషయమై సర్కారుకోర్టులకెక్కి సొమ్ము పోగొట్టుకొనక యీవిచారణ సంఘమువారి పంచాయితికిలోబడి పరిష్కరించుకొనవలెను.

[6] వైశ్య ఆసుపత్రి. వ్యాధిగ్రస్తులైన వైశ్యులు దీనియందు ఉచితముగ ఔషధములను పుచ్చుకొని ఆరోగ్యవంతులు కావలెను. ముఖ్యముగ స్త్రీలకు ప్రసూతి వైద్యాలయము (Maternity Hospital) ఉండితీరవలెను. [ప్రసూతి కాలమున స్త్రీలుపడు బాధ వర్ణించుటకు వీలులేదు.)

[7] శరీర పరిశ్రమాలయము. (Physical exercise)

సాధారణముగ వైశ్యులు శరీరబలమునందు వెనుకబడియున్నారు. దేహమును సాధనజేసినగాని బలము సేకూ

రదు. ఆరోగ్యమును యేర్పడదు. కాన యిట్టి పరిశ్రమాలయ మవసరము.

[8] విహావాగృహము. వసతి సరిగ లేని వైశ్యులకు వివాహ ఉపనయనాది కర్మలు జరుపుకొనుటకు ఒక వసతి గృహమును, అందుకు కావలసిన సామగ్రి యేర్పాటును చేయ వలెను.

[9] వాలంటరీసంఘము. (Volunteer Corps) వైశ్యపురోభివృద్ధికరములగు పనులను, జరుపుటకుగాను వైశ్యయువకుల స్వచ్ఛంద సేవాసమితి నొకదాని నేర్పాటు చేయవలెను.

(10) వైశ్యక్రెడిట్ బ్యాంక్. [ Co-operative Credit Bank ] వైశ్యవ్యాపారస్థులకు సదుపాయముగ నుండ గలందులకు ఒకబ్యాంకిని స్థాపించుట యవసరము.

(11) వైశ్యహాస్టలు. వైశ్యవిద్యార్థులకు అనుకూలముగ నుండుటకును వారికి ఆరోగ్యమైన ఆహారము నిప్పించుటకును వారిలో సంఘీభావమును పురికొల్పుటకు నిట్టి వసతిగృహము తప్పకయుండవలెను.

(12) వైశ్యస్త్రీసంఘము. స్త్రీలకు ప్రత్యేకముగ ఒకసంఘ ముండవలెను. వైశ్యసంఘాభివృద్ధికై పురుషులు చేయు ప్రయత్నములకు యింటివద్ద స్త్రీలు ప్రతిబంధకము కాకుండ యుండవలెను. కులాభిమానము, విద్యాభిమానము ముఖ్యముగ వారియందు పురికొల్పబడవలెను. అట్టి అభిమాన

మును, పుట్టించుటకు స్త్రీసంఘమొకటి యేర్పడి ప్రతిశుక్ర వారము గాని, పక్షమునకొకపర్యాయముగాని సభజేసి సంగతులను తెలిసికొనుట, వారు తద్వారా అభివృద్ధి నొందుట అవసరము.

(13) వైశ్యపత్రిక. [News Paper] వైశ్యుల యొక్క అభిప్రాయముల నేకముఖమునకు తెచ్చుటకును సంఘీభావమును వృద్ధిపరచి సంఘశక్తిని మేల్కొలిపి నూతన వికాసమును పెంపొందించుటకు సంఘముతరఫున ఒకవార పత్రిక అవసరము.

VI చిల్లరవిషయములు (Miscellaneous)

[1] అన్నిగ్రామములలో నుండు వైశ్య విద్యార్థికుల యొక్కయు ధనవంతులయొక్కయు లిస్టు తయారు కావలెను.

(2) వైశ్యులలో యెవరికే ఆపత్తులు సంభవించినను వానిని సభవారు విచారించి న్యాయమున్నంతవరకు వానిని తొలగించి, వారిని గట్టెక్కించవలెను.

3. పరగ్రామములనుండి తమ పనిమీదను యిచ్చుటకువచ్చు వైశ్యులకు అవసరమయ్యే యెడల వారికి వసతి యేర్పాటును, ఉచితముగ భోజనయేర్పాటులను చేయుట ద్వారా కులస్థులకు అతిథిసత్కారములు చేయవలెను. ఇట్లు చేసినచో సాధ్యమైనంత త్వరలో అన్నవిక్రయముచేయు పూటకూళ్ళబసలు అంతరించి వైశ్యులలో శిష్టాచారము వృద్ధియగును.

4. నీచమైన వృత్తులలోనున్న వైశ్యులకు ఆవృత్తులను మాన్పించి, వారికి గౌరవమైన వృత్తులను చూపించవలెను.

ఉదాహరణము:—

1. సారాయి, గంజాయి అమ్మకట, ఇజారాచేయుట.
2. ఫ్రూటకూళ్ళబసలుపెట్టుట
3. ఉపమా, కాఫీ, మొదలగునవిచేసి యిండ్లవెంట తిరిగి అమ్మకట, ఇవిపోవలెను.

5. వైశ్యకులమును నిందించువారు, హేళనము చేయువారు, అగౌరవపరచువారు వీరివిషయమై సంఘమువారు చర్యతీసికొనవలెను,

6. ఏవైశ్యుని యింటను, విద్యరానివారు ఉండరాదు అనే శపథమును ప్రతివారును చేసికొనునట్లు సంఘముతరఫున యొత్తిడి కలుగచేయవలెను.

7. సభలు జరుగునపుడు తగినహేతువును తెలుపక ఆసంఘసభికులు గైరుహాజరు కాగూడదు.

8. వైశ్యులు చందాలుగాని, దానధర్మములుగాని చేయునపుడు పాత్రాపాత్రత తెలిసికొని చేయవలెను. అట్టి పాత్రాపాత్రతను తెలిసికొనుటకై ముందుగ సభవారికి ఆసంగతిని తెలుపవలెను.

9. ప్రతివైశ్యుడును, వైశ్యఅనేపదమును వాడవలెను. కోమటిఅనే శబ్దము నుపయోగించరాదు.

10. ప్రతివైశ్యుడును మహాసభయొక్క నిబంధనలకు తీర్మానములకు దప్పకలోబడి నడచుకొనవలెను. సంఘతీర్మానము తనకు అనుకూలముగ లేనియెడల సభికులకుబోధపరచి మరల ఆనిబంధనను తీర్మానమును మార్పుచేయించుకొనవచ్చును.

11. ఈ వైశ్యోద్యమమును అండజూచుకొనిగాని తదితరముగగాని యేవైశ్యుడును బ్రాహ్మణాది యితర కులస్థులను ద్వేషించుట, నిందించుట మొదలగు నీతిబాహ్యాకరమైన పనులను చేయరాదు. తక్కినవర్ణస్థులను సోదరులుగ భావించుకొనుచు యిట్టి సంఘములను సంస్కారములును వారిలో కూడ యేర్పాటుజేసికొని దేశాభ్యుదయమునకు తోడ్పడుడని వారిని హెచ్చరిక చేయుచుండవలెను.

12. పైన తెల్పిన యేర్పాట్లుగాక యింక వైశ్యుల మేలుకొరకు యేవైన అవసరములగుపనులనుగూర్చి ఎవరైన సూచనలు చేసినయెడల వాని విషయమైకూడ శ్రద్ధతీసికొనబడును.

## VII ప్రస్తుతపుస్థితిలో పెద్దకాన్ఫరెన్సులవలన ప్రయోజనము అంతగ లేదు.

దేశముయావత్తు సంస్కరింపబడవలెనని కోరువారు దేశమంతకును ఒకపద్ధతిని ఒక పంథాను యేర్పరచుట తగదు. ఏరాష్ట్రమున కారాష్ట్రమును, యేవర్ణమున కావర్ణమును వాని వాని ప్రత్యేక సాంప్రదాయములను బట్టియు వారివారి అభి

రుచుల ననుసరించియు, సంస్కార విధానమును అభివృద్ధి మార్గములను యేర్పాటుచేసికొనుట ఉత్తమము. ఒకవర్ణములో నైనను ఉద్యమముస్థానికముగ (Local) నుండవలెను. అనగ యేపురమునకు ఆపురము ముందుగ కట్టుదిట్టముల నేర్పరచు కొనవలెను. కాని యిట్టి స్థానికోద్యమములు (Local movements) రాష్ట్రాభివృద్ధికిగాని, దేశాభివృద్ధికిగాని యితరకులముల యభివృద్ధికిగాని, చేయబడు ఉద్యమములకు యెంతమాత్రము విరోధముగ నుండకూడదు. కార్యసాధనము సులువుగాను సులభముగా నుండుటకుకూడ స్థానికోద్యమము లవసరము. కనుక దేశములోనున్న వైశ్యకులమునంతను ఒక్కపర్యాయము నుద్ధరించెదమని చెప్పి కొందరు కావించుచున్న యత్నములు విఫలమగుటకు కారణమియ్యదియె. ఈసూత్రమందలి యథార్థమును పాటించక యిటీవల గుంటూరుపురమందు జరిగిన ఆర్యవైశ్యమహాసభవలన కులమున కెట్టి ప్రయోజనమును లేక పోగా కులములోని ద్రవ్యము సుమారు రు 10,000 వరకు వ్యర్థమయ్యెను. ఏటేట యిట్టిసభలకై యింతధనమును గోతి పాలు చేయుటకంటె ఆధనమును వైశ్యులవిద్యకై వినియోగించి నచో యెంతఫలముండునో ఆలోచించుడు.

ఏకార్యమునకైనను, అనుభవజ్ఞానము అత్యంతావశ్యకము. కాగితముమీద యెన్ని ధర్మసూత్రములను లిఖించినను, అయ్యవి ఆచరణమార్గమునందు పెట్టబడినప్పుడే మనకు అనుభవము గోచరమగును. ఒకటి రెండు సంవత్సరములలో యీపురమందు మన యుద్యమమును నడిపించుటవలన మనకు

విశేష అనుభవము కలుగును. ఇచ్చట మన ఉద్యమము ఫలోన్ముఖము కాగానే యీ పద్ధతులు ప్రతి నగరమునకును, వ్యాపింపజేసి అచ్చటనుకూడ వైశ్యవిద్యానిధులను స్థాపించి తద్వారా వైశ్యులలో విద్యను వ్యాప్తముజేసి తక్కిన వర్ణములకంటె అగ్రగణ్యులగుటకు యత్నించవలెను.

ఈసంగతులన్నిటిని పూర్ణముగ చర్చించుటకై వైశ్యులందరును అమావాస్యనాడు తప్పక సభకు దయచేయవలెనని మిక్కిలి ప్రార్థించుచున్నాము.

ఇట్లు తమవిధేయులు,

విజయవాడ,
1-7-1925.

శ్రీభ్రమరాంబామల్లేశ్వర
ఆంధ్రగ్రంథాలయ కమిటీ.

ఓం తత్సత్

సర్వేజనాస్సుఖినోభవన్తు.

---

# 2 వ- అనుబంధము.

ధర్మో విజయతే.

వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా

# మండనముండనము.



శ్లో॥అకరుణత్వ మకారణ నిగ్రహః పరధనే పరయోషితిచస్పృహా
సుజనబంధుజనేష్వసహిష్ణు తా ప్రకృతి సిద్ధమిదం-
-హిదురాత్మనాం॥

ఇయ్యది దూషణ గ్రంథమునకుఁ బ్రత్యుత్తరముగా వ్రాయఁబడిన విమర్శనము. కాన దీనితో మా ప్రతివాది బ్రాహ్మణులకు మాత్రమే సంబంధము కలదు. కాని యితర బ్రాహ్మణ సంఘమున కేవిధమయిన సంబంధము లేదని తెలిపి యుపోద్ఘాతమునకుఁ దిగుచున్నవారము.

## ఉపోద్ఘాతము.

తమపేరు బెట్టుకొని గ్రంథము బ్రకటింపఁజాలని పండితంమన్యు లెవ్వరో చెప్పఁజాలము కాని శ్రీ శృంగేరీ జగద్గురు సంస్థానమునందు శ్రుతి స్మృతి పురాణకల్పసూత్ర సదాచారాది పురస్సరముగా బ్రకటింపఁ బడిన దగుచు వైశ్య వేదోక్తక్రియా విచారవ్యవస్థయను, నొక క్షత్రియ వైశ్యజాతి

దూషణ గ్రంథమును రచించి ప్రకటించియుండిరి. అది శృంగేరీ పీఠసంస్థానమందు రచింపఁబడియుండుటచే వెంటనే వైశ్యమహాజనులద్దాని నుపసంహరించుకొనుట మంచిదనిచెప్పి వారు వినకుండుటచే సత్య ధర్మములను నిలువబెట్టుటకై పాటు పడవలసిన తక్కిన పీఠస్థులుకూడ తటస్థముగా నున్నందున మా వైశ్యులు ధనార్జనమే ప్రధానముగా గల త్రిమత పీఠములను బూజింపరాదని తీర్మానించి యుండిరి. ఇట్లుండ పుష్పగిరి పీఠమువారు గుంటూరుమండలమున సంచారము చేయుచు కొన్ని గ్రామాదులలో వైశ్యులచేగూడ బూజలు చేయించుకొన సాగిరి.

అద్దాని నాపవలెనను తలంపుతోఁ గతసంవత్సరమున గుంటూరుపురమునకు వైశ్యమహాజనసభ నాహ్వానము జేసి యందు తొల్లింటి తీర్మానమున కించుక మెరుగిడి జ్ఞాపకమునకు దెచ్చుకొనియుంటిమి. ఎన్నితిట్లైనను బొక్కెడు సజ్జలకు సాటిగావను లోకోక్తికి గుఱిగా పుష్పగిరివారు మాత్రము గుంటూరు మండల వైశ్యగృహములను దోచుకొని తినుచు సంతటితో దనివినందక గుంటూరుపురమునకు గూడ వచ్చి. పైపెచ్చు పదిహేనువేల జనసంఖ్యగల మా వైశ్యసంఘములో నుండి యెనిమిదిమందిని మాత్రమే యెట్లో చీలదీసి వారిచే రెండుభిక్షలను జేయించుకొనిరి ? ఆ భిక్షలు చేయుటకు గారణమా యెనిమిదిమంది వైశ్యుల భక్తిగాక పీఠచక్రము వారి మోసమై యున్నది. అదేమన తదాస్థానపండితంమన్యులగు మల్లాది రామకృష్ణ లౌకికచయనులవారు శృంగేరీవారు

ప్రకటించిన వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థయందు మీ వైశ్యజాతికి గళంకమగు వ్రాతయేమియు వ్రాయబడియుండ లేదు. లేకపోయినను మీవారు బ్రాహ్మణుల యెడలను పీఠములయెడలను నకారణద్వేషమునూని యిట్లల్లరి చేయుచున్నారని చెప్పి అది నిర్దోషగ్రంథమైనట్లు సాధింతుమని లౌకికచయనులవారు చెప్పిరి. అది సత్యమని నమ్మికొని పైన తెలిపిన యెనమండుగురు వైశ్యులు మాత్రమే రెండుభిక్షలు గావించియున్నారు. అంతటితో బీరమువారికి భిక్షలుగావించువారు కనుపడమిని, వారిని నల్లసాటికి మెల్లగనంపి లౌకికచయనులవారు మాత్రము మరలివచ్చి శివాలయమున నా గ్రంథమండనమునకు గడంగి యాడిన యాటలు పట్టిన యభినయహస్తములు కులకిన కులుకులు సుజనులు కని విని వింతపడియున్నవారు. వారి గ్రంథమండనము ముండనము గావించుటకు ముందు లౌకికచయనులవారి యోగ్యతను గుఱించి యించుక ముచ్చటించుకొందము.

వీరు మ॥ నడింపల్లి నరసింహారావుగారి కేసులోనిచ్చిన సాక్ష్యమును, కమ్మవారికి సన్న్యాసమిచ్చుటకు జేసిన యత్నమును మున్నగువానిని వినిపించి శ్రీ శ్రుతిధర్మ సంజీవనీ పత్రికాధిపతులగు బ్రహ్మశ్రీ శివపురపు వీరభద్రపాకయాజిగారు లౌకికచయనులవారి యయోగ్యతను బ్రకటించియుండిరి. ఇంతియకాదు మానధనులును శూరులును శూద్రకులావతంసులునగు రెడ్డి వెలమ కమ్మ బలిజె శాఖీయులను గూర్చి క్షత్రియులు శూద్రస్త్రీల నుంచుకొనగా బుట్టిన యను

లోమ సంకరజాతీయులని నీచచరిత్ర వ్రాయ నందుపై బ॥ యడవల్లి శంకర సోమయాజిగారును శ్రీపాకయాజిగారును విమర్శించి యుండిరి. మ॥ సూర్యదేవర రాఘవయ్యచౌదరి గారు బ్రాహ్మణేతరవిజయ మను గ్రంథమును వ్రాసి యీ-లౌకికచయనులవారి చేష్టలనుతగురీతిని మందలించియున్నారు. అదిచాలక యిపుడు వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థయను దూషణగ్రంథమును సమర్థింపవచ్చిరి. ఇదివిని శ్రీముత్యాలం పాటి క్షత్రియ సంఘకార్యదర్శులు ప్రళయకాలమార్తాండుని పగిది మండిపడుచు మనలౌకికచయనులవారి మోసమును బయలుపరచిరి. ఇయ్యది వారు ప్రకటించిన కరపత్రికయే చెప్పకచెప్పియున్నది. ఇఁక వీరిచర్యలను ప్రసంగములను ఖండించుచు మనమును గొంచెము విమర్శన కుపక్రమించుదము.

## ఉపక్రమము.



మన పగవారు తమ గ్రంథోపక్రమమునందిట్లు బ్రాహ్మణ జాతిని భూషించుకొనియున్నారు. అదేమన?

"ఇహాఖలు కలియుగె త్రివత్సరోన పంచసహస్రవర్షేషు గతేషు......తత్ర బ్రాహ్మణేష్వేవ స్వవర్ణోచిత ధర్మాననుతిష్ఠంతః ప్రత్యవాయశూన్యాః పరిశుద్ధాః బ్రాహ్మణాః విరళాః స్వవర్ణోచిత సకల ధర్మరాహిత్యేపి యథాశక్తి యథాసంభవ ధర్మానుష్ఠాతారః జాతిమాత్రోప జీవినఏవబహుళాః......... ఆధార్మికాస్తు ప్రబలాః"

అనగా కలియుగమున ౪౯౯౭వ సంవత్సరములు గడిచిన మీాద బ్రాహ్మణులయందు మాత్రమే తమ వర్ణమున కుచితములైన ధర్మములను జేయుచున్నవారై ప్రత్యవాయ శూన్యులైన పరిశుద్ధులైయుండు బ్రాహ్మణులచ్చటచ్చట నుందురు. బ్రాహ్మణోచిత సకల ధర్మముల ననుష్ఠింపకపోయి నప్పటికి శక్తికొలది వీలైన ధర్మముల ననుష్ఠించుచు జాతి మాత్రముచేత జీవించువారు చాలమంది యుందురు. ఆధార్మిక బ్రాహ్మణులును విస్తరించియున్నారు. అని బ్రాహ్మణ స్థితిని వర్ణించుకొన్నారు. ఇందు మనకు విప్రతిపత్తి యేమియు లేదు. ఇక క్షత్రియ వైశ్యులనుగూర్చి యెంత నీచముగ వ్రాసి యున్నారో వినుడు.

"క్షత్రియ వైశ్య శూద్ర వర్ణేషు సూర్యచంద్రాది వంశీయాః యోని భీజాభ్యాం పరిశుద్ధాః శాస్త్రోక్త కర్మానుష్ఠాతారః క్షత్రియాః దుర్లభా ఏవ. యోని భీజాభ్యాం పరిశుద్ధాః శాస్త్రోక్త కర్మానుష్ఠాతారః వైశ్యాశ్చ ఇదానీం నోపలభ్యంత ఏవ"

క్షత్రియాదులలో సూర్యచంద్రాది వంశసంభూతులును బరిశుద్ధ యోనిబీజములకు జనించి శాస్త్రోక్త కర్మల నాచరించు వారును నగు క్షత్రియులు దుర్లభులే. ఇట్లే పరిశుద్ధ యోనిబీజములకు జనించి శాస్త్రోక్త కర్మలుచేయు వైశ్యులును నిపుడు దొరకనే దొరకరు.

ఇట్లుకలియుగమున క్షత్రియ వైశ్యంమన్యులు (అనగా క్షత్రియ వైశ్యులు కాకయుండి క్షత్రియవైశ్యులమని తలంచు వారు) కలరుకాని వారు పరిశుద్ధయోని బీజములకు జనించిన

క్షత్రియ వైశ్యులు మాత్రముకారు కాన నిప్పటిక్షత్రయ వైశ్యం మన్యులకు వైదికోపనయన వేదాధ్యయనవేదోక్త కర్మాచరణ ములం దధికారములేదని తెగబెట్టిచెప్పిన గ్రంథమునందే దోష మేమియులేదని చేసిన లౌకికచయనులవారి దుర్బోధను వివే కముకలవారు మెచ్చుకొన దగునా? వీరుకోమటి పదవాచ్యు లయిన వైశ్యంమన్యులకు వేయి వత్సరములకు పూర్వమందే వైదికోపనయనము పోయినదని తెలిపిన యాగ్రంథము యదా ర్థము చెప్పియున్నదని సమర్థించియున్నారుకదా? వైదికోపనయ నము పోయిన వెనుక ద్విజులు వర్ణసంకరులయ్యేదరని మనువీ క్రింది శ్లోకముఖమున జెప్పియున్నాడు.

శ్లో॥ వ్యభిచారేణ వర్ణానా। మవేద్యా వేదనేనచ
స్వకర్మణాంచ త్యాగేన జాయంతె వర్ణసంకరాః

ఈశ్లోకమునకు గుల్లూకభట్టాచార్యులవారిట్లు వ్యాఖ్యా నము గావించియున్నాడు

"బ్రాహ్మణాది వర్ణానామన్యోన్య స్త్రీగమనేన సగో త్రాది వివాహేన ఉపనయన రూపస్వకర్మత్యాగేనవర్ణ సంకరో నామజాయతె

అనగా వ్యభిచారముచేతను సగోత్రకన్యా వివాహము చేతను ఉపనయనత్యాగముచేతను ద్విజులు వర్ణసంకరులయ్యేద రని పైమనువచనభాష్యముల కర్థము శాస్త్రమిట్లుండ మన పురోహితబ్రాహ్మణులు మనకు వైదికోపనయనము చేయు చున్నారను భ్రాంతితోనుంటిమి. అదిలేదని లౌకికచయనుల వారిపుడు స్పష్టముగ జెప్పియున్నారు కదా? దానింబట్టి

వైశ్యులు వర్ణసంకరులైరని వారిమండనము యొక్క పర్యవసాన మైయున్నదని పైమనువచనమువలన గొంత దెలిసికొంటిమి. ఇంతయెకాదు ఉపనయనము మానుకొన్నవారు వ్రాత్యులయ్యె దరనియు వారి సంతతివారు ప్రతిలోమజుల (సూతమాగధా యోగవక్షత్త్రనైదేహక చండాలుర) వలెనే యుపకారాక్షమ పుత్రులయ్యెదరనియు మనువీక్రింది శ్లోకముఖములఁ దెల్పి యున్నవాఁడు.

శ్లో॥ ద్విజాతయస్సవర్ణాసు జనయంత్య వ్రతాంస్తుయాన్
తాన్సావిత్రీ పరిభ్రష్టాన్ వ్రాత్యానితివినిర్దిశేత్

"ద్విజాతయస్స వర్ణాసుస్త్రీషుయాన్ పుత్రా నుత్పాద యంతె తేచేదుపనయనాఖ్య వ్రతహీనా భవంతి తదాతా కృతోపనయతానాన్ వ్రాత్యేత్యనయా సంజ్ఞయావ్యవదిశేత్ వ్రాత్యలక్షణం ప్రతిలోమజ పుత్రవదస్యా ప్యుపకారాక్షమ పుత్రత్వ ప్రదర్శ నార్థం అస్మిన్ సంకీర్ణ ప్రకరణే అనూదితం అని భల్లూకభట్టు వ్రాసియున్నాడు.

ఈచెప్పినదానింబట్టి యుపనయనము పోగొట్టుకొన్న వారి పుత్రులను మనువు సంకీర్ణసంకరుల తరగతులలో జేర్చి నాడని స్పష్టమైనదికదా? అపుడా వ్రాత్యపుత్రులను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులని పిలువరాదు. అపుడు పలుకవలసిన పేర్లను గూడ క్రిందివిధమున మనువే తెలిపియున్నాఁడు. వినుడు.

శ్లో॥ వ్రాత్యాత్తుజాయతె విప్రాత్పాపాత్మాభూర్జకంటకగ
అవాంత్యనాటధానౌచ పుష్పధశ్శైఖపవచ ఝల్లో మల్లశ్చ
రాజన్యాత్ వ్రాత్యాన్నిచ్ఛివిరేచ వటశ్చ కరణశ్చేవ। ఖసో

ద్రవిడఏవచ వైశ్యాత్తు జాయతే వ్రాత్యాత్ సుధన్వాచార్య్య
ఏవచ కారుషశ్చ విజన్మాచ మైత్రస్సాత్వతఏవచ.

అవాంతి అనగా వ్రాత్య బ్రాహ్మణునకు భూజకంటకుడు ఆవాటధానుడు పుష్పధుడు శైఖుడు అనువారును వ్రాత్య క్షత్రియునకు ఝల్లుడు మల్లుడు నిచ్ఛివి నటుడు కరణుడు ఖసుడు ద్రవిడుడు అనువారును వ్రాత్యవైశ్యునకు సుధన్వాచార్యుడు కారుషుడు విజన్మ మైత్రుడు సాత్వతుడు అనువారును జనించెదరని పైశ్లోకముల కర్థము ఈచెప్పినదానింబట్టి క్షత్రియవైశ్యులు వైదికోపనయనము పోగొట్టుకొన్నది నిజమేని మీాదదెలిపిన సంకీర్ణ సంకరులైనారని చెప్పకతప్పదు కదా? ఇట్లపరిశుద్ధయోనిబీజములకు జనించిన పండితులు గ్రంథము వ్రాయుదురా? వ్రాసినను దానిని సమర్థింతురా? ఈవ్రాతవలన క్షత్రియ వైశ్యసంఘములకు మాత్రమే యవమానము తటస్థించునని వారుతలంచి వ్రాసియున్నారు. కాని దానివలన సంకీర్ణసంకర క్షత్రియ వైశ్యజాతీయుల పురోహితులు గురులు సంకీర్ణ సంకరులయ్యెదరను విషయము వారికి స్ఫురించినది కాదని తెలుపవలసి వచ్చినందులకు జింతిల్లుచున్నారము. ఇట్లనిన క్షత్రియవైశ్యులను సంకీర్ణ సంకరులని దూషించినట్లు మీారుకల్పించి చెప్పుచున్నారుకాని మాశృంగేరి వారిగ్రంథములో నట్లు వ్రాసియుండలేదని మనలౌకికచయనులవారు తిరిగి సమర్థింపజూతురేమో? మేము కన్పరచిన మనువచనములుమాత్రమందు వ్రాసియుండలేదుకాని వైశ్య

లను సంకీర్ణసంకరులని మాత్రముద్రాసిన కంఠోక్తి వాక్యము కలదు కనుడు 18-29 పుటలు.

పూర్వం యుగాంతరేస్థిత జాతీయనాం శుద్ధానాం వైశ్యత్వేన వ్యవహ్రియమాణానాం ప్రాయశోనష్టత్వాత్ ఏకేచనస్థితా, తేపిశూద్రాది నిషిద్ధకర్మాచరణమాశ్రితాః సంకీర్ణాఃకిం ఇదానీంతన వైశ్యత్వేన వ్యవహార విషయాపేక్షయా అతినీచవృత్తయో బభూవుః.

అనగా బూర్వమందున్న పరిశుద్ధవైశ్యులు చాలవరకు నశించుటచేతను నెవరేని జీవించియున్నయెడ వారు పరిశుద్ధవైశ్యసంతతివారలైనప్పటికిని వైశ్యులకు నిషిద్ధములై శూద్రవిహితములైయున్న పౌరాణికకర్మలు చేయుచున్నకతన సంకీర్ణులై యతినీచవృత్తి కలిగియున్నారని కంఠోక్తిగ వ్రాసియున్నారు. ఇంతకంటె మనలనుగూర్చి వ్రాయవలసిన నీచవ్రాత వేరేమియుండును? ఇట్టి నీచపువ్రాత పరిశుద్ధయోనిబీజసంజాతులగు పండితులు వ్రాయదగినదిగాని సమర్థింపదగినదిగాని కాదనిన దోషమా? పైన దెల్పినరీతి లౌకిక చయనుల వారి సమర్థనమును విని మన వైశ్యులెట్లు భరించి యాపీఠాధిపతులను బూజించిరో పరమేశ్వరునకే గోచరముకావలెను! ఇట్లు మనునుగూర్చి నీగ్రంథమును రచించుటకు గారణముకూడ వారే యాగ్రంథమందే యిట్లు తెలిపియున్నారు. అదేమన చూడుడు. 2 పుట.

"కేచనవయం వైశ్యాః అస్మాకం శ్రుతిస్మృత్యాదిభిః వేదోక్తమంత్రైః షోడశకర్మాణియాగాది కర్మాణిచ విహితాని

తాన్యస్మాభిః బ్రాహ్మణాః నకారయంతీత్యాగ్రహేణ స్వయ ముచ్ఛృంఖలాస్సంతః కతిచన బ్రాహ్మణాన్ ధనాదిభిర్వంచ యిత్వాస్వవశమానీయ తద్వారా వైదికమంత్రైః షోడశకర్మాణి అత్యల్పకాలమారభ్యకర్తు ముపచక్రముః తేషుకశ్చన లక్ష్మీ నరసింహానామకః గతసంవత్సరే అగ్న్యాధానమపిచకారేతికింవ దంతీశ్రూయతె.

అని వ్రాసియున్నారు. అనగా కొంతమంది కోమటులు "మేము వైశ్యులము మాకు శ్రుతిస్మృతులచే వేదోక్తమంత్రములతో షోడశకర్మలును యాగాదికర్మలును విహితములై యున్నవి. కాని వానిని మాచే బ్రాహ్మణులు చేయించుట లేదను నాగ్రహముతో వారుచ్ఛృంఖలులై కొంతమంది బ్రాహ్మణులను ధనాదులచే వంచించి స్వవశము జేసికొని వారి వలన వైదితమంత్రములతో కొలదికాలమునుండి షోడశ కర్మలను జేయ మొదలిడియున్నారు. వారిలో నొక లక్ష్మీనరసింహానామకుడు గతవత్సరమున నగ్న్యాధానమును గూడ జేసినాఁడని యొక కింవదంతి వినవచ్చినది." యని వారే తెలిపియున్నారుగదా? యింతకు మించి మన వైశ్యులు ప్రతి వాది బ్రాహ్మణులను గాని పీఠాధిపతులనుగాని దూషించినట్లు వారు వ్రాసియుండలేదు. వారిని మనవారు దూషింపకపోయి నను వేదోక్తకర్మలను జేయుటయె వారిని దూషించినట్లుగ దలంచి విచారపడి యావిచారమును (దుఃఖమును) శాస్త్ర ములచే వారు వ్యవస్థ జేసుకొనియున్నారు. దానినే మన లౌకిక చ మనులవారిపుడు సమర్థించియున్నది. ఆసమర్థనముతో

మన వైశ్యజాతికి సంకీర్ణసంకరజాతియను ప్రతిష్ఠను స్థిరపరుప లౌకిక చయనులవారు ప్రయత్నించినారని స్పష్టమైనదికదా? ఇట్టి చయనులను బూజించియే కడతేరుదుమను వైశ్యులెంత మంది యిపుడు మనలో దేలుదురో తేల్చుకొని యార్యవైశ్య రక్తము మన శరీర రక్త నాళములయందు జరించుచున్న యెడల నాగ్రంధముపై జక్కనివిమర్శనమును వ్రాయించి ప్రకటించి పుష్పగిరి పీఠాధిపతులనువలె లౌకిక చయనులవారినిగూడ మన వైశ్యులు పూజించకుండునట్టి ప్రచారమునకు దొరకొనెదరని తలంచెదను.

లౌకిక చయనులవారివంటి ఘనపండితు లీప్రాంతమున లేరని తలంచి వీరికి బెజవాడ వరంగల్ పురవైశ్యులు కొందరు వార్షికముల నేర్పాటు చేసి సభలయందు బ్రధమ సత్కార మును కావించుచు వచ్చిరి. అందులకు బ్రతిఫలముగా పండితులవారు వైశ్యులకు సంకీర్ణసంకరులని చెప్పి తమ కృతజ్ఞతను జాటదలంచి కాబోలు గుంటూరు వైశ్యులను నిందించి దూషణ గ్రంధమును సమర్ధించుచు చాతుర్వర్ణములవారికి తద్గ్రంధ శ్రవణముకూడ గావించియున్నావారు. ఆగ్రంధము వైశ్యజాతిని దూషించియుండుటచే, దానిని నిరసించుచు ననేక వైశ్యమహా జనసభలు తీర్మానించియుండెను. విమర్శన గ్రంధములు వెలువడియున్నవి. ఇవి యన్నియు మన లౌకికచయనులవారికి తెలియక యా దూష్యగ్రంధమును సమర్ధింప వచ్చినవారుకారు. అది దూష్యముకాదని సాధించినం గాని వైశ్యులు పుష్పగిరి పీఠమునకు భిక్షలు చేయరు? ఆవి చేసినంగాని పీఠగౌరవము

నిలువదు. అది నిలచినంగాని పీఠసంచారము సాగదు. అది సాగినం గాన తమ జీతమును తమపుత్రుని జీతమును వియ్యాంకుని జీతమును శాశ్వతముగా జెల్లవని యెఱింగి మోసబుద్ధితో విపరీతార్థమును జెప్పి 8 మంది వైశ్యులను వంచించి వారిచే రెండుభీక్షులను జేయింపించిరి. ఆ గ్రంథమున వైశ్యులనుగూర్చి నిందావాక్యములు లేవనిగదా వీరు సభలో వాదించి నిరూపించినది? అది లిఖితరూపముగ నియ్యవలసినదని గుంటూరు స్థానిక వైశ్యసంఘమువారు తమ సభయందు గావించిన తీర్మానమును చయనులవారికి బంపినపుడు వారెందులకు ప్రత్యుత్తరమీయక మూకీభావమును దాల్చిరి? లిఖితరూపముగ బ్రత్యుత్తరమిచ్చిన దమపై వైశ్యసంఘమువారు తగిన చర్య తీసుకొందురని భయముచేకాబోలు. పోనిండు తుదకు వీరి ప్రయత్నమువలన నైదుగురు వైశ్యులను మాత్రమేకదా సంఘమునుండి వీరు చీలదీయదలిగిరి? తుదకు వారు సంఘమును ధిక్కరించి యేమిసౌఖ్యముఁ గౌరవము బొందుచున్నారు? లౌకిక చయనులవారి బోధకులోనై పురోహితు లనాదినుండి వచ్చెడి జీవనాధారమగు పౌరోహిత్యమును బోగొట్టుకొని యల్లాడుచున్నవారు. ఇవియేకదా లౌకిక చయనులవారి గ్రంథ సమర్థన ఫలములు?

ఇట్లు పరిపరివిధములఁ బరాభవములను పరాజయములను గాంచి చేయునదిలేక శ్రీ కలెక్టరువారికడను బోలీసువారికడను మేజస్ట్రీటు వారిసన్నిధిని మావైశ్యులపై లేని నేరములను మోపి చెప్పి యేదోవిధముగఁ జిక్కులలోనికిఁ దేవలెనని

యెన్నియో పన్నాగములను పన్ని యన్నియు వ్యర్థముగుటచే నాగన్నలక్రియ తలనేలకరచుకొని పడియున్నవారు. "యతో ధర్మస్తతోజయః, సత్యమేవజయతే, నానృతమ్మ" ను ప్రాం బలుకు తప్పునెట్లు?

ఈపత్రిక మాకందలేదు. కాని యందిననపుడె బొడిచి గెలిచియుందుమని యందురేమోయను సంశయమున లౌకిక చయనులవారికిని, వారిబోధకులోనై సంఘతీర్మానము ధిక్క రించిన గుంటూరు వైశ్యపంచకమునకును దీని ప్రతులను రిజి ష్టరుచేసి యంపియున్నవారము.

విజయవాడ }
3—౨—౨౬ }

ఇట్లు,
వైశ్యమహాజన సభాసభ్యులు.

# వైశ్య విద్యాభానూదయము.

## ద్వితీయరంగము.

---

ఈ రంగము 1932 సం॥ అక్టోబరు నెలలో ప్రారంభ మైనది. వైశ్యులనునిందించిన యేపండితునివైశ్యులు సత్కరించ రాదని ప్రబోధించుటకై యీ గ్రంథము యొక్క ప్రథమ భాగము వెలువడియుండెనో, ఆ పండితునిచర్యలు ఖండించు టకే యీద్వితీయభాగము కూడ బయలుదేరినది. ఈ తూరి ఆ పండితులు యీ పురవైశ్యులలో యిద్దరు మూర్తులను మాత్రమే తనవశమునందుంచుకొని నాటకమాడింప గలిగెను. వీరిద్దరిలో మొదటివారు చీదెళ్లనరసింహం అనువారును, రెండ వారు తవ్వా వెంకటసుబ్బారావు అనువారును. వీరుభయులును జన్మముచేత వైశ్యులైయుండియు వైశ్యులనునిందించిన పండి తులకు సహాయభూతులైనిలచి ఆ పండితులచేత తమపేర్లతో కొన్ని కరపత్రములనుప్రచురించి వైశ్యులకు విరుద్ధముగ ప్రచా రము సల్పియున్నారు. వీరిపేర్లతో వెలువడినకరపత్రము యీ ద్వితీయభాగమందు ప్రచురింపబడినది. ఈ నాటకమునకు జవా బుగాయీతూరి యీ పురవైశ్యులలో మరికొంత తీవ్రప్రచార ముజరిగినది. ఇందుకు సంబంధించిన కరపత్రములు యీద్వితీ యభాగమునచేర్చబడినవి. ప్రథమరంగము నందలి ప్రచారము మూలమున వైశ్యులనునిందించిన పండితులవారికి బెజవాడ వైశ్యప్రముఖులీయ బూనిన రూప్యములు పారితోషికము ఆగి పోయినవి. ఈ తూరిప్రచారమువలన 16 వ ఆర్యవైశ్యమహా

సభ యీ పురమునకాహ్వానింపబడి జయప్రదముగ జరుగుట తటస్థించినది. వైశ్యులను నిందించిన పండితులను గూర్చి మహా సభవారిట్టి తీర్మానమును గావించియున్నారు:—

---

## నె 4 రు తీర్మానము

"ద్రవ్యసంపాదనమే జీవితోద్దేశ్యముగానెంచి శ్రీపుష్ప గిరి పీఠాధిపతులయొద్ద, ఆస్థానపండితులుగా వ్యవహరించు చున్నట్టియు, 'వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థ' యను గ్రంథ మును దురుద్దేశ్యముతో సమర్థింపబూనుచున్నట్టియు మల్లాది రామకృష్ణచయనులుయొక్క చర్యను యీసభవారు నిరసించు చున్నారు. కాన వీరికి వైశ్యులెవరును ఏవిధమైన గౌరవమును చేయరాదని యీసభవారు తీర్మానించుచున్నారు"

ఈ సభాతీర్మానమున కాగ్రహముచెంది ఆపండితులు 21—7—33న యదార్థకథనము" అను పేరుతో ఒకకరపత్ర మును ప్రచురించిరి. పీఠాధిపతులు వైశ్యులను నిందించిన వాక్యములు శాస్త్రసమ్మతములై యథార్థమైనవియే అనియు, వానియందు దోషమేమియు లేదనియు, ఆపండితులు యీకర పత్రమునందు తెలిపియున్నారు. దీనికి ప్రత్యుత్తరముగ విజయవాడ వైశ్యులు ఆపండితునకు బహిరంగలేఖ నొక దానిని పంపిరి. ఇందుకు సమాధానము చెప్పుటకు ఆ పండితుడు నిరాకరించినందున, ఆయనకు విజయవాడ వైశ్య మహాసభవారు 3—9—33 న 4 దినముల గడువుతో రిజ

స్టర్డు నోటీసు నిచ్చిరి. ఆ పండితుడు నోటీసును పుచ్చుకొని పోస్టురసీదుమీద సంతకముచేసి పంపెనుగాని, అడిగిన ప్రశ్న లకు జవాబీయలేక పోయెను. ఈ పండితుని చర్యలను ఖండించుటకై బృందావననగర వైశ్యులు ది 29—9—33 న ఒకసభను జరిపి ఒకతీర్మానమును గావించిరి. ఈ వ్యవహార మునకు సంబంధించిన విషయములన్నియు యీ ద్వితీయ ప్రక రణమునందు ప్రచురింప బడినవి.

వైశ్యులు గాయత్రీ భ్రష్టులైరనియు. వీరిని సంఘములో తిరిగి చేర్చికొనుటకు ప్రాయశ్చిత్తముకూడ పనికిరాదనియు, శ్రీ శృంగగిరి పీఠాధిపతులయొక్కయు, బెజవాడ పండితుని యొక్కయు వాదమైయున్నది. వైశ్యులు ఆదినుండియు కర్మ లను వేదోక్త విధముగ జరుపుకొనుచుండగా, వీరికి వేదోక్త విధానముపనికిరాదనిచెప్పి బ్రాహ్మణులు అడ్డుకలుగజేసి కొన్ని చోట్ల వైశ్యులను బాధించియు, కొన్నిచోట్ల మోసగించియు, కర్మలనుపురాణోక్త విధానముగ జరిపించిరి. ఈ కర్మలోపము నకుప్రాయశ్చిత్త మవసరమగు నెడల ధర్మవిరుద్ధముగ పురా ణోక్తకర్మలను వైశ్యులచేతచేయించిన బ్రాహ్మణులకే ప్రాయ శ్చిత్తము జరుగవలెనుగాని చేసిన వైశ్యులకు ప్రాయశ్చిత్త ములుతగవు. ఈ విషయమై ప్రథమభాగము నె 7 రు. కరప త్రమునందు చర్చ జరిగియున్నది.

ప్రజలకు జ్ఞానమును బోధించి వారిని ధర్మమార్గమున నడిపించవలసిన బాధ్యత పీఠాధిపతులమీదను, బ్రాహ్మణ పండితుల మీదను, నుండగా, తమ విధిని నెరవేర్చక పోగా

వీరు వర్ణద్వేషమును పుట్టించు అక్రమ గ్రంథములను రచించి ప్రచారముచేయుటవలన ప్రజలలో కలవరములకు కారణమగుచున్నది. యతులలోను, బ్రాహ్మణులలోను, సత్యముగను, న్యాయముగను వర్తించువారు యిప్పటికిని చాలమంది కలరు. ఇట్టి సత్త్వవర్తకులపై ప్రజలకు గల విశ్వాసమును భక్తిని పోగొట్టిన దోషమునకుగూడ పైనదెల్పిన అక్రమ ప్రచారకులు పాత్రులగుచున్నారు. శంకారాచార్యులవారి సాంప్రదాయములోచేరి పీఠాధిపతియై వెలయుచున్న శారదాపీఠస్థులు జరిపిన చర్య యిందుకు నిదర్శన మిచ్చుచున్నది. అమెరికాదేశ నివాసినియగు మిల్లరు దొరసానిని ఇందోరు మహారాజాగారు వివాహముచేసికొని యుండగ, ఆ వివామునకు శారదాపీఠాధిపతియైన శంకరస్వాములవారు తన యంగీకారము నిచ్చుటయే కాక యీ తెల్లదొరసానికి శర్మిష్ఠా దేవియని హిందూనామకరణము చేసి యీమెను ద్విజాతులైన క్షత్రియులలో చేర్చి యుండెను. క్రిష్టియను మతస్థురాలైన తెల్లదొరసానికి ఒక్క ముహూర్తకాలములో ద్విజత్వమిప్పించి యుత్తమక్షత్రియ కులములోచేర్పించిన శంకరపీఠమువారి సాహసమేమని చెప్పవచ్చును? కాని హిందూసంఘములో బుట్టి, హిందూసంఘమును పట్టుకొని ప్రేలాడుచు మహర్షులను హిందూదేవతల నారాధించుచు బ్రాహ్మణులు కోరినట్లెల్ల దానములు, సంతర్పణలు చేయుచు బ్రాహ్మణుల కాళ్లుకడిగి నెత్తినచల్లుకొనుచుండిన వైశ్యులకు మాత్రము ద్విజత్వము నశించుటేల? తిరిగి సంఘములో చేరుటకు వీరికి

ప్రాయశ్చిత్తములు కూడ పనికిరాకపోవడమేల ? ఔరా ! పీఠాధిపతుల మహాత్మ్యము ! బ్రాహ్మణుల చమత్కారము ! మిల్లరుకన్యపాటియైన వైశ్యులు పనికిరాకపోయిరా ? ఈ మిల్లరు కన్యావివాహమునుగూర్చి ది 28—12—29 గల కృష్ణాపత్రికలో యిట్లు తెలుపబడినది. ఈవిషయమై మిల్లరు కన్యచెప్పిన వాక్యములుగూడ వినదగియున్నవి.

"1928 సం॥ మార్చి ది 13 న నేను హిందూమత ధర్మ మును స్వీకరించితిని. ఆనాటినుండియు అమెరికా వాసియైన నాన్సిఆన్ మిల్లరుకన్య శర్మిష్ఠాదేవియైనది. తరువాత 4 దినము లకు మావివాహము జరిగినది. నాభర్తగారు శ్రీ ఇందూరు మహారాజాశ్రీ తుకోజీరావు హోల్కారుగారు. నేను ఇందూరు మహారాణిని శర్మిష్ఠాభాయిని. నావివాహమునకును, హిందూ మతస్వీకరణమునకును, పీఠాధిపతియైన శ్రీశంకరాచార్యస్వామి యంగీకరించుటతో మాసంకోచములన్నియు తీరిపోయినవి. దానితో మాదాంపత్యబంధము నిరామయము నిర్దుష్టము అయి నది. ఇంతవరకు పాశ్చాత్యులెవ్వరైన హిందూమతములోని యగ్రవర్ణములలోనికి చేర్చుకొనబడుటకు నేనె మొదటిదానను. దీనికి హిందూమత పీఠాధిపతి యనుజ్ఞనొసంగిరని తెలిసిన తోడనే నేను పరమోత్సాహమొందితిని."

ఈవిషయమై ఛాందా పత్రికనుండి ది 28—12—29 కృష్ణాపత్రికయందు యీక్రిందివిధముగ అనువాద మొకటి ప్రచురింపబడినది.

ఒక సాధారణవేశ్యాసంబంధ ఫలితముగ యీమహారాజు సింహాస నచ్యుతుడు గావింపబడెను. దీనిని తప్పించు కొనుటకై యీయన 1926 సం॥న యింగ్లాండు వెళ్లిరి. అచ్చటనుండి ఫ్రాంసు, స్విట్జర్లెండు ప్రయాణము చేసిరి. కాని మనశ్శాంతి కుదరలేదు. తుదకు కాలిఫోర్నియాలో సాన్‌ఫ్రాన్సిస్కో దగ్గర మిల్లరు కన్యతో పరిచయముకలుగుట, ప్రేమలాభమును బడయుట, మొదలగు మనోరంజకములైన ఘటనలు జరిగినవి. శ్రీ శారదాపీఠజగద్గురు శంకరాచార్యుడు స్వయముగావీరికి వివాహసూత్రమును కల్పించి బహిరంగవ్యభి చారముపై ధర్మముద్రవేసెను. ఈ కలియుగంబున ధనమును గుప్పినచో, నే పనికైనను క్షణములో మతగురువుల సమ్మ తిని బడయవచ్చును. మిల్లరుకన్యతో జరిగిన వివాహమువలన ప్రాచ్యపాశ్చాత్యఖండముల నైక్యము గూర్పబడినదను కృత్రిమకారణము నేటిసంఘమునుమోసగింపనేరదు. బహిరంగ వ్యభిచారమును కప్పిపుచ్చుటకై కొందరు జోహుకుములు మహారాజుగారికి మిల్లరుకన్యతో ధర్మశాస్త్రబద్ధముగ వివా హము జరిగినదని వాదింపవచ్చును.........ప్రస్తుతము తుకోజీరావుగారికి ధర్మబద్ధముగ వివాహితులైన యిద్దరు మహారాణులు రక్తాశ్రువుల రాల్చుచున్నారు. మిల్లరుకన్య ప్రణయలీల సంగతి చెవినిబడగానే ద్వితీయ మహారాణియైన యిందిరాభాయిగారు అన్నపానములను విడచి విలపించెనన్న విషయముమాకు తెలియనిదికాదు. కాని యేమియు ఫలితము లేకపోయెను. నేటిదనుక ఆయభాగ్య మహారాణిద్వయ

హృదయస్సీమను పరితాపాగ్ని జ్వాలలు దహించి వైచుచునే యున్నవి. మహారాజుగారు మాత్రము నిశ్చింతగ ఫ్రాన్సు దేశములోని కుంజపుంజములమధ్య మిల్లరుకన్యతో కేళీవిలాసము సల్పుచున్నారు.”

ఈవిధముగ జరిగినపాశ్చాత్యక్రిష్టియన్ స్త్రీవివాహమునకు హిందూపీఠాధిపతులు తమ అంగీకారమునిచ్చుటయేగాక ఆ వివాహమునకు యెందరో బ్రాహ్మణోత్తములు హాజరై సంభావనలనుకూడ గ్రహించి ఆశీర్వచన పన్నములను వల్లించియుందురనుటకు సందియములేదు. ఈపనులుచేయుటకు శాస్త్రము అడ్డుపడలేదు. కాని యీపీఠాధిపతులును, కొందరుబ్రాహ్మణ పండితులును, వైశ్యులను, హిందూసంఘములోచేర్చుకొనుటకు శాస్త్రములో ప్రాయశ్చిత్తముల కాన్పించుటలేదని ధైర్యముగా పల్కుచున్నారు. వైశ్యులిట్లు స్వమతస్థులచేతను, పరమతస్థులచేతను నిందింపబడుటకు కారణము విద్యాలోపమే అయియున్నది. ఈరహస్యమును గుర్తెరింగియే వైశ్యవిద్యావ్యాప్తికి ప్రథమమునుండియు స్వార్థపరులైన బ్రాహ్మణులు అడ్డు తగులుచు, వైశ్యుల ధనప్రవాహమును అన్నసత్రముల మీదకును, బ్రాహ్మణ సమారాధనలమీదకును, దేవాలయోత్సవాదుల పైకిని మరలించుటకు కారణమైనది. కాని అంధకారమెంతకాలము నిలచియుండును? చీకటి 15 దినములే గదా ! వైశ్యులను అజ్ఞానావస్థలో యెంతకాల ముంచగలరు? భానూదయమగుటతోడనే తమస్సు పలాయన మగుచుండుట లేదా? విద్యాభానూదయ మగుచుండ అవిద్యాతమస్సు అస్త

ఖించక యుండునా ? అల్లదిగో, వైశ్యవిద్యాభాను డుద యించినాడు. వైశ్యులు నిద్రమేల్కొనుచున్నారు. ఇకను పీఠాధిపతుల అక్రమ ప్రవర్తనలుగాని, స్వార్థపరులైన పండి తుల మాయలుగాని, యికను వైశ్యజాతిని మోహపరుప జాలవు. అజ్ఞానదాస్యమునుండి వైశ్యులు విముక్తులుకావలెనని కోరుచో వారికి రెండుమార్గములు మాత్రమే కలవు.

1. దానము లన్నింటిలోను విద్యాదానమే శ్రేష్ఠమని శాస్త్రము బోధించుటచే యికముందు ఏవైశ్యుడెట్టిదానమును చేయదలచుకొన్నను దానిని వైశ్యవిద్యానిధికే సమ ర్పింపవలెను. దానములను స్వీకరించుటకు వర్ణభేదము పాటింప నక్కరలేదు. దానపరిగ్రహణమునకు కొన్ని సద్గుణ ములు మాత్రమే అవసరము. ఇందుకు సంబంధించిన శాస్త్ర ప్రమాణములు ప్రథమరంగము 10 వ కరపత్రములో చర్చించ బడియున్నవి. కాన దానములను పట్టుటకు వైశ్యులు అనర్హులు కారు. బ్రాహ్మణులు గ్రహించు దానములకును, వైశ్యులు గ్రహించు దానమునకును ఒక ముఖ్యభేదముకలదు. బ్రాహ్మ ణులు గ్రహించు దానద్రవ్యము తమ స్వలాభమునకే విని యోగించుకొనుచున్నారు. కాని వైశ్యులు గ్రహించు ద్రవ్య ములు తమ స్వలాభమునకు వినియోగించక, వైశ్యవిద్యా నిధికే సమర్పింపబడును. కాన దీనికి ప్రతిగ్రహదోషము కూడ లేదు. ఇట్టి దానములు దానపరిపాలనము క్రిందకు వచ్చును గాని, దానప్రతిగ్రహము క్రిందకు రాజాలదు. ఒక చేతితో

గ్రహించినదానమును, మరియొక చేతితో విడుదలచేయుటయే యీదానములయొక్క ఉద్దేశ్యము.

ఈప్రకారము దానములనుగ్రహించి విద్యాపోషణకై వినియోగించి మార్గదర్శకులైన "వైశ్యపుష్కరదానప్రతిగ్రహ సమితి" వారు వందనార్హులగుచున్నారు. ఈ సంవత్సరమున జరిగిన కృష్ణాపుష్కరమునందు విజయవాడపురమున యీ సమితి యేర్పడి వైశ్యతీర్థయాత్రికులవలన దానములను పరిగ్రహించి వైశ్యవిద్యాసంస్థలకును, హరిజనవిద్యాపోషణ కును, బ్రహ్మవిద్యావ్యాప్తికిని, ఆద్రవ్యమును వినియోగించుట మూలముగా దానపరిపాలనమును చక్కగ జరిపియున్నారు. దానమును చేయుటకంటె దానమునుగ్రహించి సద్వినియోగ పరచుటయే శ్రేష్ఠమని శాస్త్రము బోధించుచున్నది. ఎట్లన—

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోఽను పాలనం।
దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతంపదం॥

అనగ, దానముచేయుట, దానమునుగ్రహించి సక్రమముగ పరిపాలించుట అను యీరెండుకార్యములలో దానముకంటె పాలనమే శ్రేష్ఠము. దానమువలన క్షణికమైనస్వర్గముమాత్రమే లభించును. కాని పాలనమువలన శాశ్వతమైన బ్రహ్మలోక ప్రాప్తికలుగును అని అర్థము. వైశ్యులుదానములను గ్రహించి విద్యావ్యాప్తికొరకు సద్వినియోగపరచుట దానపాలనము క్రిందికివచ్చును. కాన శాశ్వతబ్రహ్మలోకప్రాప్తిని కలిగించు దానపాలనముకూడ వైశ్యులకు కర్తవ్యముగుచున్నది. పైన తెల్పిన పుష్కరదాన ప్రతిగ్రహసమితివారి దానప్రతిగ్రహ

విధానమును, దానపాలన విధానమును ప్రతిగ్రామములోను ప్రవేశపెట్టి అమలుజరిపినచో వైశ్యవిద్యానిధికి యెంతయో ధనము సేకూరగలదు. అప్పుడు ధనాభావముచేత వెనుకబడి యున్న వైశ్యవిద్య త్వరలో వ్యాప్తినొంది తన్మూలమున వైశ్యులు విద్యావంతులై అజ్ఞానదాస్యమునుండి విముక్తులు కాగలరనుట నిస్సందేహము.

ఈశ్వర సృష్టిలో విచిత్రమొకటి కాన్పించుచున్నది. సాధారణముగా ధనవంతులకు బిడ్డలు లేకపోవుటయు ధన హీనులకు బిడ్డలు అధికముగ కలుగుటయు తటస్థించుచున్నది. తన ధనమును ఖర్చుపెట్టుటకు సంతానములేదని ఒకవైపున ధనవంతుడు కృశించుచుండగా సంతానమధికమై పోషించుటకు ధనములేక మరియొకవైపున బీదవాడు బాధపడుచున్నాడు. ధన వంతునకు ధనముండియు ఖర్చుపెట్టుటకు బిడ్డలులేరు. బీద వానికి బిడ్డలుండియు పోషించుటకు ధనములేదు. ఈశ్వర సృష్టిలో ధనవంతుడు ఒకవైపునను ధనహీనుడు మఱియొక వైపునను దుఃఖపడుచునే యున్నారు. ఇట్లు యుభయుల దుఃఖము నివారణము కాగలమార్గమొకటి అన్వేషింపబడ వలసియున్నది. ధనవంతులకు సంతానము లేకపోవుటచే దత్తతచేసికొనగోరువారు స్వగోత్రము నుండియో, అన్య గోత్రము నుండియో బిడ్డలను తెచ్చుకొని వారిని దత్తత చేసికొని వంశక్షయము కాకుండ చేసికొనుచున్నారు. ఇట్లు దత్తుచేసుకొను విషయములో కేవలము ధనము గోత్రము, అందము, వీనినే ధనవంతులు చూచుకొని పుత్ర

లను గ్రహించుచున్నారుగాని, ఆపుత్రులయొక్క గుణాగుణము లనుగాని, విద్యాబుద్ధులనుగాని ఆరోగ్యస్థితినిగాని ఆలోచించి గ్రహించుటలేదు. ఈకారణముచే దత్తపుత్రుడు యింటికి వచ్చినదిమొదలు యీతడు తన దత్తతండ్రియొక్క భోగ భాగ్యములకు రుచిమరిగి గారాబముగ పెరికి, పాఠశాలకుపోక, దుస్సాంగత్యమునకులోనై ధనమంతను దుర్వ్యయముచేసి విరోధములను పెంచి తల్లిదండ్రులను కోర్టులకెక్కించి దత్తవంశము వారి కీర్తిని చెఱచుట సంభవించుచున్నది. ఇట్లెందరో ధని కులు తమ దత్తపుత్రులవలన దుర్భరకష్టములకు పాలైన సంగతి లోకవిదితము. కాని యీ బాధనుండి తప్పించుకొని సుఖపడుటకు మార్గములేకపోలేదు. దత్తుచేసికొనదలచిన ధనవంతులు తన గోత్రజుడు కాకపోయినను, అన్యగోత్రముల యందుగల గుణవంతులైన బీదబాలురను స్వీకరించి, ఉన్నత విద్యయందు వారికి సుశిక్షణము నిప్పించి, సద్వృత్తిని కల్పించుచో దత్తపుత్రులవలన ఉభయకుటుంబములు తరించుట కవకాశముండును. మఱియు యిందుమూలమున దేశమునకు కూడ అభ్యుదయము ప్రాప్తించును. కాన యిట్టి శ్రేయస్సు సిద్ధించుటకుగాను యీ క్రిందివిధానము అవలంబింప తగి యున్నది. వైశ్యులలో సంతానములేని ధనికుల జాపితాయొక టియు, సంతానము అధికముగానుండి బిడ్డలపోషణ భార మును సహించలేకయున్న దరిద్రులజాపితా యొకటియు తయారు చేయవలెను. అప్పుడు మొదటిజాపితాలోని ధనవం తులు రెండవజాపితాలోని బీదవారి పుత్రులను వారివారి

విద్యా గుణశక్తులను పరీక్షించి దత్తుచేసికొని ఆదత్తపుత్రులకు ఉన్నతవిద్యా శిక్షణమూలమున వారిని అభివృద్ధికి తెచ్చి తమ వంశములను నిల్పుకొనవలెను. ఇది నిర్బంధముగాని ఐచ్ఛికము గాను. ఇట్లు దత్తుజరుపుకొను విషయములో ధనవంతుడు కేవలము ఒక పుత్రునే దత్తుచేసుకొనవలెనను నిర్బంధము నుండనక్కరలేదు. తన కుటుంబమును నిలువబెట్టుకొనుటకును బీదకుటుంబములను పోషించుటకును సాధనభూతమైన యీ దత్తతయందు ఒకరినిగాని, ఒకరికంటె అధికముగాగాని పుత్రులను గ్రహింపవచ్చును. మఱియు, పుత్రులతోపాటు పుత్రికలనుగూడ దత్తుచేసుకొని వారికి విద్యనేర్పించి ఉత్తమస్నాతకులకు వారిని కన్యాదాన మొనరింపవచ్చును. ఈపద్ధతివలన ధనవంతులు తమ వంశములను నిలవబెట్టుకొనవచ్చును. బీదల కుటుంబములను పోషింపవచ్చును. అయితే దత్తపుత్రులకును దత్తపుత్రికలకును విధిగా విద్యనేర్పించవలసిన నిర్బంధముండవలెను. ఈవిధముగ వైశ్యులలో విద్యసులభముగ వ్యాప్తము కాగలదు. మఱియు, ప్రజలను పీడించి పిప్పిచేయుచున్న ఆర్థికసమస్యయు, సునాయాసముగ పరిష్కరింపబడును. మఱియు, యీ విధానమువలన సంతానములేని ధనికుల ధనము వ్యర్థముగా వారసులు హరించుటకుగాని, సోమరులను పోషించు అన్నసత్రములకు వినియోగపడుటగాని, జూదము, సురాపానము, వ్యభిచారము మున్నగు దుర్వ్యసనముల క్రింద ఖర్చుపడుటగాని, సంభవింపక వైశ్యవిద్యాభివృద్ధికిని, వంశపారి

శుద్ధ్యమునకును, సద్వినియోగపడగలదు. ఇది మొదటి మార్గము.

[2] ఇకను వైశ్యుల విముక్తికి రెండవమార్గము ఏది అని విచారింప బడవలసియున్నది. వైశ్యుల గృహములలో నిత్యము జరుగు శుభాశుభకర్మలను వైశ్యపురోహితుల చేతనే జరిగించవలసి యుండును. యువకులు బహిరంగ సభలలో నెంతగంభీరముగ నుపన్యసించి, తీర్మానములు కావించినను, యిండ్లలోని ముసలివాండ్రును, స్త్రీలును పురోహితులుచెప్పు మాటలకు విలువనిచ్చెదరుగాని, సభాతీర్మానములకు వారు లోబడి నడుచుకొందురనుట కల్ల. కాన ధర్మముల నడక యంతయు యిండ్లలోని ముసలవాండ్ర యొక్కయు, స్త్రీల యొక్కయు ఆధీనమై యున్నది. వీరలు తిరిగి పురోహితుల వశవర్తులై యున్నారు. ఈ కారణమువలన యువకులు కోరు సంఘ సంస్కరణములు గృహములలో ప్రవేశింపవలెనన్న పురోహితులు మనకు వశవర్తులై యుండవలెను. అట్టిది సంప్రాప్తము కావలెనన్న స్వకుల పౌరోహిత్యము తప్పక యుండవలెను. అనగా వైశ్యపురోహితులు అనేకులు తయారు కావలసియున్నారు. ఈ కార్యమును నెరవేర్చుటకై గుంటూరులో వైశ్య గురుకులాశ్రమము సిద్ధముగా నున్నది. కాని ప్రస్తుతస్థితిలో అచ్చటికిపోయి విద్యనభ్యసించువారి సంఖ్య బహుస్వల్పముగా నున్నది. ఇదివరకు షోడశకర్మలను నేర్చుకొని పరీక్షలలో కృతార్థులై సమర్థులైన వైశ్య పురోహితులు కొందరిప్పుడు కలరు. కాని వీరిచేత వైశ్యులు

పౌరోహిత్యమును జరిపించుకొనుటకు వెనుకాడుచుండుటచేత వైశ్యపురోహితులు తమవృత్తిని విరమించుకొని వర్తకుల యొద్ద గుమాస్తా పదవులను సంపాదించుకొని యెట్లనో జీవనముచేయుచున్నారు. ఈ లోపము నివారణమై పెక్కుమంది వైశ్యపురోహితులు తయారగుటకును, తయారైవచ్చిన పౌరోహితులచేత వైశ్యులు తప్పక పౌరోహిత్యమును జరిపించుకొనుటకును వీలగునట్లు ఒకవిధానము కనిపెట్ట బడవలసి యున్నది.

ఇందుకుగాను పౌరోహిత్యమునకు కావలసిన షోడశ కర్మలను సంగ్రహపరచి యిప్పటి పరిస్థితుల కనువగు మార్పులతో రెండుసంవత్సరముల విద్యా విధానము నేర్పాటు చేయించవలసి యుండును. ఇప్పుడున్న కర్మకాండ బాహుళ్యముగ నున్నది. అందువలన కర్మలను చేయించు పురోహితునకు, కర్మలనాచరించు గృహస్థులకును విసుగుపుట్టి కర్మల యందు భక్తిశ్రద్ధలు తరిగిపోవుట తటస్థించు చున్నది. మఱియు ఆచరింపబడుచున్న కర్మకాండ అర్థరహితముగా గ్రహింపబడు చున్నది. ఇందుమూలమునకర్మలు అంధప్రాయముగను,విసువుతోను జరుపబడి జ్ఞానశూన్యములగుచున్నవి. కాన కర్మవిధానముయొక్క బాహుళ్యమునుతగ్గించి ఆస్థానమందు భక్తి జ్ఞాన వైరాగ్యములను ప్రవేశపెట్టుట అవసరమగును. ప్రతిపురములోను30గృహములకొకపురోహితునిచొప్పునలెక్కవేసియాపురమున కెందరు పురోహితులు కావలసి యుందురో నిర్ధారణ చేయవలెను. ప్రతిపురమునందు వైశ్యసంఘ మొకటి యేర్పాటై

యీ పౌరోహిత్యపరిపాలనా కార్యభారమును వహించవలెను. వైశ్యగురుకులాశ్రమమునందు 2 సంవత్సరములలో షోడశకర్మలను నేర్చుకొని పరీక్షలలో నుత్తీర్ణులై వచ్చు ప్రతి వైశ్య పురోహితునకు నెల 1కి 25 రూపాయలు చొప్పున జీతమిచ్చి వానివలన పౌరోహిత్యము చేయించుకొనెదమని పురవైశ్యులు 3 సం॥ గ్యారంటీనిచ్చి విద్యార్థులను గురుకులాశ్రమమునకు బంపి విద్య నేర్పింపవలెను. ఇందుకు పౌరోహిత్య ఫండును వసూలు పరచవలసియున్నది. ధనవంతులు నెల 1కి రు 2-0-0 మధ్యములు నెల 1కి రు 1-0-0, బీదవారు నెల 1కి 0-8-0 చొ॥ పౌరోహితున కిచ్చుటకు యేర్పాటుచేసి, 30 గృహముల వారు కలసి పురోహితునకు నెల 1కి రు 25-0-0 చొ॥ జీత మిచ్చునట్లు కట్టుబాట్లుచేసి తమగృహములలో జరుగు సమస్త శుభాశుభ కర్మలను యీపురోహితునిచేత జరిపించుకొనుటకు సంసిద్ధులు కావలెను. ఈ రు 25-0-0 జీతముకంటె గృహస్థులు పురోహితునకు యేవిధమైన పారితోషికము నియ్యనక్కరలేదు. ఉపనయన వివాహాది శుభకార్యములను ఆబ్దికాది అపర క్రియలను ఉచితముగ జరిపించుకొనవచ్చును. ఇట్లు 3 సం॥ గ్యారంటీచేసి పిమ్మట యీ నెలజీతముల పద్ధతిని కొనసాగించుటకు గాని లేక మామూలువచ్చు బళ్ళపద్ధతి ప్రవేశపెట్టుటకు గాని అవకాశముండవలెను. ఈప్రకారము నెల1కి రు 25-0-0 చొ॥ పురోహితునకు జీతమిచ్చెదమని గ్యారంటీలతో ప్రతి యూరినుండియు పౌరోహితులను తయారుచేయించునిమిత్తము గృహస్థులనుండి దరఖాస్తులను తీసికొనియు మరియు విద్యార్థు

లనుండి ఒడంబడికలను వ్రాయించుకొనియు వీరిని గురుకులా శ్రమమునకు పంపవలెను. ఈపద్ధతివలన పురోహితులకు నెల జీతములు వచ్చుటయేగాక వీరికి అన్నవస్త్రముల కొరవకూడ యుండనేరదు. ఎట్లన, వీరు అన్నశ్రాద్ధములయందు భోక్తలుగ నుండియు, నోములు వ్రతములయందు ఆరాధ్యులుగనుండియు భోజనములను వస్త్రములను ఉచితముగ సంపాదించుటకు వీలగును. మరియు, వీరిభార్యలు ముత్తైదువులుగను, వీరి బిడ్డలు బ్రహ్మచారులుగను, గృహస్థులయిండ్లలో యేర్పాట్లు చేసుకొని అన్నవస్త్రములను సంపాదించగలుగుదురు. ఈప్రకా రము ప్రతి పురోహితుడును తన కుటుంబమునకు కావలసిన అన్నవస్త్రములను ఉచితముగ సంపాదించి నెలజీతము క్రింద వచ్చు రు 25 రూపాయిలు నిలవయుంచుకొనవచ్చును. ఈవిధ ముగ కూడ యిప్పుడు వైశ్యయువకులలోగల నిరుద్యోగ సమస్య పరిష్కారము కాగలదు. సామాన్యముగ ఇప్పుడు బి.ఎ; ప్యాసుఅయినవారికంటె ఈపురోహితులే, హెచ్చుసంపా దనచేయగలరు. ఇంతేగాకయీపురోహితులుగృహస్థులచేకాళ్ళు కడిగించుకొని వందనములకు పాత్రులగుటచే పురోహితవృత్తికి. సర్కారునౌకరీ వృత్తులకంటె అధిక గౌరవమే కలుగును. మఱియు, యీపురోహితులు స్వవర్గస్థులగుటచే గృహము లలో మనము ప్రవేశపెట్టింప నెంచిన సంస్కారములను, మార్పులను, వీరిద్వారా సులభముగ యిండ్లలో చొప్పింప వచ్చును. కాన వైశ్యులను హీనులనుగా జూచు అన్యుల దాస్యమునుండి వైశ్యులు త్వరలో విముక్తి కాగలరు.

ఈస్వకుల పౌరోహిత్యముమూలముననే బ్రాహ్మణులలో నియోగిశాఖవారును, వైష్ణవసాంప్రదాయకులును, శైవసిద్ధాంతులును, విశ్వబ్రాహ్మణులును, కమ్మవారును, పద్మసాలీలు మున్నగువారును అన్యదాస్యమునుండి విముక్తులై శీఘ్రముగ స్వసంఘాభివృద్ధిని పొందగలుగుటకు వీలైనది. అట్లనే వైశ్య వర్ణమువారుకూడ స్వకుల పౌరోహిత్యమును వెంటనే అమలు నందుంచుటకు ప్రయత్నములు చేసినగాని, వైశ్యులు సంకరులైనారనియు, అందువలన వీరికి ప్రాయశ్చిత్తములు లేవనియు, వాదించు బ్రాహ్మణులయొక్కయు, పీఠాధిపతులయొక్కయు దాస్యమునుండి విముక్తులై యిదివరలో కోల్పోయిన స్వసంఘ గౌరవమును తిరిగి సంపాదింపగలరు. ఇట్లు వైశ్యులు దాస్య విముక్తులగుటకు సూచింపబడిన రెండుమార్గములలో మొదటి మార్గమును అనుసరించుటవలన వైశ్యులకు దానధర్మ ప్రతిగ్రహాధికారములుగలిగి విద్యానిధి పెంపొంది వైశ్యులలో విద్యవ్యాపించి తక్కినవర్ణములవారికి దేశమునందుగల గౌరవముకంటె అధికగౌరవమును వైశ్యులు సంపాదింపగలరు. రెండవమార్గమును అవలంభించుటవలన పౌరోహిత్యము వైశ్యులచేతిలోనికేవచ్చి బ్రాహ్మణులు కావించు అగౌరవము నుండి వైశ్యులు తప్పించుకొనుటయేగాక వీరిసంఘము మిక్కిలి పవిత్రవంతముకాగలదు. మఱియు ప్రస్తుతము వైశ్యులకు పౌరోహిత్యమును జరుపుచున్న బ్రాహ్మణ పురోహితులు షోడశకర్మలలో, పరీక్షలనిచ్చినవారుకారు. ఒక విద్యాలయము నందు సుశిక్షను పొందినవారునుకారు. సంస్కృతభాషాజ్ఞా

మునూ లేదు. ఇందువలన మంత్రములు చెప్పునప్పుడును కర్మలను చేయించునప్పుడును అనేక పొరపాట్లుజరిపి పుణ్యము నకుబదులు యెదురు పాపమును తెచ్చిపెట్టుచున్నారు. కాని స్వకుల పురోహితులు గురుకులాశ్రమమునందు యథావిధిగ సుశిక్షితులై పరీక్షలయందు ఉత్తీర్ణులుకావలసిన అవసరముండు టచే పైనదెల్పిన లోపములకు అవకాశముండనేరదు. ఈరెండు మార్గములును సిద్ధించుటవలన వైశ్యులు తక్కినవర్ణస్థులతో పాటు ఆత్మగౌరవమును, ఆత్మస్వాతంత్ర్యమును పొంది వర్ధిల్లెద రనుట అతిశయోక్తికాదు.

కాని కొందరు వైశ్యులకు యీమార్గములు రుచించుట లేదు. వైశ్యులను దూషించిన బ్రాహ్మణులపైనను పీఠాధిపతుల పైనను కక్షవహించి వారియెడల ప్రతిక్రియలను జరిపి సాధించ వలెనని కోరుచున్నారు. కాని యీపద్ధతి శ్రేయస్సును సమ కూర్చజాలదు. నిందించినవారిపై నిందింపబడినవారు ఆగ్రహము చెందుట ఈశ్వరసృష్టియందు సహజముగ జరుగుచునేయున్నది. జీవులకు యీపద్ధతి సహజమేయైనను, యియ్యది పురోవృద్ధికి ప్రతిబంధకమే యగును. వైశ్యులు సంకరులైనారని దూషించు బ్రాహ్మణులపై రోషమును, ఆగ్రహమును జూపనెంచు వైశ్యులు ఆరోషమును తమ విద్యాలోపముపై జూపి దానిని నాశమొనర్చుటకు కావలసిన విద్యను సంపాదించుటలో ప్రయత్నశీలురగుట ఉత్తమము. రోషావేషమువలన ఉద్భ వించిన నూతనశక్తిని నిర్మాణకార్యక్రమమునందు వినియో గించినచో తమవర్ణమునకేగాక అన్నివర్ణములకును శ్రేయస్సు

గలిగించిన వారగుదురు. విద్యలేకపోవుటచేతనే అన్యులచే వైశ్యులు అగౌరవింపబడుచున్నారని తెలిసికొని అట్టి దాస్య విముక్తినిచ్చు పైనదెల్పిన రెండుమార్గములను చేపట్టుటకై వైశ్యులు సంసిద్ధులు కావలసియున్నారు.

వైశ్యులు కర్మభ్రష్టులై సంకరులైనారని వాదించు బ్రాహ్మణపండితులు డబ్బుపుచ్చుకొని వేదములను బోధించుట, ముందుగనే నెల జీతములను కరారుచేసికొని గీతాకాలక్షేపములుచేయుట, డబ్బుయిచ్చినగాని సభలలో ఉపన్యసించమని చెప్పుట, యిత్యాతి భావములతోకూడిన ప్రవర్తనము ధర్మశాస్త్రవిహితమైనదియా? లేక ధర్మవిధ్వంసకరమైనదియా? శాస్త్రదృష్ట్యా వేదవిక్రయము బహు అపవిత్రమైన విషయము. ఈవిషయమునుగూర్చి యీ గ్రంథముయొక్క ద్వితీయరంగములోని ప్రచురణమును చూడుడు. వేదవిక్రయమునకు ప్రాయశ్చిత్తమే లేదుగదా! ఈవిషయమునుగూర్చి విచారణ సల్పుటకు బదులు వైశ్యులెవరో పురాణోక్త కర్మలుచేసినారను నెపమున వీరికి ప్రాయశ్చిత్తములుకూడ పనికిరావని పీఠాధిపతులు గ్రంథములనురచించుటయు, పీఠస్థుల నుండి నెలజీతములు పుచ్చుకొని జీవనమును గడుపుకొను బ్రాహ్మణ పండితులు దీని నామోదించుటయు, యీపండితులను పురస్కరించుకొని వీరి సిద్ధాంతమును బలపరచుచున్న

(1) అద్దేపల్లి వెంకటప్పయ్యశ్రేష్ఠిగారు, (2) చీదెళ్ళ నరసింహాంగుప్త, (3) తవ్వా వెంకటసుబ్బారావుగుప్తగార్లు వైశ్యులకు విరోధముగవాదించుటయు కడుచోద్యముగనున్నది.

వైశ్యులమీద నారోపింపబడిన సాంకర్యదోషమును, కర్మ భ్రష్టత్వమును, ప్రాయశ్చిత్తానర్హతయు, యిత్యాదిదోషములను ఋజువుచేయవలసినదని బ్రాహ్మణపండితులకు విజయవాడ వైశ్యమహాసభతరపున బహిరంగలేక యొకటియు, రిజస్టర్డు నోటీసు యొకటియు జారీచేయబడియున్నను, ఆ బ్రాహ్మణ పండితులుగాని, వీరిని పురస్కరించుకొని ప్రతివాదముచేయు చున్న పైముగ్గురు వైశ్యసోదరులుగాని యేలప్రత్యుత్తరమీయ జాలకపోయిరో గోచరించుటలేదు. బ్రాహ్మణులు వేదవిక్రయ మును జరుపుటకంటె, వైశ్యులు పురాణోక్త కర్మలనాచరిం చుట అధికదోషమా? వేదవిక్రయులగు బ్రాహ్మణులకు అవ సరములేని ప్రాయశ్చిత్తములు, పురాణకర్మల నాచరించు వైశ్యులకుమాత్ర మెట్లవసరములయ్యెనో పైనదెల్పిన బ్రాహ్మణ పండితులును, వైశ్యసోదరత్రయమును సమాధానము చెప్పవ లసియున్నారు. అడిగేవారికి చెప్పేవారు లోకువ. అట్లనే, విద్యా వంతులైన బ్రాహ్మణులకు విద్యలేని వైశ్యులులోకువకాక తప్పదు. ఎంతకాలము వరకు వైశ్యులు తమవర్ణస్థులకు విద్య చెప్పించక అజ్ఞానదశలో నుంచెదరో అంతవరకు బ్రాహ్మణులు వ్రాయుదూషణవాక్యములకును బోధించు శుష్కవేదాంతముల కును వైశ్యులువిశ్వాసముచూపివారిదాస్యములోనుండకతప్పదు. కాన అట్టి అజ్ఞానమును నిర్మూలమొనర్చునట్టి విద్యను వైశ్యు లలో ఉచితముగను నిర్బంధముగను (Free and Compul sory) సర్వత్ర వ్యాప్తిచేయించవలసిన బాధ్యత సంఘము వారిపై నిలిచియున్నదనుట నాయకులు మరువరాదు. ఈరహ

స్యమును గ్రహించక ఎచేట కాన్ఫరెన్సులను జరిపి ఆచరణలో పెట్టనట్టి ఎన్నిపాడితీర్మానములను కావించినను నేలను విడచి సాముచేసిన చందమగును. మరియు, బూడిదలో నేయిపోసిన కరణియగును. కాన వైశ్యులకు విద్య అవసరమగుచున్నది. విద్యకావలెనన్న ధనమవసరము. వేడుకలు, ఉత్సవములు, సప్తాహములు, యజ్ఞములు, బ్రాహ్మణ సంతర్పణలు, దేవాలయ మరమ్మతులు, యీపేర్లతో యాచకమునకు బయలు దేరువారికి వైశ్యులు ధనమును వెదజల్లెదరుగాని పరదాస్యము నశింపజేసి సర్వస్వాతంత్ర్యమును సర్వసంపదల నొసగూర్చు విద్యనిమిత్తమై యెంతగౌరవనీయులు వచ్చి ప్రార్థించినను ఒక్క పైసాగూడ ముష్టివేయరన్నవిషయము అందరకును ఎఱుకయే కాన వైశ్యులు దానములను గ్రహించి విద్యానిధిని పెంపుచేసి తమవర్ణస్థులకు విద్యాదానముచేయించి పుణ్యమును కట్టుకొనవలసియున్నారు. దానములను గ్రహించి స్వంతమునకై ఉపయోగించుకొనుటలో పరిగ్రహదోషముండునుగాని, దానమును గ్రహించి విద్యానిధికై తిరిగి యిచ్చివేయుటలో ఎట్టి దోషములేకపోగా పైనదెల్పిన శాస్త్రవచనమును బట్టి శాశ్వత బ్రహ్మలోకప్రాప్తి కలుగుననుట నిశ్చయము. కాన వైశ్యుల విముక్తికి విద్యానిధికై దానముల పట్టుట మొదటి మార్గము. పౌరోహిత్యమును చేబూని స్వసంఘ గౌరవమును, స్వాతంత్ర్యమును సంపాదించుట రెండవమార్గము. ప్రస్తుతపరిస్థితులలో యీ రెండు మార్గములను విడిచి తక్కిన మార్గములలో బడి ఎన్నితంటా లుపడినను వైశ్యవేదోక్తక్రియావిచార వ్యవస్థవంటి

దూషణగ్రంథములు వెలువడక తప్పవు. ఈ గ్రంథములు ప్రమాణములని బ్రాహ్మణులు వాదింపకమానరు. వీరి మాటలను శిరసావహించు వైశ్యులుకూడ బయలుదేరక పోరు.

వైశ్యసోదరులారా! కర్తవ్యమాలోచించుడు. "నాన్యః పంథాఽయనాయ విద్యతే"

ఓం తత్సత్.



# ద్వితీయరంగమునకు సంబంధించిన కరపత్రములు

## నెం 1 రు కరపత్రము.

### వైశ్యమహాశయులకు విజ్ఞాపనము.

---

బెజవాడ వర్తక బృందమునకు ఒక మనవి అను శీర్షకతో ది 16—10—32 తేదీన ఒక కరపత్రము వెలువడి తదనుసరణముగ వర్తకులందరు కొత్తగుళ్ళలో సమావేశమై, మల్లాది రామకృష్ణ చయనులవారి అధ్యక్షతక్రింద జరుగుచున్నసభలో పాల్గొనుచు, వారివలన ధర్మోపదేశములను పొందుచు, వారిని సత్కరించుచున్నారు. "వైశ్యులు వర్ణసంకరులయినారు'' అని వ్రాయబడిన గ్రంథమును సమర్థించుచు, యీ చయనులవారు మన వైశ్యబృందమును యిదివరలో దూషించియుండిరి. యిట్టివారితో ఎట్టి సంబంధమును కలుగ జేసికొనగూడదని యిదివరలో ఆర్యవైశ్యమహాసభా తీర్మానములు అయియుండెను. ఇట్టి స్థితిలో సదరు చయనులవారిని, యే విధముగను ఆర్యవైశ్యులు గౌరవించరాదని కాబడిన వైశ్య మహాసభవారి తీర్మానమును తిరిగితమకు జ్ఞప్తికి తెచ్చుచున్నాను.

బెజవాడ, ఇట్లు,
ది 16—10—32. కోట నాగభూషణం.

# నెం 2 రు కరపత్రము.

## వైశ్య మహాశయులకు విజ్ఞాపనము.

## మల్లాది చయనులవారిపై అవిశ్వాసము.

ఆర్యులారా !

పంచముల దేవాలయ ప్రవేశమును గురించి చర్చించుటకై వర్తకబృందము వారందరును తమ దుకాణములను మూసివేసి, క్రొత్తగుళ్లలో సమావేశము కావలెనని కోరుచు 16—10—32 తేదీన అద్దేపల్లి వెంకటప్పయ్యగారి పేరుతో ఒక నోటీసు జారీ చేయబడియుండెను. తాము సదరు నోటీసును వ్రాయించి యుండలేదని వెంకటప్పయ్యగారు చెప్పియున్నారు. మల్లాది చయనులును, వీరిచుట్టును చేరియున్న కొందరు సనాతన ధర్మవాదులును, యాలోచించి, దానిని అచ్చువేయించినట్లు కొందరు చెప్పుచున్నారు. కాని ఏది నిజమో, తేలలేదు. ఈ నోటీసునుబట్టి ఆనాటిరాత్రి యొక సభజరిగెను. అస్పృశ్యతనుగూర్చి చయనులవారును, మరి కొందరును యుపన్యాసములను గావించిరి. ఆ సభ తిరిగి 17వ తేది సోమవారం నాటికి వాయిదా వేయబడెను. వైశ్యులు పెక్కండ్రు మల్లాది చయనులవారి మహోపన్యాసమును శ్రవణము చేయుటకై వచ్చియుండిరి. వైశ్యులు కలియుగములో లేరనియు, ఒకవేళ కొందరున్నను, వారు సంకరులై

ణారనియు, మొదలగు నీచ వాక్యములతో వ్రాయడియున్న "వైశ్య వేదోక్త క్రియావిచార వ్యవస్థా" అను గ్రంథమును పురస్కరించుకొని ఈ మల్లాది రామకృష్ణ చయనులవారు ఇది వరలో వైశ్యులను బహిరంగముగ దూషించియుండిరి. ఈ కారణముచే, గుంటూరులో ఆర్యవైశ్య మహాసభవారు సమావేశమై చయనులవారి చర్యను ఖండించుచు, వారికి వైశ్యులు ఎట్టి సత్కారములను చేయరాదనియు, వారు కావించు యుపదేశముల నెవరును గ్రహించరాదనియు, వారితో ఎట్టి సంబంధముగాని, జోక్యముగాని కలుగజేసికొన రాదనియు, తీర్మానించియుండిరి. ఇప్పుడు క్రొత్తగుళ్ళలో చయనులవారు కావించుచున్న మతబోధయందు వైశ్యులు పాల్గొనరాదని, వైశ్యులతరపున యొక విజ్ఞాపనము వెలువడి, ఒక అపూర్వమైన సంచలనమును గావించియున్నది. చయనులవారియందు తమకెట్టి విశ్వాసమును లేదనియు, వారిని సత్కరింపరాదనియు, వారివాక్యములను శ్రవణమొనర్ప రాదనియు, 17వ తేదీన జరిగిన సభలో యొకతీర్మానము ప్రతిపాదింపబడి ఏకగ్రీవముగ నామోదింపబడియున్న సంగతి తమకు తెలిసియే యున్నది. ఈ చయనులవారు, ద్విజులలోచేరిన వైశ్య సంఘమును దూషించి యుండుటేగాక, అవతార పురుషులని ఖండఖండాంతరములందు పూజింపబడుచు, సర్వ మతములవారి యఖండ గౌరమునకు పాత్రులగుచున్న మహాత్మాగాంధిగారినికూడ వ్యక్తిపరముగ నిందించుటలో వీరు దిట్టయగుచున్నారు. వెనుక శారదా చట్టమును ప్రతిఘటించు విషయమై, ఈ చయన

బృందమువారు ఎవరి యండనుజేరి, ఎవరిని మహామహులని కొనియాడియుండిరో, అట్టి పండిత మదనమోహన్ మాలవ్యా వంటి బ్రాహ్మణ శిష్టాచార నిష్ఠాగరిష్ఠుని సహితము, వీరిప్పుడు దూషించుటకు వెనుకాడక యున్నారు. ఈ చయనబృందము వారు స్వార్థపరులై చీటికిమాటికి వైశ్యసంఘమువారిని, ఆశ్రయించుచు, వారిని లోబర్చుకొని వారివల్ల అన్నసత్రములను వేయించుకొనియు, వారిచేత గుళ్లు, గోపురములకును, పులిహోర నివేదనులకును, డబ్బు ఖర్చుపెట్టించియు, విందుల నారగించుచు, వైశ్యులను బొత్తిగా విద్యాశూన్యుల గావించి వారిని తమ పలుకబడిలో నుంచుకొని అణగద్రొక్కి యుంచి నారు.

వైశ్య వర్ణముపై, చయనులవారును, వీరి యనుచర బ్రాహ్మణ బృందమువారును ఆరోపించియుండిన, వర్ణసంకర దోషము పైన దెల్పిన "వైశ్య వేదోక్త క్రియావిచార వ్యవస్థా" యను దూషణగ్రంథముపై నాధారపడియున్నది. ఈ గ్రంథమును చయనులవారు మండనమొనర్చి యుండుట చేతను, వీరు ఆంధ్రదేశములో ప్రఖ్యాతపండితు లగుటచేతను, వైశ్యులపై మోపబడిననింద దేశము నందంతటను నలుదెసల వ్యాపించి, వీరి బోధలు వైశ్యుల పరువు ప్రతిష్ఠలకు భంగకరములగుటకు హేతుభూతములైయున్నవి. ఈకళంకమిట్లు గ్రంథరూపేణ శాశ్వతముగ నిలచియుండుటకు, యేపవిత్ర హృదయుండగు వైశ్యుడును సమ్మతింపజాలడు. ఇట్టి స్థితిలో చయనులవారిపై కేవల మొకయవిశ్వాస తీర్మానమును గావించి ప్రకటించినంత

మాత్రమున వైశ్యుల కర్తవ్యము ముగిసినట్లెంచుటకు వలను పడదు. ఈ గ్రంథము రద్దుపడక నిలిచియున్నచో, మను, పరాశర, యాజ్ఞవల్క్యాది స్మృతులవలె, స్వార్థపరులైన బ్రాహ్మణులు దీనినికూడ నొక ప్రమాణగ్రంథముగ పాటింప మొదలుపెట్టి, యికముందు దీనికి భాష్యములు, వ్యాఖ్యలు, టీకలు, మున్నగువాని నెన్నింటినో తయారుచేసి గోరంతలు, కొండంతలుగ చేయగల వీరాగ్రేసరు లయ్యెదరు. ఇప్పుడు అస్పృశ్యులుగ భావింపబడుచున్న 6 కోట్ల జనాభాగల మన హిందూసోదరుల గతి ప్రారంభమున, ఈవిధముగనే బయలు దేరినదని యూహించుట కవకాశము గలదు. అస్పృశ్యులను గూర్చి, వ్రాసిపెట్టబడియున్న, పూర్వపు గ్రంథములను యిప్పుడు ప్రమాణములుగ నెట్లు యెత్తి చూపుచున్నారో, అట్లనే కొన్ని పురుషాంతరములు గడచిన మీదట రాబోవు మన వైశ్యసంతతివారిపైన ఈసంకర గ్రంథమును ప్రమాణముగ నెత్తిచూపుటకు, ఈ చయనబృంద మహా పండితులు సంసిద్ధు లగుదురనుట కల్లగాదు. వైశ్యులు వర్ణసంకరులైరనుట యదార్థమే యైనచో, వారి గృహములలో పౌరోహిత్యముచేయుచు, తద్వారా ధనార్జనముచేసి జీవించుచున్న ఎందరో బ్రాహ్మణ పరిగ్రహీతలుకూడ ఈదాతలతోపాటు వర్ణసంకరులు కావలసి యుందురు. కాన వైశ్యుల క్షేమముమాట ఎట్లున్నను బ్రాహ్మణుల శ్రేయస్సునుగోరియైనను, మన చయనులవారు సదరు గ్రంథమును వెంటనే ఖండనమును వ్రాసి ప్రకటింపవలసి యున్నారు. వారట్లు జరుపుటకు బూనుకొననిచో,

వైశ్యులవలన, గో, భూ, హిరణ్యాది మహాదాన, షోడశదానా దులను గైకొనుచున్న సనాతన బ్రాహ్మణులైనను వెంటనే మేల్కొని, రానున్న చిక్కులను, నివారించుటకై, ఆ దూషణ గ్రంథమునకు ఖండనమును వ్రాయించి, వైశ్యుల ద్విజత్వమును, పవిత్రతను, స్థిరపరిపించవలసిన బాధ్యులై యున్నారు. వీరును అట్లు చేయుటకు నిరాకరించుచో, ఇక నుండి ఏ వైశ్యుడును బ్రాహ్మణులకు దానధర్మముల నీయ వలసిన బాధ్యుడు కాజాలడని స్పష్టముగ తెలుపవలసి యుం డును. దాతలు సంకరులైనప్పుడు దానము పట్టువారలును సంకరులే యగుదురుగదా? సంకరులు దానమిచ్చుట, అపాత్ర దానమగును. అపాత్రదానమునకు నరకవాసమే ఫలితము. ఈ విషయమై, శాస్త్ర ప్రమాణములను చూడదలచిన వారు "వైశ్య విద్యా భానూదయ" మను గ్రంథమును చిత్తగింపుడు. దురదృష్టవశమున దూషణ గ్రంథమును రద్దుపరచుటకు ధర్మ వ్యవస్థను చేయవలసిన బ్రాహ్మణులు పూనుకొనని యెడల, యికనుండి వైశ్యులు తమ దానధర్మములను, సత్కారము లను, వైశ్యవిద్యానిధి సంఘమువారికి సమర్పింపవలసియుందురు. ఈ వ్యవహారమును పరిష్కరించి, తీర్మానించుటకై ఆర్యవైశ్య మహాసభను ఆహ్వానించుట ఈ విజయవాడపురమునకు అవ సరమైయున్నది. ఈ విషయమై, ఏ వైశ్యుడును ఉపేక్షవహించి యుండరాదని నొక్కి వక్కాణించుచున్నాము.

ఎక్కడనో ఏదో జరుగుచున్నదని, కొందరు బ్రాహ్మ ణులు అరచినంతమాత్రముచే వర్తకసంఘమువారు వెంటనే

తమదుకాణములను మూసివైచి, తక్షణమే క్రొత్తగుళ్ళలో సమావేశము కావలయునని, అత్యవసర హుకుమొకదానిని జారీ చేయించిన, మన అద్దేపల్లి వెంకటప్పయ్య శ్రేష్ఠిగారు ఈ వైశ్యదూషణ గ్రంథమునుగూర్చి, ఈ పుర వైశ్యు లింత కాలము గగ్గోలుపెట్టుచు, చయనులవారి చర్యను నిరసించుచు తీర్మానములను కావించుచున్నను, పాపము వీరు చీమకుట్టి నంత చలనముకూడ చూపకయుండుట సంతాపకరము. శ్రీ చయనులవారు, ఆగ్రంథము సద్గ్రంథమేయనియు, అందులో తెలిపినట్లు వైశ్యులు సంకరులైనారనుట యదార్ధమేనియు, శ్రేష్ఠిగారికి నచ్చజెప్పి యుండవచ్చును. శ్రేష్ఠిగారు చయనుల వారి బోధలయందును, వారి వర్తనమునందును, విశ్వాసము కలవారై యుండవచ్చును. కాని అఖిలాంధ్ర ఆర్యవైశ్య మహా సభవారు చయనులవారిపైకావించిన అవిశ్వాస తీర్మానమును, వెంకటప్పయ్య శ్రేష్ఠిగారుకూడా గౌరవించవలెనని ప్రార్థించు చున్నాము. డబ్బు తీసుకొని గీతాభాష్యము చెప్పుట వేద విక్రయముకదా ? వేదవిక్రయము మహాపాతకమని శాస్త్రము బోధించు చున్నదిగదా? ఇట్టిపాతకములను చేసిన వారు, పరమ పవిత్రులగుట యేల? నేటికిని బ్రాహ్మణ భక్తి గలిగి, తమ వర్ణ ధర్మమైన వర్తకమును విడనాడక, యథా శక్తిధర్మకార్యము లొనర్చుచుండిన వైశ్యులుమాత్రము సంకరు లగుటయేల? ఇంతకును వైశ్యులు విద్యావిహీను లగుటచే, స్వజాతి గౌరవమును ఎట్లు పోగొట్టుకొనుచున్నారో క్రమేణ విదితమగుచున్నది. ఇందుకు ప్రతిక్రియ ఒక్కటియే కలదు.

వైశ్యులు తమ విద్యాభివృద్ధికై తీవ్ర ప్రయత్నములు కావించి, తమ రోషమును సార్థక పరచవలసియున్నారు. వైశ్యవిద్యానిధి సంఘమువారికి ఇకనుండి దాన ధర్మములను సమర్పించుటయే, దూషణ గ్రంథమునకు చేయతగిన ప్రతీకారము.

వైశ్య మహాశయులారా! లెండు. అదిగో, అరుణోదయమైనది. తూర్పు తెల్లవాఱబోవుచున్నది. విద్యాభాను డుదయించుచున్నాడు. ఇక నెంతకాలము మీరు దీర్ఘ నిద్రలోను, పరులదాస్యములోను, బంధింపబడి యుందురు? ఇతర సంఘము లిదివరకే మేల్కాంచి, తమ బంధవిముక్తిని బడయుచున్నవి. ఇట్లుండ ఈ వైశ్య సంఘము నొక్టన మాత్రమే శనైశ్చరుడు స్థిరవాస మేర్పఱచుకొని యుండుటేల? అధర్మబోధలపై అవిశ్వాసముజూపి, స్వసంఘోద్ధరణమును స్వయముగ జరుపుటద్వారా, దేశాభివృద్ధికి తోడ్పడుడు. మూఢ విశ్వాసములు వదలిపోవుటకు విద్యయే మూలము. కాన విద్యను ఆర్జించి ఆత్మస్వాతంత్ర్యసుఖమును అనుభవింపుడు.

"యతోధర్మ స్తతోజయః"

ఇట్లు విన్నవించు,

బెజవాడ,
21-10-32.

విజయవాడ వైశ్య మహాసభ,
వైదిక శాఖ.

# చయనులవారిని సమర్థించు కరపత్రము.




బ్రహ్మశ్రీ

## మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులుగారి యభిప్రాయము.

వైశ్యులలో కొంతమంది శ్రీ చయనులుగారిపై అవిశ్వాసమును కనుపరచు కరపత్రములు ప్రకటించుచుండిరి. వైశ్యులకు శ్రీచయనులువారు చేసిన అపకారమేమని ప్రశ్నించినచో సరియైన సమాధానము చెప్పువారు లేరుగాని విషయము తెలియక వారిని నిందించువారు చాలామంది గలరు. సంశయములను పోగొట్టుకొనుటకై మేము శ్రీ చయనులగారిని సందర్శించి ప్రశ్నించగా శ్రీవారిట్లు తెలియజేసిరి.

“రా॥ ఆత్మకూరి లక్ష్మీనరసింహంగారనే వైశ్యులు తమవంశములో అనేక తరములనుంచి ఆచరణలో లేకపోయిననూ వైదిక సంస్కారములను పొంది అవధానము చేయద

లంచెను. అప్పుడాదేశపు బ్రాహ్మణులిది మా సంప్రదాయమునకు విరుద్ధమని యాపనుల చేయించుట కంగీకరించరైరి. ధనాదిదానములచే కొందరిని వశపరచుకొని ఆయన వైదిక కృత్యముల నాచరించెను. అప్పుడు బ్రాహ్మణులలో కక్షలేర్పడెను. నానాదేశస్థులగు బ్రాహ్మణులు శ్రీజగద్గురు శృంగగిరి స్వాములవారికి, చాలాతరములనుండి యాచారము లేకపోయిననూ అట్టి వైశ్యు లిప్పుడు వేదోక్తక్రియల చేయవచ్చునా? అట్లు చేయించిన బ్రాహ్మణులతో సహభోజనాదులు మేము చేయ వచ్చునా? ఈ ధర్మసంశయమును తాము తీర్చవలయునని ప్రార్థించిరి. శ్రీవారు ధర్మాచార్యులు గాన వారి నిర్ణయములు "వైశ్యవేదోక్తక్రియావిచారవ్యవస్థ" యను గ్రంథరూపమున షుమారు 45 సంవత్సరములకు పూర్వము ముద్రింపించి ప్రకటించిరి. 'ఇప్పుడు కోమటులని వాడబడువారు అబాధితప్రతీతిని బట్టి వైశ్యులే యనియు, వైశ్యులకు వైదిక కర్మలయం దధికారము శ్రుతి స్మృతులయందు కలదనియు, కులదేవతయొక్క ఆజ్ఞవలననో, మఱి యే హేతువు వలననో మన యాంధ్రదేశ వైశ్యులయం దావైదికకర్మలు చాలా తరముల క్రిందనే నిలచిపోయిన వనియు, వైదికములైన గోత్రములు, వేదశాఖలు, కల్పసూత్రములు కూడా విస్మృతములైనవనియు, వీరి ధర్మములు సంకీర్ణములైనవనియు, (విశుద్ధయోనిబీజోత్పన్నులైన వైశ్యులిప్పుడు గాన్పించుటలేదు.)

అనగా వైదికసంస్కారములను పొందినతల్లికి, అట్టి వైదిక సంస్కారములను పొందిన తండ్రివలన కలిగిన సంతాన మిప్పుడు కనుబడుటలేదనియు, మూడు తరములనుంచి వైదిక సంస్కారములు లుప్తములైన యెడల నాల్గవతరము పిల్లవానికి ఉపనయనము చేయవలసివచ్చినచో, ఆపిల్లవాడు ద్వాదశ వర్షములు ఊరక గురుకులవాసము చేయవలయును. అటు తరువాత ఉపనయనములు లుప్తములైన తరముకు ఒక్కొక్క సంవత్సరము చొప్పున కొన్ని వ్రతములు చేయవలెననియు, అటుతరువాత ఉపనయనము జరుగవలెననియు, ఆపస్తంబధర్మ ప్రశ్నలయందు చెప్పబడియున్నది. వీరికి చాలాతరములు గడిచి నవి. కనుక ఇప్పుడు వైదికక్రియల నాచరించుటకు ధర్మశాస్త్ర ప్రకారము అధికారములేదు. వ్యర్థపుం బట్టుదలచేత చేసిన యెడల అది బాలక్రీడవంటి దగుననిశృంగేరిగిరిస్వాములవారు ఆగ్రంథమున వ్రాసిరి. శ్రీస్వాములవారు వైశ్యులను ఒకజాతి తల్లికిని మరియొకజాతి తండ్రికిని బుట్టిన సంకరులని అనియుండ లేదు. వీరు వైశ్యులనియే అంగీకరించిరి.

ఇటులుండ గుంటూరు శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు విజయముచేసి వెళ్లిన యనంతరము శ్రీవారికి భిక్షచేసిన కొందరు వైశ్యులు శ్రీశృంగగిరిస్వాముల వారిచే ప్రకటింపబడిన “ వైశ్యవేదోక్త క్రియాచారవ్యవస్థ ” యను గ్రంథమునకు మాకు అర్థముచెప్పవలసిన దని నన్ను అనేకవిధ

ములకోరిరి. పండితులకు కోరినవారి కోర్కెననుసరించి వారడి గిన గ్రంథములకు అర్థము చెప్పుట ధర్మముగాన అర్థము చెప్పుడని శ్రీపుష్పగిరి స్వాములవారునూ హెచ్చరించిరి. వారందరిమాటను నిరాకరించ లేక నేను గుంటూరు అగ్ర హారం శివాలయములో అనేక పండితుల సమక్షమున యీ గ్రంథమున కర్థము చెప్పితిని. నేను చెప్పిన యర్థములో ప్రమాదమున్న యెడల నిజమైన యర్థమును చెప్పుడని పండి తుల నడిగితిని. వచ్చిన పండితులలో "అవధానశిరోమణి శ్రీ కాశీకృష్ణాచార్యులుఁగారు మొదలగు పండితవరేణ్యులు గలరు. పండితు లందఱును నాయర్థమునే ఆమోదించిరి. వైశ్యులు సజాతీయు లనియు, చాలా యోగ్యులనియు, దేవబ్రాహ్మణ పోషకు లనియే నా యభిప్రాయము.

" అనేకతరములనుంచి లుప్తములైన వైదిక కర్మలను వీరు ధర్మశాస్త్రముల ననుసరించి ప్రాయశ్చిత్తాదుల జేయక యుల్లంఘించి చేయుట యుక్తముకాదని యీ గ్రంథమున తీర్మానము చెప్పబడినది. బ్రహ్మణ్యులును, మహాపండితులును రాగద్వేషాదిరహితులు నగు శ్రీ శృంగగిరి స్వాములవారు వైశ్యుల నెంతమాత్రము దూషించి యుండలేదు. శ్రీ శృంగ గిరిస్వాయులవారు వారిని కోరినవారికి ధర్మనిర్ణయముచెప్పిరి. నేను వైశ్యుల కోరికపైని వైశ్యులు తెచ్చిన యీ గ్రంథము నకు పండితసమక్షమున బహిరంగముగ అర్థముచెప్పితిని. కాని

వైశ్యుల నెంతమాత్రము దూషించియుండలేదు. ఇప్పుడు వైశ్యులకు వేదోక్తక్రియాధికారము కలదనిగాని, లేదనిగాని, నే నెంతమాత్రము చెప్పియుండలేదు. ఎవ్వరు ప్రశ్న జేయనిదే నే నట్లు నిర్ణయించుటకు నేను పీఠాధ్యక్షుడనుగాను గనుక నాకు వైశ్యులయందెట్టి యనాదరణయును లేదు.”అని శ్రీ చయనులవారు సెలవిచ్చిరి.

ఆసేతుహిమాచలమును ప్రసిద్ధులును, మహాపండితులు, శిష్టాగ్రగణ్యులు నగు బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణ విద్వచ్చయనుల వారిని దూషించుచు, వారియందు విశ్వాస రాహిత్య తీర్మానములు చేయుట, మహనీయులగు వారి గౌరవమున కెంతమాత్రము లోపము కలుగచేయదు. తమ కిష్టమైన విరుద్ధార్థములు చేసికొని సత్పురుషులను దూషించిన వారి యయోగ్యతనే వెల్లడించును. ఇట్టి స్వధర్మనిష్ఠులగు పండితులయందు అవిశ్వాస తీర్మానముచేసిన వారికి విశ్వాస పాత్రులెవరు ? పంచములను దేవాలయములలోనికి వదలుడనియు, వారితో సహభోజనములు చేయుడనియు, బోధించెడి వారలా మనకు విశ్వాసపాత్రులు ?

లుప్తములైన వైదికకర్మలను తిరుగ సంపాదించుకొని వంశములకు మహోత్కర్షము తేదలంచిన వైశ్యోత్తములు పంచమసంస్పర్శముచే దేవాలయములను, తమ కులములను అధఃపతనము పొందింప దలచుట యెంత హాస్యాస్పదమో

సూక్ష్మబుద్ధితో గమనింతురుగాక. ఒకప్పుడు కొన్నికొన్ని విషయములం దభిప్రాయభేదములున్నను వేదశాస్త్రములకు బద్ధులమై అన్ని వర్ణములవారము, అన్ని మతములవారము, ఒక్కుమ్మడి ధృఢప్రయత్నములుచేసి యిప్పుడు సంభవించ నున్న సకలకులధ్వంసకములైన ప్రయత్నములను ధ్వంసముచేసి కులధర్మములను కాపాడుకొని యిహపరసౌఖ్యములను నొంద వలెనుగాని, మహాపండితులపై ద్వేషించి తగు సహాయములేక మన కులధర్మముల నష్టపరచుకొనుట చాలా హానికరమని వినయముగా సనాతనధర్మ నిరతులగు వైశ్యమహాశయులకు మనవిచేయుచున్నవారము.

'వైశ్యవేదోక్త క్రియాచారవ్యవస్థ" యను గ్రంథ మును శ్రీ చయనులువారు రచించిరని కొందఱు వైశ్యులు తలచుచున్నారు. ఆ గ్రంథమున తమ యభిప్రాయమును ప్రకటించినది శ్రీ జగద్గురు శృంగగిరిస్వాములవారు గాని శ్రీ చయనులవారు కాదు.

కొందరికి సరిగా తెలియక, కొందరి కసలే, తెలియక, వైశ్యుల మనంబులగల సంశయములను పోగొట్టుటకై ఈ విషయమును బహిరంగముగ ప్రకటించితిమి. దీనిలో గుణము లున్నయెడల గ్రహింతురుగాక. లేదా క్షమింతురుగాక.

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణమహీం మహీశాః

గో బ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు."
యను వాక్యమును వైశ్యమహాశయులు గమనింతురు గాక !

"సత్యమేవ జయతి."

బెజవాడ,
4—11—1932.

ఇట్లు విన్నవించు,
చీదెళ్ళ నరసింహాంగుప్త.
తవ్వా వెంకటసుబ్బారావుగుప్త
(చయనుల వారి అనువరద్వయము)

# నెం 3 రు కరపత్రము

# వైశ్యమహాశయులకు విజ్ఞాపనము

—————:o:—————

## చయనులవారి అనుచరద్వయము

ఆర్యులారా! "వైశ్యులు" అనుశీర్షికతో 4-11-1932 తేదీన చీదెళ్ళ నరసింహం తవ్వా వెంకట సుబ్బారావుగార్లు ఒక కరపత్రమును ప్రకటించియుండిరి. చయనులవారి అభిప్రాయము అని ఈ వైశ్యసోదరులు కరపత్రమును ప్రకటించుట కంటె "ఆసేతుహిమాచల ప్రసిద్ధపండితుడు." అని వీరిచే బిరుదమునొందిన ఆ చయనులవారే ఆ కరపత్రమును ప్రకటించియున్నచో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటకు సరళిగా నుండెడిది. కాని ఆకరపత్రమున కయ్యేడి ఖర్చును చయనులుగారు భరింపవలసి వచ్చునని కాబోలు లేదా వైశ్యులమీాదకు వైశ్యులనే ప్రయోగించి గుంటూరునాటకమును బెజవాడలో కూడ జరుపవచ్చునని కాబోలు ఈ చయనులవారిప్పుడు భేదోపాయమార్గము చేపట్టినారు. వైరిని సాధించుటకు గల సామ, దాన, దండ, భేదోపాయములలో అతినికృష్టమైన భేదోపాయమును సామాన్యముగ రాజ్యతంత్రజ్ఞులు స్వీకరించెదరు. కాని దీనిని మతవిషయములలోకూడ చొప్పించుట విషాదకరము. గుంటూరు వైశ్యులు పుష్పగిరి పీఠమును బహిష్కరించినప్పుడు ఈ చయనులవారు ఆపీఠమునకు ఆస్థానపండితులుగ నుండి

చక్రము నాడించిరి. అప్పట్లో భేదోపాయసాధనము చేతనే ఆపీఠమువారు గుంటూరులోనున్న 15 వేలమంది వైశ్యులలో 5 గురు వైశ్యులను మాత్రము చీలదీసి వారినిదువ్వి బుజ్జగించి పాదపూజలను పేరుతో తమకు కావలసిన డబ్బునంతను ఈ 5 గురు వైశ్యులనుండి గుంజుకొని తమ పరివారజనమునకు గుఱ్ఱములకును లొట్టిపిట్ట వాహనాదికములకును మృష్టాన్న భోజనాదులకును విరివిగ ఖర్చుపెట్టి తమ కార్యక్రమమును కొనసాగించుకొనియుండిరి. పాపము ఆ 5 గురు గుంటూరు వైశ్యసోదరులును ఈచయనులవారి యధ్వర్యమున నడచు చుండిన, పీఠస్థుల కుతంత్రమునకు లోబడి, తమ ధనమును పలుకుబడిని, వ్యయమొనర్చుకొన్నదియే గాక స్వసంఘముపై తిరుగుబాటొనర్చినందుకు ఫలితముగ అనేక కష్టములకు బాల్పడి తుదకు పశ్చాత్తాపము నొందవలసి వచ్చినదంతయు శ్రీ చయనులవారును, వీరి యనుచర ద్వయమును మరచి యుండరు. గుంటూరులో జరిపిన భేదోపాయ తంత్రమునకేగతి పట్టెనో యిప్పుడు బెజవాడలో సాగింపదలచుకొనిన ఈ భేద తంత్రమునకును అట్టి దుర్గతియే పట్టుననుటకు సందియముండ నేరదు.

తాముగాని శ్రీ శృంగగిరి స్వాములవారుగాని వైశ్యుల నెంతమాత్రము దూషించియుండలేదనిగదా శ్రీ చయనుల వాక్యములను ఈ అనుచరద్వయము అచ్చొత్తించియున్నారు. గుంటూరు వైశ్యసంఘమువారు సమావేశమై శ్రీ చయనుల వారిపై అవిశ్వాస తీర్మానమును ఏల ప్రతిపాదించియుండిరి?

తక్కిన పట్టణములలోని వైశ్యులు ఏల అట్టి విశ్వాసరాహిత్య తీర్మానములను అనువదించియుండిరి? ఈసంగతులు ఈ యను చరద్వయమునకు తెలియవా? తెలియనిపక్షమున వీరు గుంటూరుకు వెళ్ళి అచ్చటి వైశ్య నాయకులతో సంప్రదించి యుండిరా? ఇట్టివేవియును జరుపకనే ఈ యనుచరద్వయము తొందరపడి చయనులవారి పక్షమునజేరి ఏల స్వసంఘతీర్మానములను నిరసింప మొదలిడిరి?

చయనులవారు సమర్థించియుండిన వైశ్యవేదోక్త క్రియావిచారవ్యవస్థా యను దూషణ గ్రంథమునందు వైశ్యులను వ్యక్తిపరముగను జాతిపరముగను దూషించిన వాక్యములనేకములుగలవు. ఈ చరిత్రయంతయు ఇదివరకే ఈ గ్రంథముయొక్క ప్రథమరంగమున వివరముగ ప్రకటింపబడియుండెను. కాని విషయము ఇప్పుడు పునరావృత్తియైనదిగనుక ప్రస్తుతము ఈ కరపత్రములో మచ్చునకు మాత్రము ఈక్రింది వాక్యము నుల్లేఖించుచున్నాము.

"కేచనవైశ్యాఃఅస్మాకం శ్రుతి స్మృత్యాదిభిః వేదోక్త మంత్రైః షోడశకర్మాణి యాగాది కర్మాణిచ, విహితాన్యస్మాభిర్బ్రాహ్మణాః నకారయన్తీత్యా గ్రహేణ స్వయముచ్ఛృంఖలాస్సంతః కతిచన బ్రాహ్మణాన్ ధనాదిభిర్వంచయిత్వా, స్వవశమానీయ, తద్ద్వారా వైదిక మంత్రైః షోడశకర్మాణి అత్యల్ప కాలమారభ్య కర్తుముపచక్రుః. తేషుకశ్చనలక్ష్మీ నరసింహానామకః గతవత్సరే అగ్న్యాధాన మపి చకారేతి కింవదంతీతి శ్రూయతే" దీనియర్థమేమి? "కొందరు వైశ్యులు

మాకు శ్రుతిస్మృతి విహితములైన షోడశకర్మలును యజ్ఞయాగాది క్రతువులును విహితములైయున్నను బ్రాహ్మణులు మాచే వాటిని చేయించుటలేదు. అని ఆగ్రహము కలవారై, ఆ వైశ్యులు బ్రాహ్మణులకు లంచమిచ్చి వారిని మోసగించి తమ వశముచేసికొని కొలదికాలమునుండియు వేదోక్త కర్మలను చేయ నారంభించిరి. వీరిలో లక్ష్మీనరసింహము అనువాడు గతసంవత్సరమున అగ్న్యాధానముకూడ చేసినాడని మాకు తెలియవచ్చినది." అని పై వాక్యములకు అర్థమైయున్నది. వైశ్యులచే అవతారపురుషులని కొనియాడబడుచుండిన బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులవారు తనకు వేదాధికారము లేనిదే కొందరు బ్రాహ్మణులకు లంచమిచ్చి వారిని మోసగించి అగ్న్యాధానము చేసినట్లు శృంగగిరి పీఠాధిపతులు స్పష్టముగ వ్రాసియుండగ ఈ చయనులవారు 4-11-1932 తేదిగల కరపత్రములో తన యనుచరద్వయము చేత ఏమి వ్రాయించిరి ? రాగద్వేష రహితులగు శ్రీ శృంగగిరి స్వాములవారు వైశ్యుల నెంతమాత్రము దూషించియుండ లేదు, అని చయనులవారు తెల్పిరి. లక్ష్మీనరసింహ సోమయాజులవంటి వారు బ్రాహ్మణులకు లంచమిచ్చి మోసగించి అగ్న్యాధానము జరిపియున్నారని వ్రాయుట దూషణము ఎంత మాత్రము కాదనియేగదా చయనులవారి యభిప్రాయము. ఇట్టి వాక్యమును పొరపాటున ఏవైశ్యుడైనను ఒక బ్రాహ్మణ పండితునిగూర్చి పలికియుండినచో ఇప్పుడు వైశ్యులకు శాంతమును బోధించుచున్న బ్రాహ్మణోత్తములందరును ఒక్క-

పెట్టునలేచి వైశ్యులభరతం పట్టించక యుందురా? లక్ష్మీనర సింహంగారొనర్చిన అగ్న్యాధానమునకు నానాప్రాంతముల నుండి 194 నూట తొంబది నలుగురు బ్రాహ్మణ పండితులు హాజరైరి. వీరు తమ సంతకములతో లక్ష్మీనరసింహంగారొన ర్చిన అగ్న్యాధానమునకు సమ్మతిపత్రముకూడ సమర్పించి యుండిరి. ఇంతమంది ఘనపండితులకు లంచమిచ్చి మోసగించి యుండిరని తెలిపిన వాక్యములయందు సత్యమేమైన కలదా? ఒకవేళ వైశ్యులపైగల ఈర్ష్యాసూయాదులచే వారట్లు పలికి యుండినను ఆలంచమును పుచ్చుకొన్నట్లు చెప్పబడినవారు బ్రాహ్మణులేగదా. లంచమిచ్చుట ఎంతనేరమో లంచమును పుచ్చుకొనుటయు అంతకంటె అధికనేరమేకదా! అధికనేర మొనర్చిన బ్రాహ్మణులను వదలిపెట్టి వైశ్యులు మెత్తనివాళ్లు గదాయని వారిపై దూషణవాక్యములను వ్రాయించి పైగా అయ్యవి నిర్దోషములని వాదించుటయా?

మల్లాది చయనులవారు ఆ సేతుహిమాచల ప్రసిద్ధ పండితులట! వారిపై యవిశ్వాసమును దెల్పుట చాలా హాని కరమని మన చీదెళ్ళ సోదరుడును, తవ్వాతనయుడును ఆగ్రహా యత్త చిత్తులగుచున్నారు. పండితుడనగా ఎవరు! ఎట్టి లక్షణ ములు గలవారికి పండితుడని పేరు! భాష్యాలను ఏకరువబెట్టు వారు పండితులు ఏంతమాత్రము కాజాలరు.

శ్లో॥ విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవశ్వపాకేచ, పండితా స్సమదర్శినః॥

అనగ, విద్యా వినయములుగల బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కను వండుకొని దిను చండాలునియందును సమభావమెవరికి గలదో, వారు పండితులనబడుదురు అని భగవద్గీత బోధించుచున్నది. చయనులవారియం దీ సమభావమును కనిపెట్టియేనా, మన చీదెళ్ళ సోదరుడు వారికి, ఆసేతు హిమాచల ప్రసిద్ధపండితు డని బిరుదము నొసంగినది? చయనులవారి పాండిత్యము, వారి యనుచరులకు మాత్రమే రుచించుచున్నది. లక్ష్మీనరసింహ సోమయాజులవారిని అన్యమతస్థులు సహితము కొనియాడు చున్నారు. లక్ష్మీనరసింహముగారు మద్రాసు విశ్వవిద్యా లయమునందు బి. ఏ. బి. యల్., పట్టములను ఉత్తమతరగతిని బడసియుండిరి. వీరుగవర్నమెంటువారి తరఫున పబ్లిక్ ప్రాసిక్యూ టరుగనుండి ఖ్యాతివహించిరి. బందరు, అమలాపురము, రాజ మహేంద్రవరము, గుత్తి, విజయనగరము, శ్రీకాకోళం నందియాల, చిత్తూరు, మున్నగు పట్టణములలో వీరు డిస్ట్రిక్టు మునసఫ్ హోదాను చలాయించి యుండిరి. వేదమును సాంగముగ, నధ్యయనమొనర్చిరి. విజయనగరం, మైసూరు సంస్థానాధిపతుల ప్రత్యేకాభిమానమును జూరగొనిరి. వీరు ఆంగ్ల, అమెరికన విద్యానిపుణుల మన్ననలకు పాత్రులైరి. 1878 సం॥లో అలహాబాదు, (ప్రయాగ) పట్టణమునందలి ఇంటర్నేషనల్ ఆర్డరుఆఫ్‌గుడ్ టెంప్లార్సు, అనగ నానాదేశ సుప్రసిద్ధ మతప్రచారక సంఘమువారు వీరికి "డి. జి. డబ్ల్యు. సి. టి." అను బిరుదము నిచ్చియుండిరి. అనగ డివైస్ గ్రాండ్

వర్డ్ కమాండింగ్ టెంప్లార్ అని పూర్తిబిరుదమై యున్నది. దీనికి తెనుగు అనువాదమేమి! ఆధ్యాత్మిక నైతికధర్మ ఘన ప్రచార యోధాగ్రేసరుడు అని దీనియర్థము. వీరు కృష్ణ యజుర్వేదమునకు జ్ఞానపరముగ అర్థమునువ్రాసిరి. బందరులో వేదపీఠమునుస్థాపించి, వేదవృక్షము నొకదానిని నిర్మించిరి. శతక్రతువులలోచేరిన అగ్నిష్టోమ మహాయాగమును, అహింసా పరముగ బృందావనపురమున అతివైభవముగ జరిపిరి. భగవద్గీతా గూఢార్థదీపికమున్నగు వేదవేదాంత గ్రంథముల నూతనముగరచించిరి. స్మార్తకర్మభాగమునంతను సులభముగ గ్రాహ్యమగునటుల, ప్రత్యేకముగ విభజించి ప్రచురించిరి. వీరు సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, జర్మన్ భాషలయందు అసమాన ప్రజ్ఞాధురంధరులు. మాక్సిముల్లర్ మున్నగు జర్మన్ వేదశాస్త్ర పరిశోధకులచే, వీరు గౌరవపత్రములను బడసియుండిరి. 1900సం॥లో ఉద్యోగమును చాలించి, గవర్నమెంటువారివలన ఉపకారవేతనమునుగైకొని, 1901 సం॥న వేదార్థ ప్రకాశికయను సంస్కృత మాసపత్రికను నడుపుచు తుదకు జ్యేష్ఠబహుళ ఏకాదశిమహాపర్వడి పుణ్యకాలమున వీరు తమభౌతికదేహమును చాలించి విష్ణుసాయుజ్యమునొందిరి.

ఇట్టి పుణ్యపురుషుడు బ్రాహ్మణులకు లంచమిచ్చి అగ్న్యాధానము చేసిరట. ఈమాటయందు దోషమేమియు లేదట. ఇది దూషణవాక్యము కాదట. చయనులవారి లాలన మాటలకును బుజ్జగింపు పలుకులకును మనచీదెళ్ళసోదరుడు వ్యామోహముజెంది మనవైశ్యసంఘమువారిపై తిరుగుబాటొ

నర్పుచుండుట దుస్సహా హేతువగుచున్నది. లోగడ విరూపాక్ష పీఠమువారు శ్రీలక్ష్మీనరసింహ సోమయాజులవారిని నిందించి నందుకు మద్రాసు హైకోర్టులో కేసుతుది తీర్పు కాబడి స్వాములవారికి రు200జరిమానా విధింపబడియుండెను. జరిమానా చెల్లింపనిచో 6మాసములు కారాగృహశిక్ష తీర్మానింపబడెను.

వైశ్యులకు శాస్త్రోక్తకర్మలునశించినవట. అందుచే వీరు సంకరులైరట, బ్రాహ్మణులలో యిప్పుడెందరు శాస్త్రోక్త కర్మలాచరించుచున్నారు? కర్మలను బొత్తుగా నెగబెట్టిన బ్రాహ్మణులనుగూర్చి ధర్మవ్యవస్థచేయజాలనివారు వైశ్యులనుగూర్చి మాత్రము గ్రంథములను ఏల వ్రాయవలసి వచ్చెను?

అధర్మప్రవర్తకులనుగూర్చి ధర్మవ్యవస్థను చేయజాలని పండితోత్తములు, వైశ్యులకు గోత్రసూత్రములు లుప్తమైనవనియు పరిశుద్ధ యోనిబీజముల కుద్భవించిన వైశ్యులు లేరనియు వీరికి ప్రాయశ్చిత్తములుకూడ పనికిరావనియు మున్నగు దూషణవాక్యములు వైశ్యులవిషయమై ఘంటాపథముగ వాడుచుండుటయేగాక ఈ దూషణవాక్యములను చూచియు వినియు ఏపరిశుద్ధవైశ్యుడైనను రోషపడేయెడల ఆ వైశ్యునికి అర్థము తెలియక ఆగడము చేయుచున్నాడనియు తామే సర్వజ్ఞులమనియు విజ్ఞప్తిగుచుండిన పండితంమన్యుల మాటలను విశ్వసించుచున్న వైశ్యులు పరమ పవిత్రులైన మామిడి వెంకటార్యులవారియొక్కయు ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజుల

గార్లయొక్కయు జన్మకారణమైన వైశ్యజాతికి కళంకము కలుగ జేయుచున్నారనుటలో అతిశయోక్తి యేమియు లేదు.

వైశ్యులకు వేదాధికారము లేదనియు, సంకరులైనా రనియు, క్రమవిచారణలేకుండ తీర్మానించియున్న అనేక రాక్షసాధములతో ధర్మయుద్ధముచేసి తను, ధన, ప్రాణము లను ధారవోసి వైశ్యులకు ద్విజత్వమును స్థిరపరచి దిగ్విజయ మును సంపాదించి యిచ్చిన బ్రహ్మశ్రీ మామిడి వెంకటా ర్యులవారి యొక్కయు ఆత్మారి లక్ష్మినరసింహ సోమయాజుల వారియొక్కయు ఋణమును దీర్చుకొని కృతార్థులమగుట యెట్లని మనము పరితపింపవలసియుండగ అట్టి ఋణమునంతను గంగలో కలిపి పైగా వైశ్యులకు గోత్రసూత్రాలు నశించి చాలాతరములు గడచిపోయినవి, గనుక ప్రాయశ్చిత్తములను చేసికొనయత్నించుట కూడ వ్యర్థపు పట్టుదల యనియు బాలక్రీడ వంటిదనియు, వ్రాసిన వ్రాతలను సమర్థించుచు పైకిమాత్రము వైశ్యులు దేవబ్రాహ్మణ పోషకులు అని స్వీయాభిప్రాయ పురస్సరంబులగు ఇచ్చకపు మాటలను వెదజల్లుచున్న వేద విక్రయ దారుల వలలో మనముచిక్కి సంఘమును నిరసిం చుట పాడియా? పామునకు పాలుపోసి పోషించుట యెట్లో ఇట్టి అవిశ్వాస పాత్రుల బోధలకు చెవియొగ్గుటయునట్లే. మహాత్మాగాంధిని దూషించుటకు వెఱవనివారు, పండిత మాలవ్యాను నిందించుటకు లజ్జింపనివారు, తమ వర్ణమే పవి త్రమైనదనియు తక్కిన వర్ణములవారు కర్మభ్రష్టులై పతితులై రనియు పుక్కిటపురాణ శాస్త్రాధారములను చీటికి మాటికిని

చూప ప్రియత్నించువారు తక్కిన వర్ణములవారి శ్రేయస్సును వాంఛించెదరనుట కల్ల. పైగా తక్కినవర్ణములవారు తమ స్వతంత్రశక్తి సామర్థ్యములచే తమ సంఘములను బాగుపరుచు కొనుట మూలముగ దేశాభివృద్ధికి పాటుపడుచుండు ప్రియత్నములకు వీరు అడ్డుదగులుచు తమయధికారమును నిలువ బెట్టుకొనుటకును స్వార్థమును పోషించుకొనుటకును పెనుగు లాడుచున్నారు.

ఇతరుల కండ్లలోని నలుసులను ఏరువారు తమకండ్ల లోని దూలములను ఏలపీకివేయరాదు?

"వైశ్యవేదోక్త క్రియావిచార వ్యవస్థా"యను గ్రంథము యొక్క పవిత్రతను గూర్చి చయనులవారు ఎంత బల్లగుద్ది వాదించినను వారి మాటలకు మోసపడి విశ్వసించు వైశ్యులు ఒకరిద్దరేమైనా చయనులు వారికి ఈతరములో దొరకవచ్చు నేమో కాని రాబోవు వైశ్యసంతతివారు మాత్రము వారి యెడల సంపూర్తిగా అవిశ్వాసమును వెలిబుచ్చకమానరు. విద్యాలోపము వలననే వైశ్యులు అన్యులకు దాసానుదాసులై ఆత్మగౌరవమును పోగొట్టుకొనుట తటస్థించుచున్నది. కాన వైశ్యులు వెంటనే తమబిడ్డలకు విద్యాదానమొనర్చి స్వార్థపరులయొక్క దాస్యమునుండి విముక్తులై ఆత్మస్వాతంత్ర్య సుఖమును బడయుదురుగాక! యతోధర్మస్తతోజయః

ఇట్లు విన్నవించు,

బెజవాడ,
9-11-32.

విజయవాడ వైశ్యమహాసభ,
వైదిక శాఖ.

నెం 4 రు కరపత్రము.

# మల్లాది చయనులు—వేదవిక్రయము.

[ హే. కొం. శర్మగారి సవాలు. ]

ఆంధ్రదేశ సనాతన వర్ణాశ్రమ ధర్మ సభాపక్షమున 9-2. 1933 తేదీన శ్రీ హేమాద్రి కొండలరాయశర్మగారు నా ఖండనమునకు, ముండనమును తయారుచేసి ప్రకటించిరి. అందులో వారిట్లు తెలిపియుండిరి.

" వేదవిక్రయము" (భృతకాధ్యయనము)

"అనగా మొదటే కరారుచేసికొనుట. అదికూడదు. శిష్టులైనవారు అట్లుచేయరు" అని శ్రీ శర్మగారు ఎలుగెత్తి చాటిరి. ఈ సందర్భమున, ధర్మశాస్త్రబద్ధులమసియు, శిష్టాగ్రగణ్యులమనియు, మన చీదెళ్ల సోదరుడు తవ్వా తనయుల ద్వారా 4—11—32 తేదీన ప్రకటించుకొనియున్న శ్రీ మల్లాది రామకృష్ణ చయనుల వారియొక్క ఈ క్రింది ప్రవర్తనము ఎంతవరకు శాస్త్రబద్ధమై యున్నదో ప్రాజ్ఞులు తెలుపవలసియున్నారు.

గుంటూరుజిల్లా వేటపాలెం గ్రామమున, ప్రసిద్ధిబడసిన "సారస్వత నికేతనము" అనునొక గ్రంథాలయముకలదు. ఈ గ్రంథాలయం మేనేజరుగారు తమ గ్రంథాలయమునందు శ్రీ రామకృష్ణ చయనులవారిచేత, గీతాధ్యయనము ఉపనిషద్ధర్మబోధమునుగూర్చి కాలక్షేపమును జరిపింపగోరి శ్రీ చయనుల వారి పేర జాబును వ్రాసియుండిరి. ఇందు కీ క్రింది విధముగ

శ్రీ చయనులవారు జవాబును వ్రాయుచు, తమకును, తమ శిష్యునకును, రానుపోను ఖర్చులుభరించి రు 25-0-0 ఇరువది అయిదు రూపాయలకు తక్కువలేకుండ తమకు పారితోషిక మును చెల్లించినగాని, కాలక్షేపమును జరుపుటకు సమ్మతించము అని తెలిపియుండిరి. ఈజాబును ఆమూలాగ్ర ముగ నీదిగువ నుల్లేఖించుచున్నాను.

---

(పోష్టుకార్డు)

ది 16—9—32

బెజవాడ.

మహారాజశ్రీ వేటపాలెం సారస్వతనికేతనం, మానేజరు గారికి.

మల్లాది రామకృష్ణ విద్వచ్చయనులుగారి శిష్యుడు అంబడిపూడి విశ్వనాధ సిద్ధాంతి వ్రాయుమనవి:—

తమ సంఘముతరఫున మహారాజశ్రీ శ్రీనివాసరావు గారు యీ నెల 28వ తేదీన శ్రీ చయనులగారిని ఉపన్యా సించుటకు రమ్మనమని వ్రాసియుండిరి. వారు స్వయముగ ప్రచారమునకు బయలుదేరిన సమయమునందు తప్ప ఇతర సమయములలో వారిని ఉపన్యాసమునకు పిలిచినప్పుడు వారికి ఒక విద్యార్థితో సహా రానుపోను ఖర్చులకు యిచ్చి రు 25—0—0 యిరువైఅయిదు రూపాయలకు తక్కువ లేకుండా సత్కరించుట జరుగుచున్నది. తమ సంఘమువారును అటులనే జరుపుటకు యేర్పాటు చేసికొనిన యెడల వారి

రాకను అపేక్షించి వెంటనే ప్రత్యుత్తరం వ్రాయవలసినది. లేని, యెడల వారు రాపీలుండదు. యీసంగతి తమకు తెలియదని విశదపర్చుకున్నాను.

అం. విశ్వనాథ సిద్దాంతి

(అనియున్నది.)

అడ్రసు:—అంబడిపూడి విశ్వనాథసిద్ధాంతి,

బెజవాడ, గోపువారిసత్రం.

.........................................................................

---

ఆర్యులారా!

తమ మతమును తాము ప్రచారము సేయుటకై కూడ డబ్బు నడుగువారు లోకమున నుందురా? పాపము చయనుల వారు యీవిషయమై కటాక్షించినందుకు మహోపకార మొనర్చినట్లెంచవచ్చును. కాని తక్కిన సమయములలో రు 25 లు వంతున ముందుగా బేరము ఫైసలు అయితేగాని కాలు కదల్పరట-ఇట్లు జరుపుట శ్రీ కొండలరాయ శర్మ గారు తమ ముండనములో తెలిపిన ప్రకారము,

## వేదవిక్రయము (భృతకాధ్యయనము)

అగునా? కాదా? ఈధర్మశంకనుగూర్చి న్యాయవాదులును ధర్మశాస్త్రవేత్తలును ధర్మవ్యవస్థాపకులును 16 వ ఆర్యవైశ్య మహాసభవారును ఇతర మిత్రులును తమ తమ యభిప్రాయములను ప్రకటింప ప్రార్థితులు. మరియు,

(1) శ్రీ కాశీబ్రాహ్మణ పండిత మహాసమ్మేళనమువారును.
(2) శ్రీ భారత వర్ణాశ్రమ స్వరాజ్య సంఘ మహాసభ వారును,
(3) గురువాయూరు వర్ణాశ్రమ స్వరాజ్యసంఘ విశేషాధివేశన మహాసభవారును,
(4) మద్రాసు వైదిక మహాసభవారును,

జాతిచండాలురను గూర్చి విశేషముగ బాధపడుచున్నారు గాని, కర్మచండాలురను గూర్చి చర్య తీసికొనినచో ధర్మము అడుగంటక యుండునుగదా.

బెజవాడ,
20—3—33

ఇట్లువిన్నవించు,
ఆలపాటి సుబ్బారావు గుప్త.

# యథార్థకథనము

(మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులు.)

కొన్ని దినముల క్రిందట నాంధ్రపత్రిక లోనను, 19, జూను త్రిలింగలోనను శ్రీ జగద్గురు శృంగగిరి పుష్పగిరి పీఠాధ్యక్షులును, శ్రీ పుష్పగిరి సంస్థాన పండితుఁడ నగు నేనును, వైశ్యులకుఁ బ్రతికూలురుగా నుండుచున్నట్లు భావించి వారు కొన్ని తీర్మానములు చేసుకొనినట్లు ప్రకటింపఁబడి యున్నది. నిజము తెలియఁజేయుట యుక్తముగాన నే నీవిషయమును బ్రకటించుచున్నాఁడను.

దాదాపు 40 సంవత్సరముల క్రింద డిస్ట్రిక్టు మునసబు ఉద్యోగమందుండిన శ్రీయుత ఆత్మకూరి లక్ష్మీనరసింహాము శ్రేష్ఠిగారను నొక వైశ్యుం డనేక పురుషాంతరములనుండి తమ వంశమం దాచరణములో లేని వైదిక ధర్మములను బలుకుబడినిబట్టి కొందరు బ్రాహ్మణుల సహాయముతో నాచరించెను. ఇట్లు చేయుట శాస్త్రీయమా కాదా యని దేశమందు ధార్మికులలో వివాదము కలిగెను. కొందఱు శిష్యులు ధర్మసంశయగ్రస్తులై మాకీవిషయమై శాస్త్రీయమగు నిర్ణయమును దయచేయుఁడని శ్రీ జగద్గురు శృంగగిరి పీఠాధ్యక్ష శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ స్వాములవారికి విజ్ఞాపనములనంపిరి. శ్రీ స్వాములవారు జగత్ప్రసిద్ధులగు మహాపండితులు శమదమాది సంపన్నులు.

శిష్యుల ప్రార్థన ననుసరించి, ప్రతిశిష్యునకుఁ బత్రిక వ్రాయుట శ్రమయనియెంచి వారు 'వైశ్యవేదోక్తక్రియావిచార వ్యవస్థ' యని యొక గ్రంథము రచియించి ప్రకటించిరి. వైశ్యులకు ధర్మశాస్త్రములందు వేదోక్త క్రియాధికారము కలదు. అయిన నెన్నియో తరములనుండి యీదేశమందలి వైశ్యులకు వైదికకర్మానుష్ఠానము నిలిచిపోయినట్లు వారి కన్యకాపురాణము మొదలగు వానివలనను, ఆచారమువలనను స్పష్టమగుచున్నది. వీరి ప్రాకృత గోత్రములు స్మృతులలోఁ గనుపించవు. ఎవరిది యేగోత్రమో యేసూత్రమో యేవేదమో యను విషయములను నిర్ణయింప వీలుకనుపించదు. ఆపస్తంబ ధర్మసూత్రానుసారము తరమున కొకొక్క సంవత్సరము ప్రాయశ్చిత్త మాచరింపఁజేసి యటుపై నుపనయనాదులు చేయించుటకైనను నూఱుతరములకు మించునట్లు గనుపించుచున్నది. ఈ ప్రాయశ్చిత్తములకుఁ బ్రతినిధిని శాస్త్రకారులు చెప్పియుండలేదు.

మనకుఁదోఁచినట్లు చేసినచో నశాస్త్రీయము నిష్ఫలము నగును. కనుకఁ దమ పితృ పితామహ ప్రపితామహుల యాచారము నవలంబించి పౌరాణి సంస్కారములతోఁ దృప్తి నొందుచుఁ దమకు విహితములగు ధర్మముల నాచరించుటయే యిప్పటి వైశ్యులకు శ్రేయస్కరమని యనేక ప్రమాణప్రదర్శన పూర్వకముగా నాగ్రంథమున నిరూపింపఁబడినది. వారికెవ్వరియందుఁను ద్వేషమునకుఁ గారణము లేదు. ఇది ధర్మనిర్ణయమునకై వ్రాయఁబడినదిగాని ద్వేషమూలకము కాదు.

శ్రీ జగద్గురు పుష్పగిరి పీఠాధ్యక్షులును దమ్ముఁ బ్రశ్నిం చినశిష్యులకిట్లే యాజ్ఞయిచ్చియుందురు. ఇట్లువారికి శాస్త్రీయ మని తోఁచిన యంశమును నిష్పక్షపాతముగ బోధించుట ధర్మాచార్యులకు విధియైయున్నది.

—♦ ఇంకనా సంగతి ♦—

ఇంచుమించు 7 సంవత్సరముల క్రింద శ్రీపుష్పగిరి పీఠాధ్యక్షులు గుంటూరు పట్టణము సంచారముచేయు సందర్భమున శ్రీవారికి భిక్షలంజేసిన శ్రీయుత లింగమల్లు రామచంద్రయ్య గారు దొడ్డా వెంకటరత్నముగారు మొదలగు వైశ్యులు శ్రీ శృంగగిరివారు ప్రకటించిన గ్రంథమునకు నన్నర్థము చెప్పుఁడని యనేక పర్యాయములు మాగ్రామమగు నమరావతికి మోటారును బంపి కోరఁగా రెండుపర్యాయములు వీలులేక పోయినను మూఁడవపర్యాయము వారికోరిక విఫలముచేయుట భావ్యము కాదని వచ్చి యారు దినములు గుంటూరు అగ్రహారము శివాలయమున బహుపండితుల సమక్షమున దాదాపు వేయిజనులుగల సభలో నర్థము చెప్పితిని. దీనిలోఁ బ్రమాద మున్నచో సవరింపుఁడని పండితులఁ గోరితిని. వారందఱు నేను జెప్పిన యర్థమే యాగ్రంథమునఁ గలదని యంగీకరించిరి. కోరినవారికి వారు తెచ్చిన గ్రంథమున కర్థముచెప్పుట పండితుల కృత్యము. దీనియందు ద్వేష మేమియు లేదు. శ్రీ శృంగగిరి స్వాములవారి నిర్ణయ మిప్పుడు వైదిక క్రియలనే యాచరించవలెనని యెంచెడి వైశ్యుల యభిప్రాయములకు విరుద్ధములై యుండును. దానికి మనమేమి చేయఁగలము? వారు శాస్త్రీను

సారముగాఁ జెప్పిరి. ఇష్టమైనచో వినవచ్చును. లేదా మాన వచ్చును. గురుధిక్కారము గాని బ్రహ్మద్వేషముగాని యెన్న టికిని శ్రేయోదాయకములు కావు.

క్షాత్రబలము తగ్గిననాఁటినుండి ధనసహాయ్యముచే దేవ స్థానములను అన్నసత్రములను అనేక బ్రాహ్మణ కుటుంబము లనుబోషించుచుఁ దమ వంశపరంపరాప్రాప్తపౌరాణిక సంస్కార ముల నందుచు బ్రాహ్మణులచేఁ గ్రతువులఁజేయించి తనూ్మల మున సుకృత మార్జించుచుండెడి వైశ్యులయందు శ్రీపీఠా ధ్యక్షులకును, నాకును సంపూర్ణాదరము కలదు. అట్టి వైశ్యుల సంతతికిఁ జెందినవారైకూడ శాస్త్రనియమముల నుల్లంఘించి తమకుఁ దోఁచినట్లు వర్తించుటయు గురుభక్తిని బ్రాహ్మణ భక్తిని గోలుపోవుటయు బెజవాడ ఆర్యవైశ్యమహాసభయందు పై తీర్మానముల నంగీకరించిన సభ్యులకు శ్రేయోదాయకము కాదనిమాత్రము వారి హితమునకై బోధించుచున్న వాఁడను. కొందఱిట్టివార లున్నను బెజవాడలోనేమి దేశమందంతట నేమి గురుదేవతాబ్రాహ్మణభక్తులగుచు నవీనులు సూచించు పెడత్రోవలకు సమ్మతించక శ్రుతి స్మృతిశిష్టాచార నిరతులగు వైశ్యులు 100 కి 95 మందికిఁ దక్కువలేకుండఁ గలరనియే మాకు నమ్మకము.

ఇట్టి నవయువకులకును వారి యిష్టదేవతయే సద్బుద్ధి నొసంగుఁగాత,

బెజవాడ, 21-7-33.

ఇట్లు ధార్మికజన విధేయుఁడు,
మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులు,

# నెం 6 రు - కరపత్రము.

## మల్లాది రామకృష్ణ చయనులవారికి

### (బహిరంగ లేఖ.)

"యథార్థకథనము" అనుదానికి జవాబు.

అయ్యా!

శృంగగిరి పీఠాధిపతులు వ్రాసిన గ్రంథమునందు వారు వైశ్యుల నెంతమాత్రము దూషించియుండలేదనియు, ఆ గ్రంథమును పురస్కరించుకొని మీరు వ్యవహరించియుండ లేదనియు, మీరు శ్రీయుత అద్దేపల్లి వెంకటప్పయ్యశ్రేష్టిగారి తో చెప్పినట్లు వారు వెల్లడించుచున్నారు. ఇయ్యది ఎంతవరకు సత్యమో పీఠాధిపతులు వ్రాసిన గ్రంథములోని దూషణ వాక్యములను వీనినిసమర్థించుచు మీరువ్రాసిన వాక్యములను యీక్రింద సంగ్రహముగ తెలుపుచున్నాము.

పీఠాధిపతులు వ్రాసిన గ్రంథములోని వాక్యములు.

1. వైశ్యులు కలియుగమునందు పూర్తిగా నశించినారు.
2. ఇట్లు నశించిపోగా నిలిచియున్నవైశ్యులు సంకరజాతివారు.
3. వైశ్యులు గాయత్రీ భ్రష్టులు.
4. వీరికి ఋషిగోత్రసూత్రములు నశించినవి.
5. వీరు పురాణోక్తకర్మలను చేయుచుండుటచే అతినీచ వృత్తిలో నున్నారు.
6. వీరిని తిరిగి సంఘములో కలుపుకొనుటకు ప్రాయశ్చిత్త ములుకూడ లేవు.

7. ఇటీవల కొందరు వైశ్యులు బ్రాహ్మణులకు లంచముల నిచ్చి వారిని మోసపుచ్చి వారిచే నూతనముగ వేదోక్త కర్మలను చేయించు కొనుచున్నారు.

8. వీరిలో ఆత్మూరి లక్ష్మీనరసింహం అనువాడు అగ్న్యాధానముకూడ చేసినాడు.

ఈప్రకారము పీఠాధిపతులువ్రాసిన వాక్యములందు దోషమేమియు లేదనియు, యివిశాస్త్రసమ్మతములై యున్నవనియు, యిందుకు విరుద్ధముగ వైశ్యులు మాట్లాడినచో గురుధిక్కారము, బ్రహ్మద్వేషము సంభవించి చెడిపోయెద రనియు, మీరువ్రాసిన యీక్రింది కరపత్ర వాక్యములను గమనింపుడు.

మల్లాది చయనులవారి సమర్థింపు వాక్యములు.

(16—9—29 చయనులవారి కరపత్రము.)

1. శృంగగిరి స్వాములవారు వైశ్యులు వర్ణసంకరులనిగాని, మరి యేవిధముగాగాని దూషించియుండలేదు.

(21—7—33 తేది చయనులవారి కరపత్రము.)

2. శృంగగిరి పీఠాధిపతుల గ్రంథము ప్రమాణ ప్రదర్శన పూర్వకముగా నిరూపింప బడినది.

3. ఇది ధర్మనిర్ణయమునే చేయుచున్నదిగాని ద్వేషమూలకముగాదు.

4. ఈగ్రంథము శాస్త్రీయాంశములను నిష్పక్షపాతముగా బోధించుచున్నది.

5. పీఠాధిపతుల నిర్ణయము వైశ్యుల యభిప్రాయమునకు విరుద్ధమై యుండవచ్చును. దానికి మనమేమిచేయగలము? పీఠాధిపతులు శాస్త్రానుసారముగ చెప్పిరి. వైశ్యులకు యిష్టమైనచో వినవచ్చును. లేదా, మానవచ్చును. (కాని, ప్రతిఘటించినచో) గురుధిక్కారము బ్రహ్మద్వేషము సంభవించును. ఇది యెన్నటికిని వైశ్యులకు శ్రేయోదాయకము కాదు.

అని పీఠాధిపతుల దూషణగ్రంథమును మీరు స్పష్టముగ బలపరచియున్నారు. వైశ్యులకు ప్రాయశ్చిత్తములు పనికిరావను మున్నగు దూషణవాక్యములను మీరు ఋజువు చేసెదరా? అట్లుచేయనియెడల పీఠాధీపతులు వ్రాసినగ్రంథము ద్వేషపూరితమైయున్నట్లు మీరు యథార్థకథనము చేయుటకు సమ్మతించెదరా? మీనుండి యీవిషయమును వినగోరుచున్నాము.

ఇట్లు విధేయులు,
విజయవాడ వైశ్యమహాజనులు.

---

# నెం 5 రు - కరపత్రము.

## మల్లాది రామకృష్ణ చయనుల వారికి రిజిష్టర్డు నోటీసు.

అందుపైన జరిగిన చర్య:—

స్వస్తిశ్రీ శ్రీముఖనామసం॥ భాద్రపద బ 30 మంగళ వారము ది 19—9—33 సాయంత్రం 6 గంటలకు బృందా వననగర వైశ్యమహాజనులు శ్రీలక్ష్మీనృసింహసోమయాజి వైశ్య సమాజ భవనమున మ॥రా॥ శ్రీ వెలుమూరి సూర్యనారాయణ బి. ఏ. బి. యల్ గారి అధ్యక్షతక్రింద సమావేశమై కావించిన తీర్మానము:—

"విజయవాడ వైశ్యమహాసభవారు మల్లాది రామకృష్ణ చయనులవారికిచ్చిన ది3—9—33 గల రిజష్టర్డు నోటీసును ఆ నోటీసు ముట్టినట్లు చయనులవారి సంతకముగల 7-9-33 తేదీ పోస్టు రసీదును, యీసభలో చదవడమైనది. వైశ్యులు సంకరులైనారనియు, వీరిని తిరిగిసంఘములో కలుపుకొనుటకు ప్రాయశ్చిత్తములు కూడ లేవనియు, శృంగగిరి శంకరాచార్యులవారు వ్రాసిన వైశ్యదూషణ గ్రంథము యథార్థముల్ల బోధించు ప్రమాణ గ్రంథమనియు, దీనిని ప్రతిఘటించు వైశ్యులు బ్రహ్మద్వేషులై శ్రేయస్సును గోల్పోయెదరనీయు మల్లాది రామకృష్ణ చయనులవారు ప్రకటించిన "యథార్థకథనము" అను కరపత్రములోని అంశములు ఎట్లు యథార్థములైనవియో ఋజువు చేయుటకు చయనులవారికి

గడుపీయబడినను, వారు ఋజువు చేయజాలక మిన్నకుండిరి. చయనులవారు లిఖిత వాగ్రూపముగ ప్రచారము గావించు చున్న జాతిద్వేష, జాతిప్రతిష్టాభంగకర వాక్యముల యదార్థ మును ఋజువుచేయజాలకపోయినందున చయనులవారి దురు ద్దేశ్యము (Wrongful intention) తెల్లమగుచున్నదని యి సభవారు అభిప్రాయపడుచు యీవిషయమును 16వ ఆర్య వైశ్యమహాసభవారి దృష్టికిని తక్కిన పురములలోని వైశ్య సంఘములవారి దృష్టికిని తేగలందులకై యీసభవారు యీ సభాధ్యక్షునకు యిందుమూలముగ నధికారమిచ్చుచున్నారు"

—రి జి స్ట రు నో టీ సు— బె జ వా డ

—౦— 3—9—33"

శ్రీ మల్లాది రామకృష్ణచయనులవారికి—

విజయవాడ వైశ్యమహాసభ కార్యదర్శి కోట నా భూషణంగుప్త యిందుమూలముగ తెలియజేయడ మేమనగా

అయ్యా, శ్రీశృంగగిరి స్వాములవారు వైశ్యవర్ణమును అవమాన పరచవలెనని దురుద్దేశ్యముతో వ్రాసి ప్రకటించిన వైశ్యవేదోక్తక్రియావిచారవ్యవస్థ అను దూషణగ్రంథములోని శ్రీస్వాములవారి నిర్ణయములు శాస్త్రానుసారముగ నున్న వనియు, ప్రమాణ ప్రదర్శనపూర్వకముగ నిష్పక్షపాతముగ తెలుపబడిన వనియు, మున్నగు సంగతులతో మీరు 21—7—33 తేదీన "యదార్థకథనము" అను నొక కరప మును వ్రాసిప్రకటించి యున్నారు. శృంగగిరి స్వాములవా

వైశ్యులను గూర్చి వ్రాసిన దూషణవాక్యములను, ఆనిర్ణయ ముల నామోదించుచు మీరువ్రాసి ప్రకటించిన యదార్ధకథ నములోని వాక్యములను సంగ్రహాముగ తెలుపుచు మేము గుటీవల బహిరంగలేఖ నొకదానిని అచ్చొత్తించి ప్రకటించి యున్నాము. ఆ బహిరంగలేఖ కొందరు పెద్దల సమక్షమున నాకు అందచేయబడియుండెను. అట్టిఅచ్చుప్రతి నొకదానిని తిరిగి యిందులో అంటించి రిజస్టరీపోస్టుల ద్వారా మీకు పంపడమైనది.

1. వైశ్యులు సంకరులైనారు.
2. వీరిని సంఘములో కలుపుకొనుటకు ప్రాయశ్చిత్త ములు కూడ లేవు.
3. బ్రాహ్మణులకు లంచములనిచ్చి వారిచే వైశ్యులు నూతనముగ వేదోక్తకర్మలను చేయించుకొను చున్నారు.
4. ఇట్లుండ ధనాదులచే బ్రాహ్మణులను వంచనచేసిన వారిలో ఆతుమ్మూరి లక్ష్మీనరసింహ నామకుడు అగ్న్యాధానము కూడ చేసినాడు.

అని మీరు ఆమోదించి ప్రచురించిన యీ సంగతులు యదార్థములని ఋజువుచేయ వలసిన బాధ్యత మీయందు నిలచియున్నది. మీరు యీ విషయములను ఋజువుచేసెదరా ? ఆప్రకారము ఋజువుచేయజాలనియెడల పీఠాధిపతులు వ్రాసిన గ్రంథము అప్రమాణగ్రంథమని మీరువ్రాసి ప్రకటించెదరా?

ఈ లేఖ మీకు అందిన నాలుగు దినములలో ప్రత్యుత్తర మీయగోరుచున్నాను.

కోట నాగభూషణం గుప్త
విజయవాడ వైశ్యమహాజనసభ కార్యదర్శి,

Acknowledgment

నెం 426 గల రిజష్టరుడు నోటీసు ముట్టినది.
మల్లాది రామకృష్ణశాస్త్రి చయనులు వ్రాలు (అని ఉన్నది)
7—9—33
గవర్నరుపేట,
బెజవాడ.

పైన దెల్పిన రిజష్టరుడు నోటీసుకు చయనులవారు ప్రత్యుత్తరమీయ లేదు.

బందరు. } వెలుమూరి సూర్యనారాయణ బి. ఏ. బి యల్.
21-933 } సభాధ్యక్షులు.

తెనాలి భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.